

# శ్రీ వేములవాడ

# భీమలింగేశ్వరస్వామి

# జీవిత చరిత్ర




శ్రీ వేములవాడ భమలింగేశ్వరస్వామి అధ్యయన కేంద్రం

శ్రీ వేములవాడ
# భీమలింగేశ్వరస్వామి జీవిత చరిత్ర

**అధ్యయనం**

శ్రీ వేములవాడ భీమలింగేశ్వరస్వామి అధ్యయన కేంద్రం
www.shribheemalingeswaraswamy.org

**గ్రంథ రూపకల్పన**

కాచరగడ్ల మీడియా కార్పోరేషన్
www.kacharagadla.in

## తొలి పలుకు

ఓం నమో దేవదేవాయ ద్రాక్షరామ భీమేశ్వర పుత్రనే |
కవీశ్వరాయ శ్రీ వేములవాడ భీమలింగేశ్వరాయ నమః ||

ఓంకార స్వరూపుడైనటువంటి పరమేశ్వరుని అంశతో జన్మించినవారు, త్రిగుణాతీతులు (సత్వ, తమో, రజో గుణాలేవీ అంటని వారు) "శ్రీ వేములవాడ భీమలింగేశ్వరస్వామి" తన జీవితం తొలిదశలో, కవీశ్వరునిగా ప్రాశస్త్యం గడించారు. మలిదశలో దైవాంశసంభూతులుగా భక్తకోటి ఆరాధ్య దైవంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో గల అనంతపురము జిల్లా, గడేకల్లు గ్రామాన కొలువైయున్నారు.

భీమలింగేశ్వరుడు ఆద్యంతాలు లేని వాడు, అతిశయించువాడు (ఎక్కడి నుండైనా, ఎక్కడికైనా; ఏ కాలం నుండైనా, ఏ కాలానికైనా అవలీలగా పయనించువాడు) మరియు రూపాతీతుడు. అందుకే సుమారు 700 సంవత్సరాలు (క్రీ.శ. 11వ శతాబ్దం నుండి క్రీ.శ. 17వ శతాబ్దం వరకు) భీమకవిగా (క్రీ.శ. 11వ శతాబ్దం – క్రీ.శ. 14వ శతాబ్దం వరకు) మరియు భీమలింగేశ్వరుడిగా (క్రీ.శ. 14వ శతాబ్దం – క్రీ.శ. 17వ శతాబ్దం వరకు) ఈ నేలపై నడియాడినారు.

ఈ పవిత్రగ్రంథంలో భీమలింగేశ్వరస్వామి వారి చరిత్రను ఘట్టాలుగా విభజించి పూర్తిస్థాయిలో వివరించడం జరిగింది. ప్రతి అక్షరం శ్రీ భీమలింగేశ్వరుడి ప్రతిరూపం, స్వామి వారి కీర్తికి నిదర్శనం. ఇట్టి గ్రంథం ప్రతి తెలుగు వారి ఇంట్లో ఉండాలని ఆకాంక్షిస్తూ...

- శ్రీ వేములవాడ భీమలింగేశ్వరస్వామి అధ్యయన కేంద్రం

# విషయసూచిక

## మొదటి భాగం



## రెండవ భాగం

భీమలింగేశ్వరస్య చరిత కథామృతం భీమేశ్వర ప్రతిరూప గుణానుకీర్తనమ్ |
సోమనాథపుత్ర తమ పాదసేవనం సంభవంతు మమ జన్మజన్మని ||

ఓం నమో శ్రీ వేములవాడ భీమలింగేశ్వరాయ నమః

## ఓం

## శ్రీ భీమేశ్వరాయనమః

## అవిఘ్నమస్తు

==============

## జన్మ వృత్తాంతము

తూర్పుగోదావరి జిల్లాలోని దక్షారామమునకు 12 కిలోమీటర్ల దూరాన వేములవాడ అనే గ్రామము ఉంది. ఆ గ్రామంలో సోమనాథామాత్యుడను ఒక నియోగి బ్రాహ్మణుడుండెను. ఎంతకాలానికీ ఇతనికి సంతానము కలుగలేదు. సంతానము కోసం ఇతను ఐదుగురిని పెళ్ళాడాడు. శివభక్తిపరాయణుడై యజ్ఞయాగాలను చేస్తూ, ఎన్నో విధాలుగా పరమేశ్వరున్ని ఆరాధించాడు. ఎన్నో దానధర్మాలు చేశాడు. అయినా పుత్రలేమి బాధ మాత్రం తప్పలేదు ఇతనికి. ఇలా కాలం గడుస్తుండగా ఒకనాటిరాత్రి పరమేశ్వరుడు స్వప్నంలో దర్శనమిచ్చి "నీ మరణం తర్వాత నీకు పుత్రుడు కలుగుతాడు. అతని వల్ల నీకు పుణ్యలోకసిద్ధి కలుగుతుంది" అని చెప్పాడు. ఆనాటి నుంచి దిగులు మానేసి, సంతోషంగా కాలం గడిపి మరణించాడు. ఇతని ఐదుగురు భార్యలలో చివరి భార్య మాచెమ్మ. అందరిలోనూ చిన్న వయస్సు కలది. అమాయకురాలు. నిష్కల్మషమైన మనసు కలది, భర్తలాగా పరమేశ్వరుని మీద అపారమైన భక్తి కలది.

భర్త మరణము తర్వాత ఒంటరి జీవితము అనుభవిస్తున్న మాచెమ్మ తన సవతులతో పాటి ఒకనాడు భీమేశ్వరున్ని దర్శించడానికి ద్రాక్షారామము వెళ్ళింది. దక్షారామములో శివరాత్రి మహోత్సవాలు జరుగుతున్న రోజులవి. అశేషభక్తకోటి అంతా గోదావరీ స్నానము చేసి భీమేశ్వరుని దివ్యసుందరమూర్తిని దర్శించి, తమతమ కోరికలను విన్నవించుకోసాగారు. పుత్రులు లేనివారు సంతానం కోరుతూ పూజలు చేయించసాగారు. మాచెమ్మ కూడా గోదావరీ స్నానమాచరించి భీమేశ్వరున్ని దర్శించింది. నిర్మలమైన మనసుతో తనకూ ఒక సుపుత్రుడను అనుగ్రహించమని ప్రార్థించింది. అది విని తనతో పాటి వచ్చిన యువతులందరు ఫక్కున నవ్వి హేళన చేశారు, కానీ తాను మాత్రం "సంతానానికి మీరొక్కరేనా అర్హులు. నేను అర్హురాలిని కానా? దయాసాగరుడైన ఆ భీమేశ్వరుడు అందరినీ సమానముగానే చూస్తాడు గానీ, ఒకరింట సున్నమును, మరొకరింట వెన్నను పెట్టడు గదా? మీ అందరికీ పుత్రుడను అనుగ్రహించి నాకు మాత్రం అనుగ్రహించకపోడు కదా!" అని బదులిచ్చి వెళ్ళిపోయింది.

అలా కోరిన యువతులందరికీ భీమేశ్వరుడు సంతానప్రాప్తి కల్గించాడో లేదో కానీ, సోమనాథామాత్యుని స్వప్నాన్ని నిజంచేస్తూ మాచెమ్మకు ఒక సుపుత్రుడిని అనుగ్రహించాడు. ఒకనాడు మాచెమ్మ నిదురలో ఉన్నప్పుడు మిరమిట్లు గొలిపే మహాజ్యోతి ఒకటి తన కడుపున ప్రవేశించినట్లు ఆమెకు స్పర్శ కలిగింది. ఆమె అది స్వప్నస్థితిగానే భావించింది. గర్భవతి అయ్యే దాకా ఆమెకు ఆ విషయం అర్థం కాలేదు. భీమేశ్వరుని కరుణాకటాక్షాల వలన గర్భవతి అయిన మాచెమ్మకు నవమాసాలు నిండాయి. 11వ శతాబ్ధమున, ప్రభవనామ సంవసత్సరము, శ్రావణశుక్లపంచమి రోజు శుక్రవారమునాడు, ఒక శుభముహూర్తాన కుమారునికి జన్మనిచ్చింది. ఆమె బాలుడి వైపు చూసినపుడు ఒక మహాజ్యోతిశ్చక్రము పరివేష్టమై చుట్టి హఠాత్తుగా మాయమైపోయింది. ఆ పసిబాలుని తలపై జటాభారము, గంగాజలము, చంద్రరేఖ కనిపించినట్లయ్యింది ఆమెకు. ఆపిల్లవాని కంఠము నుండి ఒక చిన్న నాగు తన్ను బుస్సుమంటూ తాకవచ్చినట్లనిపించింది. కనులను నులుముకొని చూసేసరికి అవేవియూ కానరాక నవ్వుతున్న పిల్లవాడు మాత్రమే కనపడ్డాడు. ఈ భ్రమ ఏమిటో ఆమెకు ఏమీ అర్థం కాలేదు.

# బాల్యము

పిల్లాడికి నాలుగేళ్ళప్రాయం వచ్చింది. "అమ్మా" అని పిలువడం మొదలుపెట్టాడు. భీమేశ్వరుని వరపుత్రుడు కావున ఆ బాలున్ని "భీమన్నా", "భీమేశ్వరా" అని పిలుస్తూ మాచెమ్మ ఎంతో గారాభముగా పెంచసాగింది. భీమన్నకు నామకరణమహోత్సవం చేయడానికి ఎవరూ ముందుకురాలేదు. తప్పటడుగులు వేసే వయసు గడిచింది.

ఊరి వారంతా భీమేశ్వరుని వరం వల్ల పుట్టిన బాలుడీ భీమన్న అన్న సత్యాన్ని అర్థం చేసుకోలేక, విధవ బిడ్డకు జన్మనిచ్చిందని భావించారు. అందరూ ఒక్కటై మాచెమ్మను ఊరి నుంచి వెలివేశారు. ఏ తప్పూ చేయని మాచెమ్మ ఎవరి మాటలను పట్టించుకోకుండా, పరమేశ్వరుని మీద భారం వేసి, ధైర్యంగా, అన్నీ తానై భీమన్నకు ఏ లోటు రాకుండా చూసుకొనేది. సాధ్యమైనంత వరకూ లోకపు దృష్టిని తప్పిస్తూ పెంచసాగింది. గురుకుల పాఠశాలకు పంపి విద్యాభ్యాసము చేయించలేకున్నా, మాచెమ్మ భీమన్నకు శ్రీరాముని ధర్మనిష్ఠ, కుమారస్వామి విక్రమము, పరమశివుని భక్తవాత్సల్యము, శ్రీకృష్ణ పరమాత్ముని రాజనీతి, నలదమయంతుల కష్టదశ మొదలైన పురాణ వృత్తాంతాలను చెబుతూ పెంచింది. భీమన్న మేదస్సు దేనినయినా శరవేగముగా గ్రహించేది.

ఆటలాడునపుడు తన తోటిబాలలు చుట్టూ చేరి భీమన్నను పరిహాసం చేయడం, తన తల్లిని వెలివేయడం, ఊరిలో ఏ విశేషం జరిగినా తమను మాత్రం పిలవకపోవడం పసివాడైన భీమన్నకు పెద్దగా అర్థమయ్యేవి కావు. తమ ఇంటికి ఎవ్వరూ వచ్చేవారు కారు. ఇవన్నీ గమనించి విచారించేవారు. రోజులు గడిచే కొద్ది లోకజ్ఞానం సంపాదిస్తూ, భీమన్న పదహారేళ్ళప్రాయం వాడయ్యారు. తండ్రి మరణం తర్వాత తాను పుట్టడం వల్ల తన తల్లిని నిందిస్తున్నారనీ, తనను పరిహాసం చేస్తున్నారని తెలుసుకున్న భీమన్న, ఎంతో ఆవేశంతో తన తల్లినే జరిగిన సంగతి అడుగుదామని ఇంటికి వచ్చారు. రాయెత్తి తన తల్లితో " అమ్మ అందరూ నన్ను గోళకుడని నిందిస్తున్నారు. అది నిజమేనా? నా తండ్రి ఎవరో చెప్పవా?. నిజమేమిటో తెలియజేయవా? లేకుంటే ఈ రాయితో నీ బుర్ర పగులగొట్టమంటావా?" అని నిలదీసాడు. అందుకు మాచెమ్మ " బిడ్డా! అంత కోపం ఎందుకు నయనా. నేను నిజం చెప్పినా నువ్వు నమ్మి ఈ ఊరివారిని నమ్మించగలవా? లేదు కదా? తిన్నగా దక్షారామానికి పోయి, అక్కడ భీమేశ్వరున్ని దర్శించి, శివలింగమును కౌగిలించుకొని ఇదే ప్రశ్నను అడుగు. ఆ భీమేశ్వరుడే నీకు అంతా చెబుతాడు. అలా ఆయన పలుకకపోతే నా మీదకు రాయి ఎత్తి అడిగిన విధంగానే తనను కూడా అడుగు. నీ ప్రశ్నకు తప్పకుండా సమాధానము లభిస్తుంది." అని చెప్పింది.

భీమన్న రాయి పారేసి తల్లి పాదాలకు నమస్కరించి, భోజనం కూడా చేయకుండా తక్షణం దక్షారామము బయలుదేరారు. దారి పొడువునా భీమేశ్వరుని ధ్యానము చేసుకుంటూ దక్షారామము చేరారు. అక్కడ భీమేశ్వరున్ని దర్శించి, లింగమును కౌగిలించుకొని పరిపరి విధములగా స్తోత్రము చేస్తూ, తన తండ్రి ఎవరో నిజం చెప్పమని వేడుకున్నారు. ఎంత వేడుకున్నా పరమేశ్వరుడు పలుకకపోవడంతో భీమన్న మనసులో ఆవేదన అధికమయ్యింది. ఎలాగైనా పరమేశ్వరు నుంచి సమాధానంతోనే తిరిగి వెళ్ళాలని సంకల్పించుకున్న భీమన్న, తన తల్లి మాట ప్రకారం "భీమేశ్వరా! నాకు సమాధానం చెబుతావా? లేక పలుకలేని నీ మూగపాశాన లింగమును ఈ రాయితో పగులగొట్టి, అదే రాయితో కబుర్లు చెప్పిన నా తల్లి తలను పగులగొట్టమంటావా?" అని రాయెత్తి భీమేశ్వరునిలింగముపై వేయబోయారు. వెంటనే పరమేశ్వరుడు ప్రత్యక్షమయ్యి భీమన్నను ఆపి పుత్రవాత్సల్యముతో చేరదీసి, "కుమారా! నువ్వు నీ తండ్రి మరణించిన తర్వాత నా అనుగ్రహము వలన, నా అంశతో జన్మించినావు. కావున నువ్వు నా తనయుడవే. నీ

తల్లి మహాభక్తురాలు. ఆమె పుత్రలాభమును కోరింది. నిష్కల్మషమైన భక్తురాలు కోరిన కోరికను తీర్చడం కోసము నిన్ను అనుగ్రహించాను" అని భీమేశ్వరుడు పలికాడు.

భీమన్న "తండ్రీ! నేను నీ కుమారుడనైతే, నన్ను అందరూ ఎందుకు నిందిస్తున్నారు?" అని అడుగగా, బోళాశంకరుడు "లోకులు నన్ను పూజిస్తారే గానీ నా మీద పరిపూర్ణమైన విశ్వాసంతో కాదు. నేను వారి అవసరాలు తీర్చుట కోసము. వారి అవసరాలను తీరుస్తాను అన్న విశ్వాసము వారిలో ఉంది కానీ, అది సంపూర్ణమైనది కాదు. అందువల్ల వారు నా లీలలను నమ్మలేకపోతున్నారు. వారు భగవంతుడు ఒక వితంతువుకు కూడా కుమారున్ని ఇవ్వగల శక్తిస్వరూపుడని విశ్వసించలేని అజ్ఞానాంధకారులవడం వలన నిన్నూ, నీ తల్లిని నిందించి వెలివేసారు. నీకు ఉపనయనం చేసి, విద్యాభ్యాసము చేయడానికి ఎవరూ సిద్ధపడలేదు కావున, తండ్రిగా ఈ బాధ్యతను నేనే నెరవేరుస్తాను" అని చెప్పి భీమన్నను నాలుక చాచమన్నాడు. పరమేశ్వరుడు భీమన్న నాలుక మీద వాగ్భామినీ బీజాక్షరాలను లిఖించి "నా తనయుడవైన నీవు, సకలశాస్త్రపారంగతుడవు. సకల భాషావేదివి. ఇక దేశయాటనము చేస్తూ నానా రాజసభలందు అనర్గళమైన, కవిత్వం చెబుతూ వర్ధిల్లెదవు. నేటి నుంచి పశుపక్షిమృగాలు సకలప్రాణికోటి నీ మాటకు లోబడుతాయి. జీవులను పుట్టింప, గిట్టింప శక్తి కలదు నీకు. నేటి నుంచి నీవు ఏది పలికినా, అది జరుగుతుంది. నీ మాటకిక తిరుగుండదు. నువ్వు ఆడింది ఆట, పాడింది పాట. సంఘమున ఎంతటి వారైననూ నీ మాటకు లోబడవలసినదే." అని వరం ప్రసాదించి మాయమయ్యాడు. భీమన్న తాను స్వయానా పరమేశ్వరుని కుమారుడని తెలిసి మహదానందముతో వేములవాడకు బయలుదేరారు.

భీమేశ్వరస్వామి దర్శనానికి వెళ్ళిన భీమన్న ఇంకా ఇంటికి తిరిగి రాకపోవడంతో మాచెమ్మ కంగారుపడుతూ "భీమన్న మొండి పట్టుదల కలవాడే. దారిలో ఏ ఇబ్బంది కలుగలేదు కదా? నా చిట్టితండ్రి మార్గము తెలిసి క్షేమముగా వెళ్ళాడా? భీమేశ్వరుడు దర్శనమిచ్చుంటాడా?" అని పరిపరి విధాలుగా ఆలోచిస్తూ, భీమేశ్వరుని మీద భారం వేసింది. "సర్వేశ్వరా! ధీనబంధూ! పరమేశా! శతకోటి వందనాలు. నా కుమారుని నా వద్దకు క్షేమంగా పంపుమని" వేడుకొనసాగింది. ఇంటికి చేరిన భీమన్నను చూడగానే, మాచెమ్మకు పట్టరాని సంతోషం కల్గింది. వచ్చీరాగానే అమ్మకు పాదాభివందనం చేసి "అమ్మా నా మాటలతో నీ మనసును నొప్పించినందుకు నన్ను క్షమించు" అని వేడుకొని, దక్షారామ విశేషాలన్నిటినీ వివరించారు.

వేములవాడ భీమకవి సంస్కృతంలో రచించిన జ్యోతిష్య గ్రంథమును తెలుగులో అనువదిస్తూ, ఒక కవి భీమకవి జన్మవృత్తాంతాన్ని ఈ సీసపద్యంలో వివరించారు.

సీ. శ్రీకరంబై ధరఁ జెలువుఁగాంచినయట్టి
భీమపురంబునఁ బ్రేమమీఱ
భీమేశ్వరుండునుఁ బ్రియముతో భక్తుల
కోర్కులొసంగుచుఁ గొమరు మిగుల
నొకనాఁడు తత్పురి యువతులుఁ గొందఱు
భక్తి భీమేశ్వరు భవనమునకుఁ
బోయి పుత్రులవేడ ముగ్ధత్వమున నొక్క
విధవ కుమారుని వేడ్కఁగోర
నాలేమ ముగ్ధత కపహసించుచు నల
భీమేశ్వరుడు  పుత్రుఁ బ్రీతి నొసఁగ
నా కాంత గర్భిణియై కాంచెఁ దనయునిఁ
గలియుగాదిని బ్రేమ గడలు కొనగఁ
బ్రభవ వర్షంబున శ్రావణమాసంపు
శుక్లపక్షంబున శోభనంబు
మీఱఁ బంచమి శుక్రవారంబునను హస్త
యందుఁ గన్యాలగ్నమందు వెలయ
వెలివెట్టి రక్కాంత విధవయై పుత్రుని
గాంచెనటంచును  గడమజనము
లంతఁ దత్తనయుండు నైదేండ్ల బాలుడై
పురి బాలకుల తోడఁ బొసగనాడ
జనులెల్ల గోళకుండని నిందఁజెసిన
రోషించి యాతండు దూషితయని
ఊయెత్తి తన తల్లి నేయఁ బోయిన యది
భీమేశ్వరుడు తండ్రి ప్రేయమనిన

వెసఁజని యాతని ప్రేయనుంకించిన
భీమేశ్వరుడు దయ పెద్దగలిగి
ప్రత్యక్షమైవత్స! రమ్మని తగఁజేరి
పశుపక్షి మృగములఁ బ్రాణికోట్ల
గలిగించు శక్తియుఁ గరమొప్ప జనులకు
బిడ్డల నాయువుఁ బెంపుదనర
సంపదలొసగెడు సామర్థ్యమునునిడి
కానిది యౌనని యైనదెల్ల
గాదనినట్టులఁ గావించు బలమును
మునురాఁ గలుగునదియునుఁ దెలుపఁగఁ
బ్రావీణ్యమునునిచ్చి ప్రబలుము నీవని
వరమిచ్చెఁ బదియాఱు వర్షములకు
నాతనికి సహాయమై సరస్వతియును

* * * * * * * *

నతడెట్లు చెప్పిననట్ల చేయుచునుండె
సరిలేని కీర్తిచే జగతి వెలసి
యతడు చెప్పిన శాస్త్రమం దధిక భక్తి
కలిగి నిజమని తలచినఁ గలుగు శుభము
కోర్కెలెల్లను ఫలియించు గురుతరముగ
సకల జనులకుఁ దప్పదు జగతిలోన

# బ్రాహ్మణ - సంతర్పణ

తమను బహిష్కరించిన సంఘమును, తానే బహిష్కరించినవాడిలా, భీమన్న నాటి నుంచి ఊరి బాలలతో ఆటలు మాని, వివిధ గ్రంథాలను చదువుతూ పెరిగి పెద్దవాడయ్యారు.

తల్లి ప్రథమపూజ్యురాలు. తల్లి మీద నిందలు మోపితే ఎంతటి వారికైనా భరింపతరమా? ఎంతో ఆత్మాభిమానం కలిగిన భీమన్న ఊరుకుంటారా? పరమేశ్వరుని వరమునందుకున్న తర్వాత భీమన్న చేసిన మొదటి పని తన తల్లిపై మోపిన అపవాదును తొలగించి, అందరి కళ్ళు తెరిపించడం. ఒకనాడు వేములవాడలో ఒక బ్రాహ్మణుని ఇంటిలో సంతర్పణ జరుగుతోంది. ఆ ఇంటి యజమాని అందరినీ ఆహ్వానించాడు, కానీ భీమన్నను మాత్రం ఆహ్వానించలేదు. భీమన్న పిలవకపోయినా సంతర్పణకు వెళ్ళారు. నేరుగా లోపలికి వెళ్ళి కూర్చొని, తనకు కూడా భోజనం వడ్డించమని అడిగారు. అక్కడి వారంతా భీమన్నను బయటకి పంపివేసి, నీవు లోనికి రావద్దని చెబుతూ తలుపులు వేసేశారు. బాలభీమన్న "భీమేశ్వరుని తనయుడనైన నన్ను విస్మరించి మీరు ఈ పూట భోజనం చేయలేరు" అని చెప్పి బయట అరుగుపై కూర్చొన్నారు. లోపల జరుగుతున్న తంతు అంతటినీ గమనిస్తూ వడ్డన ప్రారంభమయ్యేంత వరకు ప్రశాంతంగా ఉన్నారు. వడ్డన పూర్తి అయిన వెంటనే ఈ క్రింది పద్యం చెప్పారు.

ఉ. "గొప్పలు సెప్పకొంచు నను౦ గూటికి బంక్తికి రాకుమంచునీ
ద్రిప్పుడు బాపలందఱును౦ దిట్టిరి౦ గావున నొక్క మాఱు మీ
యప్పములన్ని కప్పలయి యన్నము సున్నము౦ గాగ మాఱుచున్
బప్పును శాకముల్ పులుసు బచ్చడులు౦ జిఱురాలుగావుతన్"

<u>భావము:</u> తాము (సత్బ్రాహ్మణులమని) గొప్పలు చెప్పకుంటూ, నన్ను భోజనమునకు రావద్దని ఈ బ్రాహ్మణులందరూ తిట్టారు. కావున ఒకసారి మీ అప్పడాలన్నీ కప్పలుగా, అన్నము అంతా సున్నముగా మారి, పప్పు, కూరలు, పులుసు, పచ్చడులు చిన్నచిన్న రాళ్ళుగా అవ్వుగాక!

తక్షణమే వడ్డింపబడిన అన్నమంతా సున్నముగా మారింది. అప్పడాలన్నీ కప్పలై బెకబెక మంటూ గెంతుతూ, అటూ ఇటూ వెళ్తున్నాయి. పప్పు, పులుసు, పచ్చడి అన్ని చిన్నచిన్న రాళ్ళుగా మారిపోయాయి. ఈ వింత మార్పును చూసి భోజనానికి కూర్చున్న బాపలందరూ చాలా కలవరపడ్డారు. సంతర్పణ చేయిస్తున్న ఇంటి యజమాని అందరినీ చూసి కలవరపడవద్దని చెప్పి, మళ్ళీ వడ్డించడానికి క్రొత్త విస్తరులను వేయించాడు. తీరా అన్నపురాశి వద్దకు వెళ్ళి చూసేసరికి అక్కడ కూడా అన్నమంతా సున్నంగా మారిపోయి ఉంది. గంపలోని అప్పడాలేమో కప్పలయ్యి బయటకు ఎగురుతూ గెంతులేస్తున్నాయి. మిగితా వంటలన్నీ రాళ్ళుగా మారిపోయి ఉన్నాయి. ఆ ఇంటి యజమానికి ఎందుకిలా జరిగింది? ఏమి చేయాలి? అని దిక్కుతోచని స్థితిలో పడ్డాడు. అంతలో అక్కడి వారిలో భీమన్న చెప్పిన పద్యం విన్న ఒక బ్రాహ్మణుడు, ఆ ఇంటి యజమాని వద్దకు వెళ్ళి ఆరుబయట కుర్చుని భీమన్ననే ఇవన్నీ ఇలా మారాలని పద్యం చెప్పాడనీ, ఇదంతా ఆ భీమన పలుకుల మూలంగానే జరిగిందనీ చెప్పాడు. అప్పుడు తెలిసింది ఆ యజమానికి "నన్ను విస్మరించి మీరు ఈ పూట భోజనం చేయలేర"ని చెప్పిన భీమన్న మాటలకర్థం.

అతను వెంటనే భోజనానికి వచ్చిన బ్రహ్మణులందరినీ భీమకవి వద్దకు పిలుచుకొని వెళ్ళి, వాటిని తిరిగి భోజనపదార్థాలుగా మార్చమని అడిగాడు. అలా చేసినట్లయితే భోజనానికి రానిస్తామని చెప్పారు. వారికి భీమకవి అంతరార్థం ఇంకా అర్థం కాలేదు. భీమకవి "మీరందరూ గొప్పజాతి వారే కదా! మరి మీరే మార్చుకొవచ్చుగా. నేను మీ అంతటి వాన్ని కాదు కదా! నా వలన ఏమవుతుంది? చెప్పండి?" అని అడిగాడు. ఆ బ్రహ్మణుల కన్నులు తెరచుకున్నాయి. వెంటనే వారు "భీమన్నా! మేము తప్పుగా ప్రవర్తించాము. నువ్వు మహానుభావుడివి. నిన్ను భోజనానికి రానివ్వకుండడం మా అందరి అపరాధము. మమ్మల్ని అనుగ్రహించి యథాప్రకారము వాటిని భోజనసముదాయముగా మార్చండి. అంతేకాక మీరు కూడా మాతో పాటి భోజనానికి కూర్చొని మమ్ము కృతార్థులను చేయండి. ఇప్పటి నుంచి మీతో గౌరవాభిమానాలతో నడుచుకుంటాము" అని నమస్కరిస్తూ వేడుకున్నారు. భీమకవి తిరిగి ఇంకో పద్యం చెప్పారు.

మ. "ఘనుడౌ వేములవాడ వంశజుడ దక్షారామ భీమేశ నం
దనుఁడీ భీమన యంచు గుర్తెఱింగి, నిందల్ మానినన్ గౌరవం
బుననీ విప్రులుఁ జూచిరందువలనఁ బూర్వస్థితిన్ జెంది భో
జన వస్తు ప్రకరంబులన్నియు యథాస్వస్థంబు లౌగావుతాన్"

భావం: ఈ బ్రాహ్మణులందరూ, గొప్పవాడు, వేములవాడ వంశస్థుడు, దక్షారామ భీమేశ్వరుని తనయుడీ భీమన అని తెలుసుకొని, నిందించడం మాని, నను గౌరవంతో చూసారు. అందువలన ఈ భోజన, వస్తు సముదాయమంతా కూడా మునుపటి రూపు పొంది వాటి పూర్వస్థానానికి వచ్చును గాక!

వెంటనే మునుపటిలా అన్నపురాశి ప్రకాశించింది. కప్పలన్నీ తిరిగి అప్పడాలుగా మారిపోయాయి. చిన్నచిన్న రాళ్ళన్నీ తిరిగి పప్పు, పులుసు, పచ్చడులుగా మారిపోయాయి. విస్తరులన్నీ తిరిగి భోజనంతో నిండిపోయాయి. ఇది చూసిన ఆ బాపలంతా భీమకవి మహత్యానికి ఎంతో ఆశ్చర్యపడ్డారు. వెంటనే భీమకవిని తమతోపాటి భోజనానికి తీసుకుపోయి భోజనవరుసలో అగ్రస్థానాన కుర్చోబెట్టి గౌరవించారు. ఊరివారంతా ఈ భీమన్న దక్షారామ భీమేశ్వరుని వరపుత్రుడని తెలుసుకొని మసలుకున్నారు. ఇన్ని రోజులు నిందలు మోపి, వెలివేసి బాధ పెట్టినందుకు తమను మన్నించాల్సిందిగా మాచెమ్మను వేడుకున్నారు. నాటి నుంచి వారిపట్ల గౌరవాభిమానాలతో నడుచుకున్నారు.

నాటి నుండి భీమన్న అద్భుతమైన కవిత్వము చెబుతూ "వేములవాడ భీమకవి"గా లోకప్రసిద్ధుడయారు. భీమకవికి కవిత్వము అమోఘముగా హిమాలయాల నుండి ప్రవహించే భగీరతుడిలా(గంగానదిలా) ప్రవహించేది. శబ్ధార్థములు ఊట బావులవలే పెనవైచికొని ఈ మహాకవి కంఠసీమ నుండి వెడలసాగెను. నాటి నుండి భీమకవికి కవిత్వమే జీవితమైనది. ఎట్టి కవిత్వమైనా చెప్పగలిగే వారు. అందరూ ఉద్దండకవి అని పిలిచేవారు. తాను రాజ సభలకు వెళ్ళినపుడు తాను దక్షారామభీమేశుని పుత్రుడనని చెప్పేవారు, అంతేకాదు పరమేశ్వరుని స్వభావాన్ని పునికి పుచ్చుకున్నారు. ఆయన ఆగ్రహము ఎంతో కాలము నిలువదు. తప్పు తెలుసుకొని క్షమించమని అడిగితే చాలు అంతటి

కరుణాహృదయుడై, తన తండ్రిని మించిన తనయుడై శాపవిమోచనం కల్గించేవారు. అంతే కాక అప్పటి నుంచి వారిపై ఎల్లవేళలా అనుగహము కలిగి ఉండేవారు. శాపాన్ని పెట్టడమే కాక, తన శాపాన్ని సమూలంగా పటాపంచలు చేయగల శక్తి కూడా కలిగి ఉండడం వలన ఈయనను  అందరూ శాపానుగ్రహ(శాప+అనుగ్రహ) సమర్థుడని కీర్తించేవారు.

# భీమన్న సప్తాహము

ఒకనాడు భీమకవి ద్రాక్షారామములో సప్తగోదావరీతీరాన పందిళ్ళను వేయించి, యాగశాలలను ఏర్పాటు చేసి మహాసప్తాహము అనే పేరుతో భీమేశ్వరుని ఆరాధిస్తూ ఎన్నో రోజులుగా మాహాయజ్ఞమును నిర్విరామముగా జరిపించారు. ఈ మహాయజ్ఞమునకు చుట్టు ప్రక్కలప్రాంతాల నుండి వచ్చిన అశేషజనవాహిణికి పగలురాత్రిళ్ళు ఏ లోటు రాకుండా చాలా గొప్పగా వసతులను కల్పించారు. ఈ మహాక్రతువుకు వచ్చిన జనప్రభంజననానికి పంచభక్షపరమాన్నాలతో శిష్టకృతిగా భోజనమును పెట్టించారు. అందుకు అవసరమైన పదార్థాలన్నిటినీ తానే మహారాజుకు కబురుపెట్టి ప్రతిదినము తెప్పించేవారు. ఒకనాటి రాత్రి భోజనాలకు నెయ్యి కొరత ఏర్పడింది. వంటచేసే బ్రాహ్మణులు నెయ్యి అయిపోయిందని చెప్పారు. భీమకవి ఇంత రాత్రివేళ ఎవరికి కబురు పంపినా లాభముండదని ఈ క్రింది పద్యమును చెప్పారు.

శా      భీమేశప్రముదంబు సేయఁ గవియౌ భీమన్న సప్తాహము
లీ మంబొప్ప నొనర్చుచుండ నిచటన్ నేయెంత లేకుండె నీ
ధామంబందున నీరిమేల్ ఘృతముగాఁ దత్త్వంబు మాఱించినన్
ధీమంతుల్గొనియాడ నేయి వగుమా ధీసప్త గోదావరీ

భావము: భీమేశ్వరున్ని సంతోషపెట్టడానికి భీమకవి చేస్తున్న సప్తాహమిది. ఇక్కడ ఎంతో నియమనిష్ఠలతో, నిరాటంకంగా జరుపబడుతోంది. అయితే ఈ ప్రాంతమున నెయ్యి కొంచెము కూడా లేకున్నది. గోదావరి నీటినే నెయ్యి రూపమున మార్చివేస్తే విద్వాంసులు, పండితులు, నిను ఎంతో కొనియాడుతారు. ఓ జ్ఞాన సప్తగోదావరీ నెయ్యిగా మారుమా!

వెంటనే ఆప్రాంతములో గోదావరిమాత నెయ్యిగా మారి ప్రవహించింది. ఆ నెయ్యిని పాత్రల్లోకి తీసుకొని వచ్చిన వారందరికీ వడ్డించారు. వచ్చిన వారందరూ తృప్తిగా భోజనం చేసి వారివారి ఇండ్లకు వెళ్ళిన తర్వాత భీమకవి గోదావరినదిని తిరిగి నీటిగా మారి మునుపటిలా ప్రవహించమని చెబుతూ ఈ పద్యం చెప్పారు.

ఉ      వచ్చిన వారలందఱును వారనితృప్తి భుజించి వైచినన్
జెచ్చెఱ సంస్తుతించిరికఁ జెందుము నీ తొలిరూపు నీరమై
పెచ్చు పెఱింగి జీవతతిఁ బ్రీతివహింపగ నింద్రజాలమం
త్రచ్చవి సప్త గౌతమి! ముదంబల రారఁగ మన్నియుక్తవై

భావము: ఓ సప్త గోదావరీ! వచ్చిన వారందరూ తృప్తిగా భోజనం చేసి, ఎంతగానో పొగుడుతూ, వెళ్ళిపోయారు. వెంటనే నీ మునుపటి రూపమైన నీరుగా మారి, మిక్కిలి ఉదృతముగా పెరిగి, విజృంభిస్తూ, భూషణధ్వనులను చేస్తూ గొప్పగా జీవనదియై ప్రవహించుమా!

నేయ్యిమయమైన గోదావరీనది యథాప్రకారంగా మారి జలమయమై ఉరకలేస్తూ ప్రవహించింది.

నాటి నుండి ఆప్రాంతజనులంతా భీమకవి ఒనరించిన మహాసప్తాహవైభవమును గురించి "భోజనము పెట్టించిన భీమకవియే పెట్టించవలెను. శాపమును పెట్టుటను, పెట్టిన శాపమును తీసివేయుటను భీమకవికి తప్ప ఈ భూమిపై మరి ఎవరికీ సాధ్యము కాని పని" అని అక్కడకు వచ్చిన వారందరూ చెప్పుకునేవారు.

# చీదమార్యుడు

ద్రాక్షారామానికి ఏడెనిమిది మైళ్ళ దూరాన కోరుమిల్లి అనే గ్రామం ఉంది. ఆ గ్రామాన్ని రాజరాజనరేంద్రుడు చీదమార్యుడను రాజు శాసనపూర్వకముగా ఇచ్చాడు. ఆ శాసనమును భీమకవి రచించారని అక్కడివారు చెబుతారు. భీమకవి దక్షారామమున ఉన్నప్పుడు చీదమార్యుణ్ణి కలుస్తూ ఉండేవారు. ఒకనాడు వీరిద్దరూ గోదావరిస్నానమాచరించడానికి వెళ్ళారు. కోరుమిల్లి సముద్రమునకు దగ్గరగా ఉండడం వలన గోదావరినదిలోనికి సముద్రపుపోటు తగిలి వేసవి కాలంలో నీరు ఉప్పగా అవుతుంది. భీమకవి ఆచమనము చేయునప్పుడు నీరు మరింత ఉప్పగా ఉన్నందున అతి కష్టంగా మింగారు. చీదమార్యుడు ఇది చూసి ఏమైందని అడిగితే భీమకవి "నీరు కుత్తుకకు దిగనందున కష్టంగా మింగుతున్నాను" అని చెప్పారు. అందుకు సమాధానంగా చీదమార్యుడు "కవీంద్రా! మీరేమంటే అది జరుగుతుంది కదా! మీ చేతిలో ఉన్న పని చేయకుండా ఇంత కష్టపడ్డం దేనికి? ఈ నీటిని ఉప్పదనమును మాన్పించి చప్పబరచకపోతిరా?" అని అడిగాడు. భీమకవి "ఎలాగో నా ఆచమనము అయిపోయిందిలే. ఇంకా నీవు చేయాల్సి ఉంది కదా. నీ కోసము ఆ పని చేస్తాను" అని చెప్పి ఈ పద్యం చెప్పారు.

చ  సుమహితవార్ధి కౌఁగటను జుట్టి నినున్ రహినింప నాతనిఁ
గమన ధృతిఁ బెనంగి మెయిఁ గట్టుక వచ్చితివీవు గౌతమీ
రమణిరో! వీడు సానరుని రమ్యతరంబుగఁ జీదమార్యుఁడా
చమనముఁ జేయఁ బోవు నిఁక సాగవు మాయెదుటన్ వినోదముల్

భావము: ఓ గౌతమీ! మంచివాడు, గొప్పవాడైన సముద్రుడు నిను తన భాహువులతో చుట్టేసి తనలో కలుపుకోగా, నీవు సంతోషంగా అతనిని చేరి తనువును వదులుటకు (సముద్రంలో కలవడానికి) వచ్చావు. చీదమార్యుడు ఎంతో గొప్పగా ఆచమనము చేయబోతున్నాడు. సముద్రుని వదలి ఉండుమా! మా ఎదుట మీ ఆటలు ఇక సాగవు.

అని చెప్పగానే సముద్రపునీరు గోదావరి నీటిలోకి వచ్చి కలవకుండా అక్కడే ఆగిపోగా, నీరంతా ఉప్పదనమును వదిలి చప్పగా మారిపోయింది. ఆచమనము చేసిన తర్వాత అక్కడి నుంచి వెళ్ళిపోవునపుడు భీమకవితో చీదమార్యుడు "మహానుభావా! వేసవిలో నీరు ఉప్పగా మారకుండా చేసి మా గ్రామానికి ఇక ఎన్నడూ నీటిఇద్దడి లేకుండా చేయండి" అని ప్రార్థించగా భీమకవి ఈ పద్యమును చెప్పారు.

ఉ  ఎప్పుడు నిన్ను భీమకవి యిట్టులొనర్చెనొ నాఁటి నుండి నీ
యుప్పఁదనంబుమాని యిట నొప్పుగఁ దియ్యఁదనంబునొందు మా
యొప్పులకుప్ప గౌతమి! మహోజ్జ్వల భక్తుడు చీదమార్యుడున్
దప్పక నిన్ను నెల్లపుడుఁ దద్దయుభక్తిని బూజసేసెడున్

భావము: మా సుగుణసంపన్న రాశి! ఓ గౌతమీ(గోదావరి) ఎప్పుడు నిను భీమకవి ఇలా చేసాడో ఆనాటి నుండి ఉప్పదనము మాని ఇక్కడ తీయదనమును పొందుము! మహా భక్తుడైన చీదమార్యుడు ఎల్లప్పుడూ నిన్ను అత్యంత భక్తి శ్రద్ధలతో పూజిస్తారు.

నాటి నుంచి నేటికి కూడా సముద్రపుపోటు కోరుమిల్లి గ్రామము పొలిమేర దాటిరాక అక్కడే నిలిచిపోయింది. ఇప్పటికి కూడా కోరుమిల్లి గ్రామము వద్ద గోదావరి నీరు చప్పగానే ఉంది.

# మహిమలు

**చెరువు భీమకవికి మార్గమివ్వడం:**

భీమకవి ఒకనాడు దక్షారామమునకు 10 మైళ్ళ దూరాన ఉన్న ఒక ఊరునకు వెళ్తున్నపుడు మధ్యలో ఒక చెరువును దాటాల్సివచ్చింది. ప్రక్క నుంచి వెళ్ళడానికి దారి ఉన్నా కూడా, అది బురదతో నిండి నడవడానికి వీలులేకుండా ఉంది. భీమకవి కొంత సమయము ఏం చేద్దామా అన్నట్లు వేచి చూసారు. ఒకవైపు పొద్దెక్కిపోతోంది. ఇక లాభం లేదని భీమకవి "నాకు మార్గమేర్పడు గాక" అనే సరికి చెఱువు రెండు పాయలై మార్గమును ఇచ్చింది. గట్టున ఉన్న వారంతా ఈ సంఘటనను చూసి ఆశ్చర్యముతో తిలకిస్తూ, భీమకవి దైవాంశసంభూతుడుడని ఇతనికి సాధ్యం కానిది ఏదీ లేదని పొగడసాగారు.

**పౌర్ణమిని అమావాస్య చేసి చూపిన ఘట్టం:**

భీమకవి ఒకనాడు దేవాలయమంటపంలో కూర్చొనుండగా ఒకతను ఈ వేళ తిథి యేమని అడిగాడు. భీమకవి వెంటనే తన మహిమ చూపదలచాడో ఏమో అమావాస్య అని సమాధానమిచ్చారు. అక్కడున్న మిగితా బ్రాహ్మణులంతా "మహా గొప్పవాడివయ్యా నువ్వు? ఈ రోజు అమావాస్యనా? ఈ రోజు పౌర్ణమి కదూ. ఆ విషయం కూడా మరచితివా? " అని నవ్వుతూ అన్నారు. ఆ రోజు పౌర్ణమే. అయితే భీమకవి మాటకి తిరుగులేదు కదా? ఆయన "ఈ రోజు అమావాస్యనే. రాత్రి వేళ చంద్రుడు ఉదయించడు. లోకమంతా చీకటితో నిండిపోతుంది. అప్పటి దాకా ఇక్కడే ఆగి చూడండి." అని చెప్పి తన తండ్రిని మనసులో తలచుకున్నారు. ఎలా అమావాస్య అవుతుందో అదీ చూద్దామని వారంతా ఇండ్లకు వెళ్ళకుండా రాత్రి దాకా అక్కడే ఉన్నారు. రాత్రి ఏడు గంటలు దాటింది. కానీ చంద్రుడు ఉదయించలేదు. అంతా చీకటిగాతో నిండిపోయింది. అక్కడి వారంతా భీమకవి మహిమాన్వితుడని తెలుసుకొని "మహాత్మా! మీరు స్వయానా భీమేశ్వరుని స్వరూపము. ఆయన అంశతో పుట్టిన మీ మహిమ అసాధారణమయినది. ఇక అనుగ్రహించి ఎప్పటిలాగే వెన్నెలను తెప్పించండని" అడిగారు. భీమకవి మరొకసారి తన తండ్రి భీమేశ్వరుని తలచుకొనెను. వెంటనే చంద్రుడుదయించి లోకమంతా పిండి ఆరబోసినవిధంగా వెన్నెలతో నిండిపోయింది. ఆనాటి నుంచి అక్కడివారంతా "సూర్యచంద్రులే గతి తప్పుదురేమో గానీ భీమకవి మాట మాత్రం తప్పదు" అని నమ్మేవారు.

భీమకవిది వైద్యశాస్త్రములో కూడా అందెవేసిన చేయి. అస్వస్థత కలిగినపుడు చాలా మంది ఈయనను ఆశ్రయించేవారు. ఒకసారి భీమకవి వైద్యము చేస్తున్నపుడు, ఔషధము తయారుచేయడానికి పేరాముదపాకులు కావాల్సివచ్చింది. అక్కడ అందుబాటులో ఉన్న ఒకతన్ని పేరాముదపాకులు కోసుకురమ్మని పంపారు. పేరాముదపుచెట్టున్న ఒక బ్రాహ్మణుడి ఇంటికి వెళ్ళి, అతని అనుమతి అడిగాడు. అతను ఆకులు కోసుకోవడానికి ఏమాత్రమూ ఒప్పుకోలేదు. వైద్యానికని చెప్పినా అంగీకరించలేదు. ఇక వేరే చోటెక్కడా అతను పేరాముదపాకు చెట్టు కనపడనందున, తప్పనిసరి పరిస్థితుల్లో ఆ బాపడిదొడ్లోనే అతనికి తెలియకుండా ఆకులు కోసుకొనే ప్రయత్నం చేసాడు. అది చూసిన బ్రాహ్మణుడు, అతన్ని దారుణంగా కర్రతో మోదడం మొదలెట్టాడు. ఇది చూసిన వారు ఈ

విషయం భీమకవికి చెప్పడంతో నేరుగా అక్కడకు వెళ్ళారు. వైద్యం కోసం సహాయమడిగితే దారుణంగా కొట్టినందుకు గాను అతన్ని సత్తువ లేకుండా పడిపొమ్మని శపించి, పారాముదపాకులను కోసుకొని వెళ్ళిపోయారు.

తాను ఈ ఊరిలో ఉంటే తన విద్యామాహత్యము వెల్లడికాదని, మన ఇంట ఉన్న సంజీవని మొక్క ప్రాణమును కాపాడునదే అయిననూ, నలుగురికి ఉపయోగపడకపోతే దానికి తగిన న్యాయము చేయకుండా నిర్లక్ష్యము వహించినట్లేనని, అలానే తన విద్య ఈ ఊరికే పరిమితం కారాదని, నా తండ్రి పరమేశ్వరుడు అనుగ్రహించిన ఈ విద్యామహత్యము లోకానికి వెళ్ళడిచేసి పరిపూర్ణ న్యాయం చేయాలని తలిచాడు. వరమిచ్చునపుడు భీమేశ్వరుని మాటను ప్రకారం, తన తల్లి ఆశీర్వాదమును తీసుకొని, నానా రాజులను సందర్శించనారంభించారు. తన ఉద్దండ కవిత్వంతో ఆనాటి చక్రవర్తులను రంజింపచేసి వారిని మెప్పించారు. వారిచే ఘనసత్కారాలను, సన్మానాలను, కనకాభిషేకాలను పొందారు. ఎక్కడికెళ్ళినా ఎదురన్నది లేక అప్రతిహత వచనుడై విరాజిలారు. తన రాజ సందర్శనాల్ని తొలుత చొక్కభూపతితో మొదలు పెట్టారు.

## చొక్కభూపాలుడు

భీమకవి అనుగ్రహపాత్రులలో చొక్కభూపాలుడు ముఖ్యుడు. రాజరాజనరేంద్రుడు రాజమహేంద్రవరమును పాలిస్తున్న కాలంలోనే చాళుక్య వంశస్థుడైన చొక్కభూపాలుడు ఏలూరు సమీపంలో ఉన్న పెదవేంగి పట్టణమును రాజధానిగా చేసుకొని పరిపాలించాడు.

భీమకవి ఒక రోజు చొక్కభూపాలుడిని కలవడానికి పెదవేంగి పట్టణానికి వెళ్ళారు. తానాడిందల్లా ఆట, పాడిందల్లా పాటయ్యే వేములవాడ భీమకవే స్వయంగా తన రాజ్యానికి వచ్చారన్న సంగతి తెలుసుకున్న వెంటనే, భీమకవికి ఎదురెళ్ళి సగౌరవంగా తన ఆస్థానానికి పిలుచుకువచ్చాడు. తగిన ఆసనముపై కుర్చోబెట్టి, కస్తూరి, పునుగు, జవ్వ మొదలైన సుగంధవస్తువులను ఇచ్చి ఘనంగా సత్కరించాడు. భీమకవీశ్వరుడు తన ఆస్థానమునే ఉంటే, ఆ సర్వజ్ఞుడితో ఇష్టాలాపనము చేస్తూ కాలము గడపవచ్చని ఆలోచించేవాడు. భీమకవి తన వద్ద ఉన్నంతకాలము దేనికీ లోటురానీయకుండా చూసుకున్నాడు.

చొక్కన అతిథిమర్యాదలు భీమకవికి బాగా నచ్చాయి. కొంతకాలము ఇక్కడే ఉండటానికి రాజుతో చెప్పారు. అదే పదివేలుగా భావించి చొక్కన సంతోషంగా భీమకవి ఉండటానికి ఒక రమ్యమైన భవనము ఇచ్చి, అందులో అన్ని వసతులను కల్పించి, మర్యాదలు చూసుకోవడానికి భటులను ఏర్పాటుచేసి, సేవకులను నియమించాడు. భీమకవితో "దేవా! తమకు అన్ని సదుపాయాలను కల్పించాను. ఏ లోటు కలిగినా వెంటనే నాకు తెలియజేయండి. నన్ను అనుగ్రహించి నా ఆస్థానమునే ఉండండి" అని కోరాడు.

ఒక రోజు సాయంత్రం ఉద్యానవనంలో భీమకవితో మాట్లాడుతూ నడుస్తున్నపుడు చొక్కభూపాలుడు "మహానుభావా! మీరు ఏమన్నా అది జరుగుతుందని ఆ ఊరా, ఆ ఊరా చెప్పుకుంటునారు. అది వినడమే కానీ, మీ మహిమను ఎన్నడూ చూసి ఎరుగను. ఒక్కసారి మీ మాధుర్యకవితా మహిమను కనులారా చూడాలని కుతూహలంగా ఉంది. ఒక పద్యము చెప్పి ఈ మల్లెపందిరిన పాతపడి ఉన్న కొయ్య స్తంభాన్ని చిగురింపచేయవా" అని అడిగాడు.

భీమకవి అలానే అని అతని అభీష్టమును తీర్చదలచి ఈ క్రింది పద్యమును చెప్పారు.

శా. ఆనీతాభ్యుపదాన శృంఖల పదాభ్యాలంబిత స్తంభమా
నేనే వేములవాడ భీమకవినే నిఁ జిత్రకూటంబులో
భూనవ్యాపిత పల్లవో ద్భవ మహాపుష్పోపగుచ్ఛంబులన్
నానా పక్వ ఫలప్రదాయి వగుమా నా కల్పవృక్షాకృతిన్

<u>భావము</u>: భూమిలో చక్కగా పొందింపబడి సంకెళ్ళతో బంధింపబడినట్లు ఉండి మల్లెపందిరికి ఊతనిస్తున్న స్తంభమా! నేను వేములవాడ భీమకవిని. నా మనోభీష్టం ప్రకారం ఈ మాయా కొలువుకూటాన వేర్లతో భూమిలోకి వ్యాపిస్తూ, కొమ్మలతో చిగురిస్తూ, పుష్పపుగుచ్ఛాలను, రకరకాల మాగిన పండ్లను అందించే కల్పవృక్షంలా రూపు పొందుమా!

వెంటనే అందరి కళ్ళ ముందే ఆ స్తంభము చిగురించి పువ్వులతోనూ, ఆకులతోనూ, పిందేలతోనూ, పండ్లతోనూ ఎంతో అందంగా మారి చొక్కభూపతికి నేత్రపర్వం చేసింది. చొక్కభూపతి భీమకవి కవితామహిమకు

ఎంతో ఆశ్చర్యముపడి సభవారిమధ్య పొగుడుతూ, భీమకవి వైపుకు చూసి "కవిసార్వభౌమా! నీ మహిమను కనులారా చూసి నాజన్మ ధన్యమయ్యింది. నీ అంతటి వాడిని ముల్లోకాలలో కానీ, త్రికాలాలలో కానీ చూడడం సాధ్యపడదు. నీకు నీవే సాటి. నీతో సరిపోల్చగల వారెవ్వరూ లేరు. అనుగ్రహించి ఈ వృక్షమును మునుపటిలా మల్లెపందిరి కొయ్య స్తంభంగా మార్చివేయండి" అని అడిగాడు. భీమకవి ఈ క్రింది పద్యమును చెప్పారు.

ఉ. "శంభువరప్రసాద కవి సంఘవరేణ్యుడనైన నావచో
గుంభన మాలకించి యనుకూలత నొంది తనూన భావనన్
గుంభినిఁజొక్క నామ నృపకుంజరు పందిటి మల్లెసాలకున్
స్తంభమురీతి నీతనువు దాలిచి యప్పటియట్లయుండుమా"

భావం: పరమేశ్వరుని వరపుత్రుడను, కవితాగ్రేసరుడనైన నా పలుకులను విని, నా అభీష్టం ప్రకారం నీ తనువును దాల్చావు. భువిలో చొక్కన అనే మహాచక్రవర్తి పందిటిలోని మల్లెశాల స్తంభముగా నీ మునుపటి రూపాన్ని పొంది యెప్పటిలాగా ఉండుమా!

వెంటనే ఆ వృక్షం ముందులాగా కొయ్యస్తంభముగా మారిపోయింది. ఇది కనులారా చూసిన వారందరూ భీమకవిని అమోఘవాక్యాధురీణుడని ఎంతో పొగిడారు. మరొక సారి "మహాత్మా మీరు చిరస్థాయిగా ఇక్కడే ఉండమని ప్రార్థిస్తున్నాను. మీరు ఉంటే మారాజ్య ప్రజలెల్లవేళలా సుఖసంతోషాలతో వర్ధిల్లుతారు." అని చొక్కన విన్నవించుకున్నాడు. భీమకవి "మహారాజా తొలుత మీ దర్శనమే చేసుకున్నాను. నానా రాజ సందర్శనము చేసిన తర్వాత మీ ఆస్థానమునకు వచ్చి కొంతకాలము ఇక్కడ ఉండి అనుగ్రహిస్తాను" అని సమాధానపరిచారు. చొక్కభూపాలుడు "సరే అలానే కానివ్వండి. ఇప్పుడు కనకాభిషేకము చేసి, సంతృప్తి చెందుతాననగా భీమకవి "మహారాజా మీ ఆదరాభిమానాలు నన్ను మహదానందభరితుడను చేస్తున్నాయి" అని చెప్పారు.

చొక్కభూపతి "భామలకు బంగారం, మునులకు తపస్సు, యాచకులకు దాత, కవులకు కనకాభిషేకము, నా వంటివానికి స్నేహితులంటే ఆశ కదా" అని చమత్కరించాడు. అలా చొక్కన సన్మానం తర్వాత పెద వేంగి నుంచి సెలవు తీసుకుని వెళ్ళారు.

భీమకవి వెళ్ళిన తర్వాత కొంతకాలానికి సాహిణిమారుడు ప్రచండసైన్యంతో పెదవేంగిపై దండెత్తి వచ్చాడు. పొరుగు రాజైన రాజరాజనరేంద్రుడు చొక్కభూపాలుడు ఓడిపోతే తన సామ్రాజ్యం విస్తరించుకోవడానికి మంచి అవకాశము దొరుకుతుందని ఏమాత్రమూ సహాయము చేయకుండా తటస్థముగా ఉన్నాడు. కొంత కాలం తర్వాత తిరిగి వస్తానని చొక్కనకు మాటిచ్చిన భీమకవి సాహిణీమారుడికి, చొక్కనకూ యుద్ధం జరిగే సమయానికి పెదవేంగి పట్టణం చేరుకున్నారు.

సాహిణిమారుడికి, చొక్కనకూ మధ్య యుద్ధము మొదలైంది. సాహిణిమారుడు తన సైన్యాన్ని బాగా ఉత్సాహపరుస్తూ ముందుకు నడిపించాడు. ఒక్కోదినం ఒక్కొక్కరికి ఆధిక్యం వస్తూ ఎటూతేలని విధంగా దాదాపు నాలుగు రోజులు యుద్ధం జరిగింది. ఐదవ రోజు సాహిణిమారడు విజయమో వీరస్వర్గమో అన్నవిధంగా తన సైన్యాన్ని ఉసిగొల్పాడు. ఏదో ఒకటి తేలే వరకు యుద్ధరంగము నుండి వెనుతిరగరాదన్న నిశ్చయముతో ఉన్నాడు. అసంఖ్యాకమైన సాహిణిమారడి సైన్యప్రతాపానికి చొక్కన సైన్యము చెల్లాచెదురయ్యింది. ఒక వైపు తన సైనికులు వెనుదిరిగి పారిపోతున్నా, చొక్కన మాత్రం భయపడకుండా తిరిగి సైన్యాన్ని కూడదీసుకొని మరీ పోరాడాడు. కానీ

చొక్కనకు గెలుపు మీద నమ్మకం పోయింది. విజయం పట్ల ఆశలు సన్నగిల్లాయి. ఎలాగో ఆ రోజుకి ఓటమి నుంచి తప్పించుకున్నాడు. ఆరవరోజున చొక్కన భీమకవిని తనతో పాటి యుద్ధభూమికి ఆహ్వానించి పిలుచుకుపోయాడు. కొంతసేపు యుద్ధము చేసిన తర్వాత ఈ రోజు కూడా తన గెలుపు దుస్సాహసమనిపించి చొక్కన, భీమకవిని చూసి "మహాత్మా! ఈ యుద్ధము నాకు ఎంతో దుస్సాహసమనిపిస్తోంది. ఎన్ని రోజులయినా కానీ ముగియకున్నది. నాకు నానాటికీ విజయం పట్ల విశ్వాసము సన్నగిల్లుతోంది. ఇంతటి ఘోరమైన యుద్ధమును నేను ఎన్నడూ చూడలేదు. ఇక ఈ రాజ్యమును మీ అనుగ్రహబలము వలననే కానీ, నా బాహుబలము వలన కాపాడుకోవడం సాధ్యపడదు. మీ అమోఘకవితా శక్తి వలన మాత్రమే ఈ సాహిణిమారడు కృంగిపోగలడు. నా మీద పరిపూర్ణమైన కటాక్షమును ఉంచి ఓటమి అంచున ఉన్న నాకు విజయమును కలిగేలా చేయుము" అని వేడుకున్నాడు. తనను అమితముగా ఆరాధిస్తూ, ఎంతో చక్కగా రాజ్యాన్ని పరిపాలిస్తూ వినయవిధేయుడు, గుణసంపన్నుడు అయిన చొక్కన ప్రాణాపాయస్థితిలో ఉంటే, కరుణార్ద్ర హృదయుడైన భీమకవి గమ్మునుండగలరా!

భీమకవి చొక్కనకు విజయం చేకూరేలా అనుగ్రహిస్తూ ఈ క్రింది పద్యమును చెప్పారు.

ఉ చక్కఁదనంబు దీవియగు సాహిణిమారుఁడు మారుకైవడిన్
బొక్కి పడంగలండు చలముం బలమునం గల యీచళుక్యపుం
జొక్కనృపాలుఁడుగ్రుఁడయి చూడ్కుల మంటలు రాలంజూచినన్
మిక్కిలి రాజశేఖరుని మీఁదికి వచ్చిన రిత్తవోవునే?

భావము: ఎంతో చక్కగా పాలింపబడుతున్న రాజ్యము మీదకు సాహిణి మారుడు తన వినాశనము కోసమే యుద్ధానికి కాలుదువ్వాడు. అమిత శౌర్యపరాక్రమవంతుడూ, చాళుక్యరాజూ అయిన చొక్కనృపాలుడు ఉగ్రుడై చూడగానే, ఆ చూపులకు రాలే మంటలలో సాహిణిమారుడి శరీరము కాలి మసైపోవుతుంది. గొప్ప చక్రవర్తి మీదకి వస్తే, దాని ఫలితం వూరికే పోతుందా?

భీమకవి అలా అనగానే అన్నంత పని అయిపోయింది. చొక్కన చూసిన రెప్పపాటిలోనే సాహిణిమారుడు భస్మీభూతుడయ్యాడు(మసైపాయాడు). రాజులేని సైన్యం యుద్ధరంగం నుంచి పారిపోయారు. క్షణకాలంలో యుద్ధభూమి శత్రుశూన్యం అయ్యింది. ఇది చూసిన చొక్కభూపాలుడు ఎంతో సంతోషంతో భీమకవికి సాష్టాంగ ప్రణామము చేసి " మహాత్మా! నేడు ఈ రాజ్యము, ఐశ్వర్యము తమరి కరుణ వలన నిలిచింది. కావున నాకీ రాజ్యము నీవు ఇచ్చినదే. నేను మీకు సేవకుడను. ఈ సింహాసనం పై కూర్చొని మీరే రాజ్యచక్రము తిప్పవచ్చు. నేను మీ ఆజ్ఞ ప్రకారం నడుచుకుంటాను." అని చెప్పగా భీమకవి " రాజా! నేను కవిత్వం చెప్పుదునే కానీ కత్తిపట్టి యుద్ధమును చేయను కదా? అటువంటప్పుడు మాకీ రాజ్యభారము యెందుకు? నీవు పుత్రమిత్రకలత్రాదులతో సుఖసంతోషాలతో వర్ధిల్లుతూ రాజ్యమును పాలించుము. మీ వద్దనే ఇంకొంత కాలము ఉండునట్లు ఆనుగ్రహించెదను" అని చెప్పి సమ్మతింపచేసారు. కొంతకాలము చొక్కన ఆస్థానములోనే ఉండి, ధర్మసందేహాలను తీరుస్తూ, దిశానిర్దేశము చేస్తూ, రాజ్యపరిపాలనలో సహాయపడ్డారు.

## తెలుంగరాయుడు

పెద్దాపురాన్ని పాలించే తెలుంగరాయుడను రాజునకు ఎప్పటి నుంచో భీమకవిని తన రాజ్యమునకు పిలిపించుకోవాలని ఎంతో ఆశ ఉండేది. ఉద్దండకవి, మహానుభావుడు అయిన భీమకవి తన రాజ్యమున ఉంటే ఎల్లప్పుడూ విజయైశ్వర్యములతో తన రాజ్యము తులతూగుతుందని భావించేవాడు. ఇదిలా ఉండగా ఒకసారి భీమకవి పెద్దాపురం వెళ్ళారు. తానే స్వయంగా తెలుంగరాయుడి ఆస్థానమునకు వెళ్ళి కస్తూరి, పచ్చకర్పూరము జవ్వది సుగంధవస్తువులను బహుమతిగా ఇచ్చి తన అనుగ్రహమును పొందమని చెబుతూ ఈ క్రింది పద్యమును చెప్పారు.

మ      ఘనుడన్ వేములవాడ వంశజుడ ద్రాక్షారామభీమేశ నం
దనుడన్ దివ్యవిషామృతప్రకట నానా కావ్యధుర్యుండ భీ
మన నా నామమెరుంగ జెప్పితిఁ దెలుంగాధీశ! కస్తూరికా ఘన
సారాది సుగంధవస్తువులు వేగందెచ్చి లాలింపురా.

భావము: గొప్పవాణ్ణి, వేములవాడ వంశస్థుడను, ద్రాక్షారామభీమేశ్వరుని కుమారున్ని, విషము, అమృతం రెంటిని అమోఘమైన నా పలుకుల్లో కురిపించగలవాడను, ఎన్నో ఉద్దండ కావ్యాలను రాసినవాడను. భీమన నాపేరు. తెలుసుకుంటావని చెప్తున్నాను. కస్తూరి, పచ్చకర్పూరం మొదలగు సుగంధద్రవ్యాలను త్వరగా ఇచ్చి బుజ్జగించరా!

ఇలాంటి అవకాశము కోసమే ఎదురుచూస్తున్న తెలుంగరాయుడు భీమకవే స్వయంగా రావడంతో పట్టలేని ఆనందంతో వెంటనే చందనం, కస్తూరి, జవ్వ, పునుగు, పచ్చకర్పూరం మొదలగు సుగంధ వస్తువులను బహుమతిగా ఇచ్చి అత్యంతభక్తితో భీమకవిని పూజించాడు. అంతే కాక విశేషమైన ద్రవ్యమును బహుమతిగా ఇచ్చి సత్కరించాడు.

భీమకవికి యజ్ఞయాగాలంటే చాలా ఇష్టము. తన తండ్రి ద్రాక్షారామ భీమేశ్వరున్ని సంతోషపెట్టడానికి, లోకకళ్యాణార్థం యజ్ఞయాగాలను జరిపించేవారు. రాజసత్కారములందు ఇవ్వబడిన ద్రవ్యమునంతటినీ, యజ్ఞయాగాలను జరిపించాడానికే ఖర్చుచేసేవారు. అంతేకాక రాజులచే ఇవ్వబడిన చందనం, జవ్వ, పునుగు, కస్తూరి, పచ్చకర్పూరంలాంటి సుగంధ వస్తువులను యజ్ఞయాగాలకు వినియోగించేవారు. ఆ కాలం నాటి వారు భీమకవిని గురించి "కవిరాక్షసుని యింట ఘనమైన యజ్ఞంబు జరుగు. పోదము రందు జాగదేల?" అంటూ గొప్పగా తమ సీస పద్యాలలో వ్రాశారు. భీమకవిని కవిరాక్షసుడు అని పిలువడానికి ఇంకో కారణము ఉంది. భీమకవి సంస్కృతంలో "కవిరాక్షసీయం" అనే ద్వ్యర్థి కావ్యాన్ని వ్రాసారు. ఆ కావ్యములో చివరి శ్లోకంలో తాను కవిరాక్షసుడనని చెప్పుకున్నారు. అందువలన భీమకవిని కవిరాక్షసుడు అని పిలిచేవారు. ఎందరో రాజులు చక్రవర్తులు ఈయన కవిత్వమునకు ముగ్ధులై ధనమును బహుమతిగా ఇచ్చి సత్కరించేవారు.

# నృసింహపురాణము రచన

తెలుంగరాయుల ఆస్థానములో ఉన్నపుడు భీమకవి నృసింహపురాణమును రచించారు. తెలుంగరాయడికి వేట అంటే ఎంతో ఇష్టం. ఓ సారి వేటకు వెళుతూ తన వేటను వీక్షించడానికి భీమకవిని తనతో రమ్మని కోరాడు. భీమకవి రాజు మనవి కాదనకుండా, వెళ్ళడానికి సిద్ధమయ్యారు. తనతో పాటి ఇంకొందరు భటులను కూడా తీసుకొని బయలుదేరారు. భీమకవి, తెలుంగరాయడు తమతమ అశ్వాలపై ప్రక్కప్రక్కనే వెళ్ళసాగారు. సాయంత్రమయ్యే సరికి వారు సింహశరభశార్దూలవృక్షవరాహసారంగాది మృగసంకులంబయిన ఘోరడవిని చేరారు. మనుషుల సవ్వడి వింటే మృగాలు ఎక్కడ పారిపోతాయోనని తనతో వచ్చిన భటులనందరినీ అన్ని దిక్కులకు చెదిరిపొమ్మని ఆదేశించాడు. భీమకవిని మాత్రం తనతో ఉండమని కోరగా, ఇరువురూ ఒకే చోట ఉంటూ ముందుకు కదిలారు. తెలుంగరాయుడికి పొదల్లోకి పారిపోతూ ఒక వరాహము కనపడింది. ఆ వరాహాన్ని చూడగానే భీమకవితో ఎలాగయినా ఈ వరాహాన్ని పట్టాలి అని చెబుతూ చప్పిడిచేయకుండా వెనుక నుండి దానివైపుకు  అడుగులేయబోయాడు. భీమకవి అతన్ని ఆపి "వరాహమును మాటు నుండి కొట్టడం పౌరుషలక్షణము కాదు. సవ్యసాచిఖాండవదహన సమయాన వరుసబాణములను సంధించి మేఘునిచే వర్షం కురిపించిన అర్జునినిలా, వరాహమునకు ఎదురేగి ప్రతిభను ప్రదర్శించి పట్టుకున్నవాడే ప్రజ్ఞావంతుడు. అలా చేయగలవా? లేదా నన్ను చేసి చూపమంటావా?" అని అడిగారు. తెలుంగరాయడు "కవీశ్వరా! మీకు కవిత్వంలోనే కాక వేటలో కూడా ఉద్దండసామర్థ్యమున్నవాడిలా మాట్లాడుతున్నారే. మీకా సామర్థ్యముంటే చేయ"మని అడిగాడు. భీమకవి "తెలుంగాదిశా! నా శక్తిసామర్థ్యాలు నీ ఊహలకందనివి. నేను వాక్పరాక్రమమున్న మహాకవిని కావున నా నోటి మాట(ఒక పద్యము) చాలు ఆ వరాహమును ఆపి తీసుకురావడానికి. మేము అలా బంధించి తీసుకువచ్చి ఆ వరాహమును మీ ముందు వదులుతాము. మీరు మీ పరాక్రమమును చూపి, బాణములను వదిలి, ఆ వరాహమును పట్టుకొని భుజబలపరాక్రమశాలివగు రాజువని నిరూపించుకొమ్మని" చెప్పి ఈ క్రింది పద్యాన్ని చెప్పారు.

చ	కడక ధనంజయుండు మును ఖాండవమున్ దహించు వేళ నే
రృడ శరజాల నిద్ధమయి వర్షములోఁ జొఅ జాలనట్టులీ
యడవిన సందుగాన కిట నాగు వరాహమ! నాదు వాక్కునఁ
బొడువదు ప్రొద్దుకూడ నిను భూపతి కర్పణ సేతునియ్యెడన్

<u>భావము:</u> ఈ అడవిన పొదలందు దాగబోయిన ఓ వరాహమా! పూర్వము ఖాండవవనము అగ్నికి ఆహుతి అవుతున్న వేళ అర్జునుడు సంధించిన బాణాలచే ఆపబడి, కరిగి వర్షించిన మేఘములాగా,  నీవు నా మాటవిని ఆగిపో! నా మాటకు పొడిచే పొద్దు కూడా పొడువదు. ఈ వేళ  నిను మహారాజుకు బహుమతి చేయబోతున్నాను.

వెంటనే ఆ వరాహము ఎక్కడకు పోకుండా పరుగులు మాని ఆగిపోయింది. భీమకవి ఆ వరాహమును తీసుకువచ్చి తెలుంగరాయుడి ఎదుట వదిలివేసి, ఇక మీ నైపుణ్యంతో పట్టమన్నారు. తెలుంగరాయుడు కూడా తాను

నేర్చిన విద్యనుపయోగించి తన నైపుణ్యమును నిరూపించదలచి ప్రయత్నము చేసాడు. వరాహమును అతడు తన శరపరంపరను నలుదిక్కులా వదిలి ఎక్కడకూ పోనీయకుండా బంధించి పట్టుకొని భీమకవి వద్దకు తీసుకొచ్చి చూపించాడు.

భీమకవి అతని పరాక్రమమునకు సంతసించి "నువ్వు భూవరేణ్యుడవు. నేను కవివరేన్యుడను. మన మైత్రి ఎప్పటికీ చెదిరిపోదు. ఇక వేటాడ్డం చాలు ఇంటికి వెళ్దాం పదా. వేట నెపంతో వన్యప్రాణులను చంపకూడదు. అందులోనూ వరాహము విష్ణువు అవతారము. రాజులకు వేట ధర్మమే అయినా అది వన్యమృగాలు ఎక్కువయ్యి అడవులను వదిలి పంటచేలను నాశనము చేయునపుడు, జనవాసానికి ఆటంకం కల్గించినపుడు వాటి సంఖ్యను తగ్గించడం కోసం వేటాడ్డం క్షత్రియధర్మము. నిష్కారణముగా వన్యప్రాణులను బంధించి చంపుట అధర్మము. స్వేచ్ఛగా విహరించు ఈ వరాహమును బంధించి దాని స్వేచ్ఛకు ఆటంకమును కల్గించాము. దానిని వెంటనే విడిచి పెట్టు. ఈ కళంకము అంటకుండా వరాహపురాణమును రచించి నీకు అంకితము చేస్తాను. ఆ వరాహపురాణానికే నృసింహపురాణమని నామకరణము చేస్తాను" అని చెప్పారు. ఆ రాజు కూడా వరాహమును వదిలిపెట్టి ఆనాటి నుండి వినోదం కోసము జంతువేటాను మానేసాడు. ఆ తరువాత భీమకవి నృసింహపురాణము పేరిట వరాహ పురాణమును రచించి తెలుంగరాయునికి అంకితమిచ్చారు. భీమకవికి నృసింహపురాణము రచించుటకు ఎక్కువ కాలము పట్టలేదు కాని, ఆ నృసింహపురాణమును తెలుంగరాయునికి చదివి వినిపించుటకు ఒక సంవత్సరానికి తక్కువ సమయం పట్టలేదు. ఇందుకు కారణం భీమకవిపై, ఆయన కవిత్వముపై తెలుంగరాయుడికి ఉన్న అభిమానం మక్కువ అలాంటిది. భీమకవి ఒక్కొక్క పద్యానికి మిక్కిలి విశ్లేషణాత్మకంగా భావాన్ని వివరించగా, రాజు కూడా ప్రతి పద్యాన్ని పదేపదే చదివి ఆనందపడ్డాడు. అలా వరాహావతారమైన విష్ణుమూర్తి చరితమైన ఆ కావ్యమును విని తరించాడు.

వరాహమును బంధించిన కళంకం అంటకుండా, తాము బంధించిన వరాహము పరిస్థితిని చందమామతో పోలుస్తూ నృసింహపురాణములో క్రింది పద్యముతో వివరించారు.

చ    సురచిరపానపాత్రమున సుందరియొక్క తే కేలనిండు చం
దురుడు ప్రకంపి తాంగములతోఁ దిలకించెఁ దదానంబుజ
స్ఫురిత వికాస వైభవము సొంపులడంకువ ముచ్చిలింపఁ జె
చ్చెరఁ జనుదెంచి కట్టువడి చేడ్పడి భీతివడంకు చాడ్పునన్

భావము: ఆ సుందరి చేతిలో ఉన్న మిక్కిలి రమణీయమైన పానపాత్రము (లోటా లేదా పాత్ర)లో చంద్రుడు అత్యంతగా ప్రకాశిస్తున్నాడు. చంద్రుని అందాలన్నియూ ఆ సుందరి ముఖవైఖరులచే దొంగలింపబడినట్లుగా ఆమె చేతిలో (ఉన్న పాత్రలో) కట్టుబడపాయి భయముతో వణుకుతూ ఉన్నట్లుండెను.

ఈ పద్యము చదివిన తెలుంగరాయుడు " భళారే! మహాత్మా! మీ కవితా వైచిత్యము వలన చంద్రుడు, ఇంద్రుడు, బ్రహ్మదేవుడు కూడా కట్టుబడిపోతారు. కొద్ది పదార్థమును గొప్పదిగాను, గొప్ప పదార్థమును కొద్దిగాను చేసే శక్తి

మీవంటి కవీశ్వరునికి గాక ఇంకెవరికి సాధ్యమవుతుంది? మహా తపస్సు చేసి అష్టసిద్ధులు పొందిన సంయమీంద్రులు కూడా భీమకవీంద్రునికి సాటి రాగలరా? " అని మిక్కిలి ప్రశంసించగా భీమకవి అష్టసిద్ధులు అంటే ఏమిటో రాజుకు ఈ క్రింది శ్లోకమును చెప్పారు.

"అణిమా మహిమా చైవ గరిమా లఘిమా తథా
ప్రాప్తిః ప్రాకామ్య మీశత్వంవశత్వం చాష్ట సిద్ధయః"

# గొల్లభామ కథ

ఒకరోజు ఓ యువతి అత్యంతవిలాసంగా, ఒయ్యారంగా నడుస్తూ, నెత్తిన కుండలోని మజ్జిగ చల్లిపోయేలా చేతులు ఊపుతూ, "మజ్జిగోయమ్మ మజ్జిగ" అని అరుస్తూ నడుస్తోంది. ఈమె వయ్యారమును చూసి కొందరు ఆమె ఎంత ధర చెప్పినా, బేరమాడక కొనేవారు కొందరు. అవసరము లేకున్నా ఆమెతో మాట్లాడాలన్న నెపంతో కొనేవారు ఇంకొదరు. కొనకున్నా ఆమెతో కాసేపు బేరమాడి కాలయాపన చేసేవారు మరికొందరు. ఒకనాడు మేడపై భీమకవితో మాట్లాడుతూ ఆమెను చూసి తెలుంగరాయుడు "కవివర్యా! చూసారా ఆ యువతి నెత్తిపై నుంచి మజ్జిగ చల్లిపోతున్నా పట్టించుకోకుండా ఎంత విలాసంగా నడుస్తోందో. ఎంత నిర్లక్ష్యం లేకపోతే" అన్నాడు. అందుకు భీమకవి మహారాజా! ఆమె విలాసవతి అని ఆమె వేషము, నడకలే చెబుతున్నాయి ఆమె దుశ్చరితను" అన్నారు. రాజు "ఆమె ఎవరు? మీకు ఆమె నడవడి గురించి నీకెలా తెలుసు" అని అడుగగా, భీమకవి " కవిగాంచు రవి చూడగా లేని యర్థంబు, అగతానాగత వివేకియు, నిరంతర సత్యాన్వేషణాపరుడనగు కవీశ్వరుడను నేను. నాకు తెలియనిది ఉంటుందా? ఆమెను చూసిన వెంటనే ఆమె చరిత్ర అంతా నా కళ్ళకు కనపడింది" అని చెప్పారు. ఆమె ఉదంతమంతా వివరించమని తెలుంగరాయుడు అడుగాడు, భీమకవి ఆమె మనసులోని భావాన్ని, ఆమె మాటల్లో చెబుతూ, ఈ క్రింది పద్యమును చెప్పారు.

ఉ     భూపతిఁజంపితిన్ మగడు భూరిభుజంగము చేతఁ జావగా<br>
నాపద జెంది జెంది యుదయార్కునిపట్ణముఁ జేరి వేశ్యనై<br>
పాపముఁగట్టుకొంటి సుతుఁబట్టి బొజుంగని జెట్టవట్టి సం<br>
తాపముఁజెంది యగ్ని బడ దగ్ధముగాకిటు గొల్లభామనై<br>
యీవని కోర్చు కొంటి నృపతీ! వగపేటికిఁ జల్ల చిందినన్

భావము: మహారాజును చంపాను. భర్త పాము కాటుకు మరణించడముతో ఆపదల పాలై ఉదయార్కునిపట్టణమును చేరి వేశ్యనై పాపము కట్టుకున్నాను. కొడుకు నను మోహించగా ఆ బాధతో అగ్నిలో దూకాను. అగ్ని దేవుడు కూడా తనను దహించకపోవడంతో ఇక్కడకు వచ్చి గొల్లభామనై విలాసావతినై మజ్జిగ చిందించుకుంటూ బ్రతుకుతున్నను మహారాజా!

తెలుంగరాయుడు ఆసక్తితో ఆ యువతిని పిలిపించి "నీ కథ ఏమి? ఎవరు నువ్వు? ఇలా మజ్జిగ చల్లవేసుకుంటూ వయ్యరముగా నడుస్తున్నావు? నిజం చెప్తావా లేదా? " అని గద్దించి అడిగే సరికి ఆమె తన పూర్వచరిత్రను ఇలా చెప్పింది.

"ధాన్యకటకనగరము సమీపాన ఉన్న ఆనందపురమును ఆనందుడనే రాజు పరిపాలించేవాడు. ఆ పట్టణమంలో దంతవిశ్రుతుడను బ్రహ్మణుడి భర్యను నేను. నా భర్త ఎప్పడూ వైదికాచారాలలో మునిగిపోయి నా సంతోషాన్ని పట్టించుకోకపోవడముతో నాకు అతడు సరికాడని భూపతితో స్నేహమును చేసి అతనితో సంతోషంగా

గడిపేదాన్ని. నా భర్త దంతవిశ్రుతుడు ఎప్పుడూ పెళ్ళిపేరంటాలు చేయిస్తూ ఊళ్ళు తిరుగుతూ ఉండడం వలన నా స్వేచ్ఛకెప్పడూ ఆటంకము కలుగలేదు. ఒకసారి అతడు ఆకస్మికంగా ఇంటికి వచ్చినపుడు భూపతి, నేను ఆయన కంటపడ్డాము. నాటి నుంచి నన్ను ప్రేమతో చూడక దూషించడం మొదలుపెట్టాడు. రానురాను అతనిని భరించడము చేతకాలేదు. భర్త దంతవిశ్రుతుని చంపితే కాని తాను భూపతితో సుఖంగా ఉండలేనని, అతని కోసం చేసిన ఫలహారములో విషం కలిపి ఉంచి నా పనిలో నిమగ్నయ్యాను. ఇంతలో ఆనందుడు(భూపతి) వచ్చి పళ్ళెములో ఉన్న ఆ ఫలహారాన్ని చూసి తన కోసమే తయారు చేసి ఉంచాననుకొని తినేసాడు. అంతలో నా భర్త రావడం గమనించి, అతడు తన ఇంటికి వెళ్ళిపోయాడు. మరుసటి తెల్లరింటిలోపు ఆనందుడు మరణించాడు. కొంతకాలము దుఃఖించిన తర్వాత మంత్రి కుమారుడగు విలాసుడిని పట్టాను. ఒకనాడు ఇంటికి వస్తూ భర్త పాముకాటుతో మరణించాడు. ఇక నాకు ఏ అడ్డూలేకపోవడంతో విలాసునితో అత్యంత సుఖముగా గడిపాను. ఆ ఫలితంగా గర్భమును దాల్చి కుమారున్ని కన్నాను. లోకము తప్పగా చూస్తుందని ఆ కుమారుని ఊరి బయట ఉన్న అరణ్యములో ఒక పాతబావిలో పారవేసి వచ్చాను. ఉదయార్కపురమును పాలించు ఉదయార్కుడు వేటకై అక్కడకు వచ్చాడు. నీటి కోసం బావి దగ్గరకు వెళ్ళినపుడు ఏడుస్తున్న బాలుడిని చూశాడు. తనకు సంతానం లేకపోవడము వలన భగవంతుడు ఇచ్చిన బిడ్డగా భావించి దేవదత్తుడు అని నామకరణం చేసి కడుగారాభముగా పెంచాడు. పెరిగి పెద్దయ్యాక ఆ బాలుడికి పట్టాభిషేకం చేసి తాను తపోవనముకు వెళ్ళాడు.

ఇక నా సంగతికి వస్తే కొంత కాలానికి విలాసుడికి ఆత్మబోధ కలిగి నన్ను వదిలివేసాడు. ఇంటికి రావడము కూడా మానేసాడు. పోశించేవారు కరువై, ఉన్న వస్తువులను అమ్మివేసి ఆ డబ్బుతో కొంతకాలము గడిపాను. తరువాత ఏదో ఒక పని చేస్తే తప్ప పూట గడవని పరిస్థితి వచ్చింది. కానీ ఏపని చేయలేక వేశ్యగా మారి ఉదయార్కపురము చేరాను. నా కుమారుడు దేవదత్తుడు రాజ్యమేలుతూ నన్నే మోహించాడు. చూడగామే అతన్ని నా కుమారుడేనని గ్రహించాను. ఎంతో బాధపడ్డాను. ఇక నేను బ్రతికుండి ప్రయోజనము లేదనిపించి అగ్నిలో దూకి ఆత్మహత్యా ప్రయత్నం కూడా చేసాను. ఆ అగ్నిదేవుడు కూడా నన్ను తాకుటకు ఇష్టపడక వదిలేసాడు. ఇక గత్యంతరము లేక ఆ ఊరు వదిలి ఇక్కడకు వచ్చి గొల్లభామనై, నానా అవస్థలు పడుతూ, జీవితము గడుపుతున్నాను. నేను చాలా పాపాత్మురాలను, కానీ దైవాంశసంభూతుడగు భీమకవి దర్శనభాగ్యము వలన నాకు పాపముల నుంచి నిష్కృతి లభించునని తలుస్తున్నాను." అని పలికింది. రాజు ఆమె మాటలు వినగానే భీమకవిని భూత,భవిష్యత్,వర్తమాములను తెలిసిన దైవాత్ములని కీర్తించాడు. ఆమె తన కంఠస్వరముతో భీమకవి రచించినపై పద్యాన్నే మరల చెప్పి, ఆయన పాదాలపై వాలి పశ్చాత్తము చెందింది. భీమకవి " పశ్చాత్తాపానికి మించిన ప్రాయశ్చిత్తము లేదు. ఎప్పడైతే చేసిన తప్పలను తెలుసుకొని, వాటి నిష్కృతికై పరితపిస్తూ, నా పాదాల వాలావో ఆ క్షణానే నువ్వు పవిత్రురాలివయ్యావు. ఇకనుంచైనా చక్కగా బ్రతుకుము" అని చెప్పి ఆశీర్వదించారు. తగిన ఉపాధి కోసము ఆమెకు రాజు నుంచి కొంత ధనమును ఇప్పించి పంపారు.

# రాజేంద్రచోళుడు

ఒకసారి భీమకవి రాజేంద్రచోళుని దర్శనార్థము అతని సంస్థానానికి వెళ్ళారు. ద్వారపాలకుడు భీమకవి లోనికి పోనీయలేదు. "మహారాజు గారు శత్రురాజ్యలతో యుద్ధసన్నాహపు పనులలో నిమగ్నమయ్యున్నాడు. ఇపుడు ఎవరితో మాట్లాడేస్థితిలో లేరు. ఇంకోరోజు రండి" అని అడ్డుపడ్డాడు. భీమకవి "మీ మహారాజు పరతంత్రుడై ఉన్నాకానీ నన్ను నిరోధించడు. నన్ను వెళ్ళనియ్యి" అని శాంతంగా అడిగారు. అయినా కూడా ఆ భటుడు వినలేదు. తన మాటను ధిక్కరించినందుకు భీమకవి కోపితుడై "నేను ఎంత చెప్పిననూ నా గురించి తెలుసుకోలేక నిరోధిస్తున్నావు. నీకు ఆపాదమస్తకము మంటలు బయలుదేరునుగాక!" అని పలికి వెళ్ళిపోయారు. మాట అన్నంతనే అతనికి శరీరమంతా మంటలు మొదలయ్యాయి. అతనికి ఏం చేయాలో తోచలేదు. అంత బాధలోనూ భీమకవిని వెతుక్కుంటూ వెళ్ళాడు. కానీ కనపడకపోవడంతో రాజు వద్దకు వెళ్ళి జరిగిన విషయం చెప్పాడు. రాజు "అయ్యో! ఆయన్ను నిరోధించి ఎంత పని చేసావు. ఆ మహానుభావుడు మన రాజ్యానికి రావడమే మన భాగ్యం. ఆ మహానుభావుడిని ఆపి ఎంత అపచారము చేసావు. ఇక ఆయన తప్ప మరెవరూ నీకు బాధ నుంచి విముక్తి కలిగించలేరు. అన్నిటినీ ప్రక్కన ఉంచి తొలుత భీమకవి ఎటు పోయారో, ఆయన ఎక్కడున్నారో తక్షణం వెతుకుదాం పదా" అని తానూ భటులతో నలుదిక్కులా వెతకడం మొదలుపెట్టాడు. భీమకవి ఆ ఊరిలోనే ఒక బ్రాహ్మణుని ఇంట బసచేసి ఉన్నాడని తెలియడంతో వారు అక్కడకు వెళ్ళారు. రాజు తన భటుడు చేసిన తప్పుకు అతన్ని క్షమించి, బాధా విముక్తున్ని చేయమని ప్రార్థించాడు. దయాహృదయుడైన భీమకవి తన మాటలను ఉపసంహరించుకున్నారు. భటుడు కూడా బాధ నుంచి విముక్తుడై తన్ను క్షమించమని వేడుకున్నాడు. ఆ తరువాత భీమకవిని తన సభకు పిలుచుకుపోయి ఘనంగా సత్కరించాడు. "మహాత్మా! ఈ భవనమునకు ఒక కొబ్బరిచెట్టు దారికి అడ్డముగా ఉన్నది. దానిని నరకడను తప్ప వేరొక దారి కనిపించుట లేదు, అలా చేయడము ఇష్టము లేదు.మీరు మీ మహిమను చూపి దానిని దారి నుంచి ప్రక్కకు జరిగి దారి ఇచ్చునట్లు చేయవా?" అని అడిగాడు. భీమకవి కొబ్బరిచెట్టును దారి నుంచి తప్పుకొమ్మని ఒకపద్యము చెప్పగానే, అది ఉన్న చోటి నుంచి ప్రక్కకు జరిగింది. అందరూ భీమకవి మహిమను చూసి ఎంతో ఆశ్చర్యచకితులయ్యారు.

# రణతిక్కన

భీమకవి కరుణాకటాక్షాలను పొందిన వారిలో రణతిక్కన, మైలమభీముడు ముఖ్యులు. వీరిరువురూ మైలమాంబ కుమారులు. ఈ ఇరువురు నెల్లూరు ప్రభువైన మనుమసిద్ధిరాజు వద్ద మంత్రులుగానూ, దండనాథులుగా ఉండి, అతి పరాక్రమవంతులుగా పేరుప్రఖ్యాతులు తెచ్చుకున్నారు

ఒకసారి మనుమసిద్ధిభూపాలునికి, ఎఱ్ఱగడ్డపాడును పాలించే కాటమరాజుకు ఘోర యుద్ధము జరిగింది. అపుడు రణతిక్కన మనుమసిద్ధి భూపాలుని సైన్యమును నడిపిస్తూ ఎంతో పోరాడినా, చివరకు ప్రాణాలు కోల్పోయాడు. ఈ ఇరువురికి పాడిపశువుల విషయంలో యుద్ధము జరిగింది. ఎఱ్ఱగడ్డపాడులో పశువులను మేపుకోవడానికి తగిన గడ్డిభూములు లేనందున కాటమరాజు తన పశువులను మనుమసిద్ధి రాజ్యంలో మేపుకోడానికి అనుమతి తీసుకొని, అందుకుగాను నెలసరి కప్పమును చెల్లించునట్లుగా అంగీకారము చేసుకున్నాడు.

కొంత కాలము తర్వాత ఒకరోజు కాటమరాజుకు చెందిన ఒక దూడ మంద నుంచీ తప్పిపోయింది. కాటమరాజు ఎంత వెతికిననూ దొరకకపోవడంతో మనుమసిద్దే ఆ దూడను అపహరించి ఉంటాడని అనుమానించాడు. తన దూడను తనకు అప్పజెప్పేవరకూ కప్పమును చెల్లించనని పట్టుపట్టాడు. మనుమసిద్ధికి దూడ విషయము తెలియకపోవడంతో తమ పశువులలో అటువంటి దూడ కలవలేదని, మొదట తనకు కప్పమును చెల్లించమని బదులిచ్చాడు. కాటమరాజు నమ్మలేదు. మనుమసిద్ధిరాజుతో మాటామాటా పెరిగి చివరకు యుద్ధానికి కాలుదువ్వాడు. రెండు రాజ్యాలమధ్య పంచలింగాలపాడులో యుద్ధము జరిగింది. ఈ యుద్ధానికి మనుమసిద్ధుని సైన్యాధిపతైన రణతిక్కన అల్పసైన్యముతో వెళ్ళాడు. రణతిక్కన ఎంతో శౌర్యపరాక్రమాలతో పోరాడిననూ శత్రుసైన్యము ఎంతటికి తరుగకుంది, కానీ తన సైన్యము మాత్రం చిందరవందర అయిపోయింది. ఇక లాభం లేదనిపించింది. సైన్యమును ఏకీకృతపరచుకుని, అధనపుసైన్యమును జతపరచుకుని రేపటి రోజున యుద్ధానికి రావడము మంచిదని భావించి, యుద్ధమును నిలిపివేసి మధ్యాహ్నభోజన సమయానికే రణతిక్కన ఇంటికి తిరిగివచ్చాడు.

ఇది తెలియకనో, మరి నచ్చకనో అతనిలో పౌరుషమును నింపదలచి తల్లి పోలమ, భార్య చెన్నమ రణతిక్కనను సూటిపోటి మాటలతో అవమానించారు. బంధువులవ్వడం వలన భీమకవి అపుడప్పుడు వీరింటికి వచ్చేవారు. ఈ సంఘటన జరుగునాడు భీమకవి రణతిక్కన ఇంటిలోనే ఉన్నారు. రణతిక్కన యుద్ధభూమి నుంచి రాగానే స్నానానికి నీటిని సిద్ధము చేయమని తన భార్య చెన్నమను అడిగాడు. ఆమె ఆడువారి స్నానానికి చేయు ఏర్పాట్లను చేసి, నులక మంచమును అడ్డుగా పెట్టి, నీటి బిందేలతో పాటి పసుపు గిన్నెను కూడా ఉంచి, రణతిక్కనను ఇక మీరు స్నానానికి వెళ్ళండి. అన్నిటినీ సిద్ధముగా చేసి పెట్టానని చెప్పింది. అని చెప్పింది. ఆ ఏర్పాట్లను చూసి అతను "ఇదేమిటే ఆడువారి స్నానానికి చేసే వసతులు చేసావు ఎందుకు?" అని అడుగాడు. ఆమె అందుకు సమాధానంగా "నీ తల్లి ఆడది, నీ భార్యనైన నేను ఆడద్దాన్ని. యుద్ధము నుంచి పారిపోయివచ్చిన నువ్వు కూడా ఆడదానివే కాక మగవాడివి ఎలా అవుతావు? నేటి నుంచి ముగ్గురమూ ఆడవారమైతిమి.అందుకే అలా చేసాను" అని చెప్పింది.

చెన్నమ సమాధానాన్ని విన్న భీమకవి క్రింది పద్యమును చెప్పారు.

క వగఅకు వెన్నిచ్చినచో

నగరేనిను మగతనంపు నాయకులెందున్

ముగురాడు వారలైతిరి

వగపేటికి జలకమాడ వచ్చిన చోటన్

భావము: "శత్రువుకు వెన్నుచూపి వచ్చిన నిను చూసి మగతనము ఉన్న నాయకులందరూ నవ్వుకోరా? ఇప్పుడు ఈ ఇంట ముగ్గురు ఆడవాళ్ళు అయ్యారు. అక్కడ(యుద్ధరంగాన) లేని పౌరుషము, బాధ స్నానమాడే చోట ఎందుకు?"

భార్యకు, తల్లి కూడా తోడై భోజనము చేసేటపుడు రణతిక్కనకు విరిగిన పాలు పోసింది. రణతిక్కన "ఇదేమిటమ్మా. విరిగిన పాలు పోసావు?" అని అడుగగా ఆ వీరమాత "నాయనా! నువ్వు యుద్ధానికి పోయిన చోటనే పశువులు కూడా మేతకు పోయాయి. నువ్వు విరిగి వచ్చిన విధంగానే మన పశువులు కూడా విరిగి వచ్చాయి. వాటి పాలు కూడా విరిగాయి. నేనేమి చేసేది చెప్పు" అని ధీటుగా బదులిచ్చింది.

అక్కడే ఉన్న భీమకవి ఇది విని

క " అసదృశముగ నరివీరుల

మసిపుచ్చక విఱిగివచ్చు మగ పందక్రియఁ

గసవున్ మేయగ బోయిన

పసులుఁ విఱిగినవి తిక్క! పాలున్ విఱిగెన్

భావము: తిక్కనా! రణరంగములో శత్రువులని మట్టికరిపించలేక పిరికిపందలాగా విరిగి వచ్చావు. పసరము(గడ్డి) మేయడానికి అక్కడకు వెళ్ళిన పశువుల కూడా నీవలె విరిగివచ్చాయి. వాటి పాలుకూడా విరిగాయి.

అని చెప్పారు. చివరకు తన తల్లి కూడా అలా అవమానించేసరికి తిక్కన వీరావేశుడై, భోజనమును వదలి, ఉన్నఫలంగా యుద్ధానికి సిద్ధమయ్యాడు. రణరంగానికి పోయి అసహాయశూరుడై కాటమరాజుతో చాలాసేపు ఒంటరిపోరాటము చేశాడు. కానీ చివరకు కాటమరాజు ఖడ్గానికి ఆహుతై వీరస్వర్గమును పొందాడు.

రణతిక్కన మరణవార్తను విని అతని తల్లి పోలమాంబ, భార్య చెన్నమాంబ చాలా దుఃఖించారు. అత్త, కోడలిని భీమకవి పాదాలపై వాలి ఆయన అనుగ్రహమును పొందు. నీ భర్తను తిరిగి పునర్జీవితున్ని చేయగలడని సూచించింది. అత్త మాటననుసరించి చెన్నమాంబ భీమకవికి నమస్కరించి, ఆయన పాదాలపై వాలి శోకిస్తుండగా, పాదాశ్రితులైన వారిపై కరుణ కురిపించే భీమకవి ఆమెపై కణికరము చూపి "ధీర్ఘ సుమంగళీభవా" అని దీవించారు. అందుకామె "మహానుభావా! నీవాక్యము వ్యర్థము కారాదు. నా భర్తను బ్రతికేలా చేయవా"మని అడిగింది.

భీమకవి ఈ క్రింది పద్యమును చెప్పారు.

క గుణముల నిధానమగు మన
రణతిక్కన తాఁగళేబరంబును శిరమున్
గణక మెయిఁ గలయఁ బ్రదుకునుఁ
బ్రణుతాఖిల వైరి మకుట భాసిత పదుడై

భావము: గుణములకు నిలయమైన (సద్గుణ సంపన్నుడైన) మన రణతిక్కన (ఇంత త్వరగా మరణించకూడదు) తన మొండెమును, శిరస్సును దగ్గర చేసి కలిపిన శరీరము(తల మొండెము) ఒక్కటై బ్రతుకుతాడు. ఈ లోకములో అఖిల శత్రుగణాలచే గొప్పగా కీర్తింపబడుతూ వర్ధిల్లుతాడు.

రణతిక్కన మృతదేహాన్ని రణరంగము నుండి తీసుకురప్పించారు. అతని తల, మొండెమును దగ్గర చేర్చి కలిపి ఈ క్రింది పద్యాలను చెప్పారు.

ఉ ఏమి తపంబుఁజేసి పరమేశ్వరునేమిటఁ బూజసేసిరో
రాముని తల్లియుఁ బరశురాముని తల్లియు భీముతల్లియుఁ
గాముని కన్న తల్లియును గంజదళాక్షుననుంగుఁ దల్లియున్
శ్రీ మహిత ప్రతాపుడగు సిద్ధయ తిక్కనఁగన్న తల్లియున్

భావము: శ్రీరాముని తల్లి, పరశురాముని తల్లి, భీమున్ని కన్న తల్లి, మన్మధున్ని కన్న తల్లి, గంజదళాక్షుని తల్లి, శివుని శూలమంటి ప్రతాపమును(ధైర్యసాహసములు) సిద్ధించుకున్న (సిద్ధయ) తిక్కనను కన్న తల్లి, ఎంత తపస్సు చేసి పరమేశ్వరుని ఏమని పూజించారో అంతటి గొప్పవారిని కన్నారు.

ఉ శ్రీలలరారశత్రువులఁ జెండితివార్యులు మంత్రివర్యులా
ర్వేలఘనుల్ నుతించిరలవేర్పు దొరల్ ముదమంది మెచ్చిరో
లాలిత శౌర్యధైర్య జయలక్ష్మి ప్రియంబున నిన్వరించెనీ
లీలలుహెచ్చెఁ దిక్కని కళేబరమా యిక నిల్చియాడుమా

భావము: పూజ్యుడవు, మంత్రివర్యుడవై రాజ్యము సిరిసంపదలతో అలరారేలా (శత్రువుల పాలుకాకుండా) శత్రువులను చెండాడావు. ఘనులెందలెందరో నిను ఏమని స్తుతించారో, నీ కార్యసిద్ధికి రాజులు సంతోషించి ఎంతగా కొనియాడారో, శౌర్యధైర్య జయలక్ష్మిని (పరాక్రమము, ధైర్యము, విజయములకు అధిపతి అయిన అష్టలక్ష్మిని) సైతం ప్రసన్నము చేసుకున్నావు. నీవు సాధించాలిన కార్యాలు ఇంకా చాలా ఉన్నాయి. ఓ తిక్కన కళేబరమా! ఇక లేచి కదలిరా!

వెంటనే వేర్పడి ఉన్న రణతిక్కన తల, మొండెము రెండూ అతుక్కోని పునర్జీవుడై లేచివచ్చి భీమకవికి నమస్కరించాడు. అమితముగా వరాలను కురిపించే తన తండ్రి బోళాశంకరునిలా భీమకవి “నువ్వు సాధించాల్సినది

చాలా ఉంది" అన్న అమోఘమైనమాటతో అతనిని ధీర్ఘాయుర్దాయనంతునిగా చేసారు. నాటి నుంచి ఈ రణతిక్కనను సిద్ధతిక్కన అని పిలిచేవారు. ఈ రణతిక్కన దాదాపు 70 ఏళ్ళు మనుమసిద్ధి ఆస్థానమున తన సేవలు అందించాడు.

నెల్లూరు పట్టణానికి సమీపంలో పుట్టపురాయి అనే గ్రామము ఉంది. ఆ గ్రామానికి తూర్పు భాగాన పీనాకినీనది తీరాన తిక్కనపాడు అను పేరుతో ఒక గ్రామమే ఉంది. ఆ గ్రామాన ఒక పెద్ద రాతిపై గుర్రము మీద ఎక్కిన రౌతుగల విగ్రహమొక్కటి చెక్కబడి ఉంది. ఆ విగ్రహము ఇప్పటికీ ఎంతో చక్కగా ఉంది. అక్కడివారు ఈ విగ్రహము రణతిక్కనదని చెబుతారు. ఈ విషయమును చెన్నపట్టణములో ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము నందు చారిత్రక సంపుటలో వ్రాసి ఉన్నారు.

# మైలమ భీముడు

రణతిక్కన సోదరుడు మైలమభీముడు. ఇతను కూడా మహాశూరుడు, భీమకవి అనుగ్రహమును కలిగినవాడు. ఈ మైలమభీమునికి యుద్ధము నందు విజయమే తప్ప పరాజయమెన్నడూ కలుగకుండే విధంగా వేములవాడ భీమకవి వరమిచ్చారు. ఆ వరము వలన ఎప్పుడూ ఈ మైలమభీమునికి పరాజయమను మాటే లేకుండెను. యుద్ధములో శత్రువులను ఓడించగల సామర్థ్యము అబ్బింది. భీమకవి ఇతని శౌర్యపరాక్రమమును గురించి ఎన్నో అద్భుతపద్యాలతో వివరించారు. వాటిలో కొన్ని మాత్రమే దొరికాయి.

చ గరళపు ముద్ద లోహ మవగాఢ మహాశని కోట్లు సమ్మెటల్

హరు నయనాగ్ని కొల్మి యురగాధిపు కోఱలు పట్టకార్లు ది

క్కరటి శిరంబు దాయి లయకారుడు కమ్మరి - వైరివీర సం

హరణ గుణాభిరాముడగు మైలమ భీముని ఖడ్గసృష్టికిన్

భావము: లయకారకుడైన శివుడే స్వయాన కమ్మరియై, తన కంఠాన దాచుకున్న కాలకూటవిషమునే (గరళపుముద్ద) ఇనుపలోహముగా మార్చి, దద్దిల్లుతూ కోట్లకొలదిగా రాలే పిడుగులను సమ్మెటలుగా(దభిదభిమని మోదే సుత్తులు) వాడి, తన కనుమంటలనే కొలిమిగా చేసి, తన మెడలో ధరించిన సర్పరాజు వాసుకి యొక్క కోరలనే పట్టుకార్లుగా చేసి, ఎనిమిది దిక్కులా భూమిని మోస్తూ ఉన్న అష్టదిగ్గజాలలో (ఎనిమిది ఏనుగులు) ఒక ఏనుగును తలదాయిగామార్చి, శత్రుసంహారములో, గుణాలలో రాముడంతటివాడైన మైలమ భీముని ఖడ్గమును సృష్టించాడు.

అది ఎంత భయంకరమైన ఖడ్గమో మనం ఊహించుకోవలసిందే! భీమకవి వర్ణించిన మైలమభీముని ఖడ్గం ఎంత శక్తివంతమైనదో, శత్రువులపాలిట ఎలా మృత్యుసమానమైనదో ధ్వనించే పద్యమిది. తెలుగు సాహిత్యం మొత్తంలోనూ ఇంతకన్నా భయంకరంగా ఒక ఖడ్గాన్ని గూర్చి వర్ణించిన పద్యం మరొకటి లేదు! ఈ భీషణవాక్కు వేములవాడ భీమకవిది.

ఈ మైలమభీమన చాలా పరాక్రమశాలి, సాటిలేని ధైర్యసాహసాలు కలవాడిగా చరిత్ర ప్రసిద్ధుడు. ఇతను పిడుగు పడుతూంటే సాహసంతో దానిని తన కత్తితో నరికినట్లు "పిడుగు నర్కిన చిక్కభీమావనీపతి" అని మరో చాటుపద్యంలో ఉంది. ఇంతటి ప్రసిద్ధమైన ఈ ఖడ్గం కొన్ని సంవత్సరాల కిందటి వరకూ పూసపాటి రాజుల సంస్థానంలో భద్రంగా ఉన్నట్లు చెప్పేవారు.

ఈ మైలమభీముని కీర్తి గురించి పొగుడుతూ భీమకవి చెప్పిన ఇంకో పద్యం ఇది.

ఉ నేరుపు బ్రహ్మఁ జేరె నిజనిర్మల తేజము సూర్యుఁ జేరెఁ నా

కారము కాముఁ జేరెఁ నధికంబగు లక్ష్మియనంతుఁ జేరె గం

భీరత వార్ధిఁ జేరెఁ గల పెంపు కులాద్రుల జేరెఁ గీర్తి దా

నూరట లేక త్రిమ్మరుచు నున్నది మైలమ భీముఁడీల్గినన్

భావము: మైలమ భీముని మరణము తర్వాత అతని నైపుణ్యం బ్రహ్మను చేరింది. అతని తేజస్సు సూర్యుణ్ణి చేరింది. రూపము మన్మథుణ్ణి చేరింది. అతని సంపద (లక్ష్మి) విష్ణువును చేరింది. గాంభీర్యము సముద్రాన్ని చేరింది. ఔన్నత్యము కులపర్వతాలను చేరింది. కానీ మరణము వలన అతని కీర్తి మాత్రం ఎక్కడ చేరాలో తోచక ఈ లోకంలోనే తిరుగుతున్నదట. అనగా నేర్పు మొదలగు గుణాలలో అతనికి సమానులుగా చెప్పదగిన బ్రహ్మాదులున్నారు. కానీ అతని మరణం తర్వాత కీర్తికి ఆశ్రయం లభించలేదంటే అతనితో సమానకీర్తి గల మరొక ఆశ్రయమేది ప్రపంచములో లేదని అతడు అసమాన కీర్తిశాలి అని భావము.

మైలమభీముని పరాక్రమమును గురించి కొనియాడుతూ భీమకవి ఎన్నో అద్భుతపద్యాలను రచించాడు. వాటిలో కొన్ని పద్యాలను మొదటి భాగం చివర్లో ఇవ్వబడ్డాయి.

## కులోత్తుంగ చోడదేవుడు

రాజరాజనరేంద్రుడు తన కుమారునకు తన మామ రాజేంద్రచోళుని పేరు పెట్టాడు. నరేంద్రుని తర్వాత రాజ్యబాధ్యతలను రాజేంద్రచోళుడే తీసుకున్నాడు. ఈ రాజేంద్రచోళుడిని కులోత్తుంగ చోడదేవుడు అని కూడా పిలుస్తారు.

కులోత్తుంగ చోడదేవుడు భీమకవి తన వద్ద ఉంటే తనకు ఎటువంటి లోటు కలుగదని, ఏ యుద్ధంలోనైనా తనకే విజయం వరిస్తుందని ఆయనను తన ఆస్థానమునకు పిలిపించుకుని అత్యంత భక్తిశ్రద్ధలతో చూసుకున్నాడు. ఆయనచే కావ్యాలను వ్రాయింపచేస్తూ, అందుకు గొప్పగా సత్కరిస్తూ, గౌరవాభిమానాలతో నడుచుకున్నాడు. అతడొకప్పుడు ఉత్తరదేశమునకు దండెత్తివెళ్ళాల్సి వచ్చినపుడు భీమకవీంద్రుని తనతో రమ్మని కోరాడు. భీమకవి తన వద్ద ఉన్నప్పుడు కులోత్తుంగునకు ప్రతి యుద్ధంలో గెలిచాడు. ఏ యుద్ధంలోనూ పరాజయమును ఎదురుకాలేదు. అప్పట్లో ప్రజలు వేములవాడ భీమకవి తన వద్ద ఉన్నందునే, అతను ఎక్కడికెళ్ళినా విజయమే వరించేదని చెప్పుకునేవారు.

ఇది విన్న కొందరు శత్రురాజులు భీమకవి కులోత్తుంగునకే పరిమితము కాదు కదా! ఎవరు పూజించినా, గౌరవించినా అనుగ్రహిస్తాడు కదా! కావున ఆమహానుభావున్ని మన రాజ్యానికి ఎందుకు ఆహ్వానించకూడదని భావించేవారు. కానీ కులోత్తుంగుని శిభిరంలో ఉన్న భీమకవిని దర్శించి తమ రాజ్యమునకు పిలిచే ధైర్యము ఏ ఒక్కరికి కూడా లేదు. ఒకరోజు భీమకవి చల్లని గాలి కోసం తమ స్కంధావారము విడిచి కొంతదూరము బయటకు వెళ్ళారు. ఆదే సమయానికి సింధూదేశాన్ని పారిపాలించు ధారావర్షుడను రాజు అక్కడే ఉండడం వలన భీమకవిని దర్శించి సగౌరవంగా సత్కరించి "భీమకవీంద్రా! మా రాజ్యమున కొద్ది కాలము ఉండి మమ్ములను అనుగ్రహించండి" అని కోరారు. భీమకవికి అందరూ సమానమే కదా! కావున అలాగే అని ఆతని రాజ్యమైన చక్రకోటానికి వెళ్ళారు.

ఈ సంగతి తెలియని కులోత్తుంగునకు భీమకవి కనపడకపోవడముతో దుఃఖితుడై చాలా చోట్ల వెతికాడు. కొంతకాలానికి భీమకవిని ధారావర్షుడు పిలుచుకు పోయాడని తెలిసింది. భీమకవిని పంపమని వర్తమానము పంపినా ధారావర్షుడు లెక్కచేయలేదు. భీమకవి కోసం ప్రచండసైన్యసమేతుడై కులొత్తుంగుడు, ధారావర్షునిపై ఘోరయుద్ధమే చేశాడు. అయితే ఈ విషయము తెలుసుకుని భీమకవి యుద్ధము జరుగుతున్న చోటుకు వెళ్ళి యుద్ధాన్ని ఆపివేసి, వారిరువురి మధ్య సంధి చేసారు.

ఆ తర్వాతి కాలంలో ఒకసారి కుంతలదేశమును పరిపాలించే విక్రమాదిత్యుడు కులోత్తుంగునిపై దండెత్తి వచ్చాడు. ఇరువురి మధ్య చాలా ఘోరయుద్ధం జరిగింది. తన సైన్యం కన్నా విక్రమాదిత్యుని సైన్యము చాలా అధికంగా ఉన్నందున కులోత్తుంగునికి ఓటమి భయము పట్టుకుంది. పది రోజులుగా సంగ్రామం జరుగుతోంది. 11వ రోజున కులోత్తుంగుడు కాలినడకన భీమకవి వద్దకు వచ్చి నమస్కరించి "నన్ను యుద్ధములో విక్రమాదిత్యుని మీద

విజయము పొందునట్లు ఆశీర్వదించి అనుగ్రహించమని" కోరాడు. తనను అర్థించిన వారి పట్ల కాదనే స్వభావము లేని భీమకవి అనుగ్రహమును కురిపించి "కులోత్తుంగదేవా! నేడు తప్పక నీకు యుద్ధమున విజయము సిద్ధిస్తుంది. ఇక ధైర్యంగా కదనరంగానికి పొమ్ము." అని దీవించి పంపారు. అదే రోజే యుద్ధంలో విక్రమాదిత్యుడిపై కులోత్తుంగుడు అతిపరాక్రమమును ప్రదర్శించాడు. విక్రమాదిత్యుడు ఓడిపోయి తన రాజ్యానికి పారిపోయాడు. (భీమకవి ఆశీర్వాదము ఊరికే పోతుందా? ద్రాక్షారామ భీమేశ్వరుని వరప్రసాది అయిన భీమకవి మాట తప్పక జరిగి తీరాల్సిందే కానీ మరో విధంగా ఎలా జరుగుతుంది.)

అయితే బిల్హణుడిచే రచింపబడి విక్రమాదిత్యునికి అంకితము చేయబడ్డ విక్రమాంకదేవ చరిత్రలోనూ, విక్రమాదిత్యుని శాసనములలోనూ ఈ యుద్ధములో విక్రమాదిత్యుడే గెలిచాడని వ్రాసారు. కానీ కులోత్తుంగుని శాసనాలలో కులోత్తుంగుడు విజయము పొందాడని వ్రాసారు. "కళింగపట్టుపారాణి" అనే ద్రవిడకావ్యములో కులోత్తుంగుడే గెలిచినట్లు వ్రాయబడి ఉంది. విక్రమాదిత్యుడు ఓడిపోయినా అతని జీవితము గురించి బిల్హణుడిచే వ్రాయించుకుంటున్న విక్రమాంకదేవచరిత్రలో తానే గెలిచినట్లుగా వ్రాయించుకొని ఉండవచ్చును. విక్రమాంకదేవ చరిత్రను చూసి, కళింగ పట్టు పారాణి అను పుస్తకమును చూడకుండా, చరిత్రకారులు దక్షిణాపథ ప్రాచీన చరిత్రము నందు విక్రమాదిత్యునికే విజయము సిద్ధించిందని వ్రాసారు. కానీ అది నిజము కాదు.

## రాజ కళింగ గంగు

భీమకవి ఎంత ఉదారగుణము కలవారో, అంతే కోపం కలవారు కూడా. ఈయన స్వాభిమానం దెబ్బతినేలా ప్రవర్తించినా, ఈయన పట్ల అపరాధము చేసినా, సంకల్పానికి, దారికి అడ్డుతగిలినా, ఎంతటి వారినైనా సనకసనందనాది మునులను తలపించేలా ఆగ్రహము చెంది శాపముతో దండిస్తారు. కానీ తాము చేసిన అపరాధానికి క్షమించమని వేడుకున్న వెంటనే శాంతస్వరూపుడై తన శాపాన్ని తనే పటాపంచలు చేస్తారు. నిగ్రహానుగ్రహశక్తులు రెండు ఈయన సొంతము. అందుకే భీమకవిని అందరు నిగ్రహానుగ్రహ సమర్థుడని పిలుస్తారు. ఇదే విషయాన్ని మలకపల్లి పెదశేషయ్య గారు "ఉద్దండకవి వేములవాడ భీమకవి చరిత్ర"లో ఇలా వివరించారు.

సీ తిట్టిన తిట్టు మొత్తిన పిడ్గుకై వడి
నతి భయంకరముగా నడచి కొట్టు
కరుణించి దీవింపఁ గైలాసపతి మెచ్చి
యిచ్చిన వరముగా నెసక మెసగు
శాపంబు వెట్టిన సద్యోవినిర్భిన్న
భక్ష్యభాండమురీతి బయలఁబడును
క్రమ్మఱించిన శాప కాండంబు లెల్లను
వడిఁబటా పంచలై యడగిపోవు
నిగ్రహానుగ్రహ విలాస నియతమాన
మానసోల్లాసవర్తి సంపత్ప్రపూర్తి
ఘనుడు వేములవాడ భీమన కవీంద్ర
చరిత మానందదాయియై వరలుఁగాత

భావము: తిట్టిన తిట్టు, గట్టిగా కొట్టే పిడుగు కన్నా వేగముగా చాలా భయంకరముగా వచ్చి తాకుతుంది. అదే కరుణించి దీవించినపుడు, స్వయానా కైలాసపతైన ఆ పరమేశ్వరుడే ప్రసన్నుడై ఇచ్చిన విధంగా వరాలను గుప్పిస్తారు. శాపము పెట్టిన తక్షణం వికటించిన ఆహారములాగా తీవ్రప్రభావము చూపిస్తూ బయట పడుతుంది. వెనక్కి తీసుకున్నపుడు, శాపమంతా సమూలంగా, వేగంగా పటాపంచలై నశించిపోతాయి. నిరంతరము నిగ్రహ,అనుగ్రహములతో లీలలను చూపుతూ, ఎల్లపుడూ ఆనందమైన మనసుతో ప్రకాశించేవాడు. సంపదలు ఒసగేవాడు. గొప్పవాడు అయిన వేములవాడ భీమకవీంద్రుని చరిత్ర అందరికీ ఆనందమును ప్రసాదిస్తూ ప్రకాశించును గాక!

తన రాజ్యానికి వచ్చిన భీమకవిని రాజకళింగగంగు సగౌరవంగా ఆహ్వానించకపోగా, గర్వంతో భిక్షగాడికి వలె మళ్ళీ రమ్మని భటునితో కబురంపాడు. భీమకవి ఆగ్రహానికిగురై రాజకళింగగంగు, రాజ్యమును కోల్పోయి,

నీడలేక, పూట గడవక భిక్షగాడిగా మారాడు. ఊరూరు తిరుగుతూ, భీమకవికే ఎదుటపడి ఒకపూటకు భోజనం పెట్టమని అడిగే పరిస్థితి తెచ్చుకున్నాడు. పశ్చాత్తాపము చెంది, తన తప్పుకు క్షమించమని వేడుకున్నాడు. తన తప్పును సరిదిద్దుకొనే అవకాశమును ఇవ్వమని కోరాడు. భీమకవి తాను ఇచ్చిన శాపమును ఉపసంహరించుకొని, అతని రాజ్యమును తిరిగి పొందేలా అనుగ్రహించారు.

రాజసందర్శనాలను చేస్తూ కవిత్వమును చెబుతున్న భీమకవి ఒకనాడు సెజ్జనగరం వెళ్ళారు. కళింగగంగురాజు సెజ్జనగరాన్ని పాలిస్తునాడు. భీమకవి కళింగగంగు ఆస్థానానికి వెళ్ళి, అక్కడి భటులతో "తమరిని కలవడానికి భీమకవి వచ్చారని కళింగగంగురాజుతో చెప్పమని" కబురు పంపారు. కళింగగంగు నుంచి ఎటువంటి సమాధానం రాక పోగా మరుసటి రోజున కలుద్దామని ఆ రోజుకు వెనుదిరిగివెళ్ళారు. మరుసటి రోజు ఆక్కడి భటుడితో ఈ క్రింది విధంగా కళింగ గంగుకు రాయభారమును పంపారు.

ఉ "వేములవాడయందు ఘన విశృత కీర్తిఁ జెలంగ నందఱున్
భీమకవీంద్రుఁడంచు నను బెద్దగ నన్నుతిఁ జేయ సజ్జన
స్తోమము లెల్ల సంతసిల్ల దుర్జను లెల్లను భీతి నొందఁగా
బ్రేమను దక్షవాటి పుర భీమ కృపాపరి లబ్ధ తేజుఁడన్

భావము: వేములవాడలో మిక్కిలి ప్రసిద్ధి చెందిన వాడిని (లోకప్రసిద్ధుడను) అందరూ నను చూసి భీమకవీంద్రుడని గొప్పగా పొగుడుతారు. సజ్జనసమూహము నను చూసి సంతోషించగా, దుర్జనులంతా భయపడుతారు. దక్ష పురవాసి అయిన భీమేశ్వరుని ప్రేమ,కృప కలిగి వెలుగొందుతున్న వాడను.

చెప్పెదనింపుగాఁ గవిత శ్రేష్ఠవచః పరిగమ్య మానమై
యొప్పఁగ మంచి చెడ్డగను నోగును బాగగునట్లుగా మఱిన్
గొప్పనుఁ గొద్దిగాఁ దవిలి కొద్ది పదార్థము గొప్ప సేయ నా
కెప్పడు శక్తిఁగల్గు జగదీశ్వర నానుడులాలకింపుమా

భావము: కవిత చెబుతాను వినసొంపుగా, మిక్కిలి గొప్పగా (సాటిలేని విధంగా), బాధలన్నీ మరపించేలా, ధారాళంగా, మంచిగాను(అనుగ్రహం), చెడ్డగానూ(దండన), దోషాలన్నీ బాగయ్యేలా, ఇంకా గొప్పను కొద్దిగా, కొద్దిని గొప్పగా చేసేలా అద్భుతంగా అన్ని కాలాలయందు అప్పటికప్పడు కవిత్వమును చెప్పగల శక్తి కలదు నాకు. నా కవిత్వమును ఆలకించుమా!.

కళింగగంగు "అయ్యా! నీవు మహానుభావుడవు అని తెలుసు! కానీ నీవు తగిన సమయాన రాలేదు. నేను రాజకార్యములతో కొంచెం కూడా తీరిక లేకుండా ఉన్నాను. ఇప్పడు వెళ్ళి ఈ సందడి తీరిన తర్వాత ఒకసారి వచ్చి కనపడండి. అప్పడు మిమ్ములను సత్కరిస్తాను." అని కబురు పంపాడు. సహజంగా రాజులు గర్వగ్రంథులు. లక్ష్మి

యొక్క సన్నని నీలిపొరలు రాజుల కళ్ళకు కప్పి ఉంటాయి. ఆ నీలిపొరలు చిన్న పెద్ద తారతమ్యాలు కనపడనీయవు. భీమకవికి భిక్షమేస్తున్నట్లు సత్కారం కోసం ఇంకో రోజున రావాలా?

"కవీంద్రుడను. రాజసందర్శనార్థం వచ్చాను. నాకు ఎదురేగి సాదరముగా ఆహ్వానించకకుండా ఇది అనుచిత సమయం కాదు. సందడి తీరిన తర్వాత రమ్మంటాడా? సరస్వతీ కటాక్షమున్న కవులన్న ఎంతటి నిర్లక్ష్యభావం" అని అతని గర్వానికి కారణమైన అతని సిరిసంపదలు కోల్పోయేలా, శాపం పెడుతూ ఈ పద్యమును భటులతో రాజుకి అందించమని ఇచ్చి అక్కడి నుంచి వెళ్ళిపోయారు.

ఉ      వేములవాడ భీమకవి వేగమె చూచి కళింగ గంగు తా
సామము మాని కోపమున సందడిఁదీరిన రమ్ము పొమ్మనెన్
మోమునుఁజూడ దోషమిక ముప్పది రెండు దినంబు లావలన్
జాముని కర్ధమందతని సంపద శత్రుల పాలుగావుతన్

భావము: వేములవాడ భీమకవి వేగిరపాటు (తొందర) చూసిన తర్వాత కూడా కళింగ గంగు కనీసం ఉభయకుశల ప్రశ్నలు వేయకుండా, కోపముతో ఇప్పుడు వెళ్ళి సందడి తీరిన తర్వాత రమ్మన్నాడు. మోము చూడని తప్పుకు(నను ఆలకించని తప్పుకు) ముప్పది రెండు దినాల తర్వాతి వేకువజాములోపు అతని సంపద (రాజ్యం) శత్రువుల పాలు గాక తప్పదు.

భీమకవి శాపమును తప్పించడానికి ఎవరికి సాధ్యం? శాపము పెట్టిన మరుసటి రోజే వంగదేశాన్ని పాలించు విక్రమదేవుడను రాజు నలబై వేల కాలినడక సైన్యమును, మూడు వందల ఏనుగుల బలమును, నాలుగు వందల తొంబై ఐదు గుర్రాల సైన్యమును, నాలుగు వందల శతఘ్నులను(వందమందిని చంపగల యోధులను) సమకూర్చుకొని, సెజ్జనగరముపై దాడిచేసి కోటను ముట్టడించాడు.

కళింగగంగు తన పూర్తి సైన్యముతో ఎదుర్కొని విక్రమదేవునితో యుద్ధము చేసాడు. దాదాపు ఇరవై ఎనిమిది రోజులపాటు ఘోరయుద్ధము జరిగింది. ఆ యుద్ధంలో కళింగ గంగు సైన్యము ప్రాణాలొడ్డి పోరాడారు. విక్రమదేవుని సైన్యములో సగభాగము కళింగగంగు సైన్యముచే నాశనము అయ్యింది. ఇరవైతొమ్మిదవ రోజున జరిగ యుద్ధంలో అనుకోని విధంగా విక్రమదేవుని సైన్యం విజృంభించి పోరాడింది. కళింగగంగు విక్రమదేవునికి దొరకిపోయాడు. రాజు శత్రువుల చేతికి దొరికేసరికి మిగిలిన సైన్యము నాలుగు దిక్కులా పలాయనమయ్యింది. విక్రమదేవుడు ఇక యుద్ధాన్ని ఆపివేసి, కళింగగంగును బంధించి తన శిబిరానికి తీసుకు వెళ్ళాడు. మిగిలిన సైన్యం తమ రాజును విడిపించుకోవడానికి వచ్చే అవకాశము ఉన్నందున కళింగనగరములోకి ప్రవేశించే వరకు శత్రువులను ఎదుర్కొనేవిధంగా సైన్యాన్ని అప్రమత్తపరచి జాగ్రత్తపడ్డాడు. మరుసటి రోజున సెజ్జనగరం ప్రవేశించి, కళింగగంగును కారాగారంలో బంధించి, పట్టము కట్టుకున్నాడు.

"రవి చంద్రులు గతి తప్పిన లవలేశము తప్పబోవు నా వచనంబుల్" అన్న భీమకవి మాటలు వ్యర్థము కావు కదా? ఖచ్చితంగా 32 రోజుల తర్వాత తెల్లవారే లోపు కళింగ గంగు రాజ్యభ్రష్టుడైయ్యాడు.

విక్రమదేవుడు కళింగగంగు రాజ్యపాలనా పద్ధతులు చక్కగా ఉండడంతో, అక్కడి ప్రజల మర్యాదలు బాగా నచ్చడంతో అదే అధికారవర్గముతో కొంతకాలము రాజ్యమును పాలించాడు.

ఇదిలా ఉండగా అతనికి వంగరాష్ట్రములో ప్రజల మధ్య కక్షలేర్పడ్డం వలన సామాన్యప్రజలకు అలజడి కలుగుతోందని కబురువచ్చింది. విక్రమదేవుడు, సిరియాళుడనే దండినాథుడిని తన రాజప్రతినిధిగా నియమించి, శాంతి సంస్థాపన చేయడానికి వంగ రాష్ట్రమునికి వెళ్ళాడు. సిరియాళుడు ఎంతో చక్కగా రాజ్యపాలన చేస్తూ వచ్చాడు. కొన్ని రోజులకు కళింగ గంగుపై జాలి కలిగి కారాగారము నుంచి తన ఆస్థానముకు రప్పించి "నిన్ను చెర నుంచి విముక్తున్ని చేస్తున్నాను. ఈ దేశమును వదిలి ఎక్కడికైనా దూరముగా వెళ్ళి బ్రతుకు. మళ్ళీ ఈ దేశముకు తిరిగి వస్తే నీ ప్రాణాలు దక్కవు జాగ్రత్తా." అని మందలించి పంపాడు.

కళింగగంగు నానా దేశాలు తిరుగుతూ కూటికి, గుడ్డకు నోచుకోని పేదవాడయ్యాడు. సుఖాలకు బాగా అలవాటుపడిన వాడగుటచే కూలి పని చేయలేక బిచ్చమెత్తుకుంటూ జీవితం గడిపాడు. ఇతర రాజ్యాలలో తననెవరూ చూసి ఎరుగరు కాబట్టి తనకు ఎటువంటి స్వాభిమానము అడ్డురాలేదు. వంట చేసుకొనే ఓపిక సత్తువలేక అన్నమో, గంజో యాచించుకొని పొట్ట నింపుకుంటూ కాలము గడిపాడు. కళింగగంగు భార్యలు ముగ్గురూ సిరియాళుడి వద్ద ఊడిగము చేసుకుంటూ గడిపారు.

కళింగగంగు, భీమకవిని క్షమించమని అడిగి ఈ కష్టాలనుంచి బయటపడాలని తపించాడు. శాపవిమోచనముకై ప్రార్థించి, తన తప్పను సరిదిద్దుకొనే అవకాశము కోసం ఎదురుచూసాడు. ఇలా కొద్ది రోజులు గడిచాక కళింగగంగు ఊరూరు తిరుగుతూ పెద్దాపురం చేరాడు. ఒకనాటి రాత్రి భీమకవి బంధువుల ఇంట్లో భోజనం చేసి వీధి అరుగుపై చేయి కడుక్కోవడానికి వచ్చారు. అపుడు రాత్రి నాలుగు ఘడియల సమయం. కళింగగంగు తిండి కోసం ఇల్లిల్లూ తిరుగుతూ భీమకవి ఉన్న ఇంటి వైపుకు వచ్చాడు. వస్తుండగా మార్గమధ్యంలో జొన్నలు పాతరనేయుటకై త్రవ్వబడిన ఒక పాత గోతిలో పడ్డాడు. వెంటనే అయ్యో ఒక కాలిదివిటీ కూడా లేకపాయేనే! " అని గట్టిగా అరిచాడు. భీమకవి ఆ చీకటిలో అతని వైపుకు చూసి బిచ్చమెత్తుకొనువాడికి కాలిదివిటీ ఎక్కడి నుండి వస్తుంది. బిచ్చగాడే అయితే కాలిదివిటీ ఎందుకు గుర్తొచ్చింది. ఇతడిట్లు అన డానికి ఏదో బలమైన కారణమే ఉంటుందని గ్రహించి, "ఎవరు నువ్వు? దివిటీ కావాలంటున్నావు?" అని అడిగాడు. కళింగగంగు "అయ్యా! నేను వేములవాడ భీమకవి చేసిన బికారిని. పూర్వము అష్టైశ్వర్యములను అనుభవించి ఉండటం వల్ల అప్రయత్నంగా దివిటీ అయినాలేదే అన్నాను. నా దర్శనార్థం సాక్షాత్తు భీమేశ్వరుని వరపుత్రుడగు భీమకవి వచ్చారు. కనీసం ఆ మహానుభావుని దర్శనం కూడా చేసుకోలేదు. అందుకు తగిన ఫలితాన్ని ఇలా అనుభవిస్తున్నాను. అయ్యా! తమరెవరో మహానుభావుడిలా

ఉన్నారు. ఈ ఒక్కపూటకు నాకు భోజనము పెట్టించండి. ఆకలితో కడుపు దహించుకు పోతోంది. " అని దీనస్వరంతో అడిగాడు.

భీమకవికి మహారాజును ఈ పరిస్థితిలో చూడగానే ఎంతో జాలి కలిగింది. ఇక ఇతన్ని ఈ అవస్థలో చూడకూడదని తలచి, తిరిగి తన రాజ్యాన్ని పొందేలా ఆశీర్వదిస్తూ, ఈ క్రింది పద్యమును చెప్పారు.

ఉ వేయి గజంబులుండ(బది వేల తురంగములుండ( నాజిలో
రాయలగెల్చి సెజ్జనగరంబున( బట్టము( గట్టుకోవడిన్
రాయకళింగ గంగు! కవిరాజభయంకరమూర్తి(జూడగా
బోయిన మీనమాసమున( బున్నమవోయిన షష్ఠినా(టికిన్

భావము: రాజ కళింగగంగు! మహా రాజులకు సైతం వణుకు పుట్టించగల కవి అయిన నేను, భవిష్యత్తును చూస్తూ పోతే వెయ్యి ఏనుగులు, పదివేల గుర్రములు నీ చెంత ఉన్నాయి. త్వరగా యుద్ధంలో రాయలను గెలిచి, మీన మాసములో పున్నమి తర్వాత వచ్చే షష్ఠి రోజుకంతా సెజ్జనగరమున పట్టము కట్టుకో.

కళింగగంగు అమితానందభక్తి పరవశుడై, భీమకవికి సాష్టాంగ ప్రణామము చేసాడు. జరిగిన తప్పకు మన్నించమని వేడుకొని నిలబడ్డాడు. కళింగగంగును భీమకవి లోనికి పిలుచుకు వెళ్ళి, భోజనము పెట్టించారు. మరుసటి రోజున కళింగగంగునకు పెద్దాపురము నుంచి సెజ్జనగరము వెళ్ళుటకు దారి బత్తెము ఖర్చులకు సరిపడా డబ్బు ఇచ్చి పంపారు. కళింగగంగు అవస్థను బట్టి రూపము మారిపోవడం వలన సెజ్జనగరంలో ఎవరూ గుర్తుపట్టలేకపోయారు. అతని తలంతా పెరిగిపోయిన జుట్టుతో, దుమ్ముధూళితో జడలుగా కట్టుకుపోయింది. గడ్డము, మీసాలు బాగా పెరిగిపోగా, బక్కచిక్కిపాయి ముడతలుపడ్డ శరీరముతో ఉన్న కళింగగంగును మహా రాజుగా, మకుటధారిగా చూసిన జనం ఇప్పుడెలా గుర్తు పట్టగలరు.

చాలా రోజులుగా పగటివేషగాళ్ళు కొందరు సెజ్జనగరానికి వచ్చి ప్రభువు విక్రమదేవుని సందర్శించి, వీధుల్లో పగటివేషాలను వేస్తూ, వారి నైపుణ్యంతో పట్టణప్రజను ఆనందడోళికల్లో ముంచెత్తుతున్నారు. రాజకళింగగంగు సెజ్జనగరము చేరునప్పటికి సిరియాళుడు ఆ నగరమును పాలించుటలేదు. సిరియాళుడు వైరాగ్యము కలగడంతో, రాజ్యమును వదిలి తపోవనాలకు వెళ్ళిపోయాడు. విక్రమదేవుడికి, సిరియాళుడి తర్వాత సరైన పరిపాలనాదక్షుడు దొరకలేదు. వంగదేశము పాలించుటకు తన పెద్దకుమారుడైన ఆనందదేవుని నియమించి సెజ్జనగరానికి తిరిగివచ్చాడు.

విక్రమదేవుడికి పగటివేషాలన్నా, వీధినాటకాలన్నా చాలా ఇష్టము. అందువల్ల ఆ పగటివేషగాళ్ళకు కావలసినంత డబ్బిచ్చి వారిచే బ్రాహ్మణ, సన్యాసి, వేశ్యాది వేషములను వేయిస్తూ సంతోషముగా కాలము గడిపేవాడు. ఒకనాడు వారిని తన వేషము వేసి వినోదింపచేయమని ఆదేశించాడు. రాజు ఆదేశము ప్రకారమే వారి నాయకుడు విక్రమదేవుని వేషమును వేయగా తక్కినవారు సభాపతుల వేషమును వేసి అందరినీ అలరించారు. ఇంకో రోజు

కళింగగంగు వేషమును వేసుకురావలసినదిగా, అలా చేసి తనను అలరించినట్లయితే విశేషద్రవ్యమును బహుమతిగా ఇచ్చెదనని ప్రకటించాడు. ఆ వేషగాళ్ళు కళింగగంగు రాజసము, అతని ఠీవిని గురించి వినడమే కానీ, ఎన్నడూ చూసి ఎరుగరు. అందుకు వారి నాయకుడు " మహారాజా! మాకు ఒక నెల రోజులు గడువు ఇవ్వండి. అభ్యాసము చేసి చక్కగా కళింగ గంగు వేషమును వేసి అలరింపచేస్తాము " అని ప్రార్థించాడు. విక్రమదేవుడు కూడా అందుకు సరే అన్నాడు. అంతేకాక వారికి నెల రోజులకు వసతినీ, సరిపడా కావలసిన వంటపదార్థాలను ఇచ్చాడు. ఆ వేషగాళ్ళందరు కళింగగంగు వేషానికి సాధన మొదలుపెట్టారు. కానీ వారిలో ఒక్కరిలో కూడా ఆ రాజఠీవి కనపడలేదు. విక్రమదేవుడు ఇచ్చిన గడువు దగ్గరపడుతోంది, కానీ వారికి ఆ వేషం వేయగల సమర్థుడు మాత్రం దొరకనేలేదు. వారి ధైర్యము కూడా రోజు రోజుకు తగ్గిపోతోంది. చివరకు వేషము వేసే వాడికి వేయి గద్యాణములు బహుమతిగా ఇస్తామని చాటింపు కూడా వేయించారు. ఈ చాటింపు అప్పుడే సెజ్జనగరములో అడుగుపెట్టిన కళింగగంగు చెవినపడింది. ఆ వేషగాళ్ళ నివాసస్థలానికి వెళ్ళాడు. వారితో "ఈ వేషమును నేను వేయగలను. కళింగగంగును చూసిన వాడిని. అంతేకాక నేను ఆ రాజు పోలికలు కలిగినవాడిని. మా ఊరి వారంతా నేను అచ్చం కళింగగంగులా ఉంటానని చెబుతారు. ఆ ద్రవ్యమేదో నాకు ఇప్పించండి. ఆ వేషమును నేను వేస్తానని" వారిని ఒప్పించాడు. ఈ వేషమును వారు ఎందుకు వేయాల్సివచ్చిందో అడిగి తెలుసుకున్నాడు. విక్రమదేవునిపై ఎత్తువేయడానికి తగిన అదను కోసం ఎదురు చూస్తూ ఉన్నాడు. వేషగాళ్ళు కళింగగంగుకు భోజనవసతులను కల్పించారు. వారము రోజులలోనే బక్కచిక్కిన అతని దేహము పుష్టిగా అయ్యింది. వేషమును వేసే రోజుకంతా మునుపటి తేజస్సును పొందాడు. కోటలోనే ఉన్న కళింగగంగు దుస్తులను, ఆభరణాలను, ఆయుధాలను, గుర్రాన్ని రాజుగారికి కబురు పంపి తెప్పించుకున్నాడు. విపరీతముగా పెరిగిపోయిన గడ్డాన్ని తీసివేయించడానికి మంగలిని పిలిపించుకున్నాడు. ఆ మంగలితో కళింగగంగుకు మునుపు ఎలా క్షవరము చేసేవాడివో తనకు కూడా అలానే చేయమని చెప్పాడు. అర్ధక్షవరము అవ్వగానే ఇతను స్వయాన తన రాజు కళింగగంగేనని గుర్తుపట్టాడు. తమ రాజుపట్ల అభిమానమున్న వాడు కావున "మహారాజా నేటికి తమరి దర్శన భాగ్యము కలిగినది" అని సంతోషముతో బదులిచ్చాడు. కళింగ గంగు అతనిని ఈ విషయమును ఎక్కడా ప్రస్తావించకుండా, మనసులోనే ఉంచుకొని, జరగబోయేది చూడమని ఆదేశించాడు. స్నానాదికాల తర్వాత వస్త్రాభ్యాలంకారములు ధరించి, తన వజ్రాయుధమును తీసుకొని తాను పూర్వము ఎక్కే గుర్రమును అధిరోహించి వీధిలోకి వెళ్ళాడు. వేషగాళ్ళందరూ వాళ్లకు తగిన మంత్రి, సామంతాది వేషాలను వేశారు. గుర్రం కూడా తన యజమాని కళింగగంగును గుర్తుపట్టి మిక్కిలి ఉత్సాహముతో కదంతొక్కింది. చూసినవారందరూ అచ్చం కళింగగంగురాజులానే ఉన్నాడే అని ఆశ్చర్యపడ్డారే, కానీ ఒక్కరు కూడా అతడు కళింగగంగురాజేనని ఊహించలేకపోయారు. రాజకళింగగంగు తిన్నగా కోటలోకి ప్రవేశించి, విక్రమదేవుని ఎదుటకు వెళ్ళి, గుర్రంనుంచి దిగి నిలబడ్డాడు. విక్రమదేవుడు కూడా అందరిలాగే అచ్చం రాజకళింగగంగులానే ఉన్నాడని అతన్ని ఎంతగానో మెచ్చుకున్నాడు. కళింగగంగు "మహారాజా! తమరు అనుమతిస్తే కళింగగంగు రాజఠీవిని, గాంభీర్యాన్ని ప్రదర్శించి చూపిస్తాను" అని చెప్పాడు. విక్రమదేవుడు మిక్కిలి ఉత్సాహముతో, అలానే త్వరగా చేసి చూపించమని అడిగాడు.

కళింగగంగు నిండు సభలో తన గుర్రాన్ని ఆ వైపు నుంచి ఈ వైపుకు, ఈ వైపు నుంచి ఆ వైపుకు దుమికిస్తూ, మధ్యమధ్యలో తన వజ్రాయుధమును తీసి ఝుళిపిస్తూ, విక్రమదేవుని దగ్గరగాపోయి రెప్పపాటిలో తన ఆయుధంతో విక్రమదేవుని తల నరికేసాడు. వేషగాళ్ళందరూ తమకు ఏ శిక్ష పడుతుందో ఏమోనని భయపడగా, కళింగగంగు అక్కడివారందరినీ ఉద్దేశించి " నేను వేషగాడిని కాదు. మీ కళింగగంగురాజును. భీమకవిని కలిసి, ఆయన్నుంచి శాపవిమోచనము పొందివచ్చాను. ఆయన ఆదేశానుగ్రహాల వలన ఈవిధంగా మన శత్రువును తుదముట్టించి మన రాజ్యమును చేజిక్కించుకోగలిగాను. ఇక అందరూ అప్రమత్తులై జరుగాల్సిన పనుల చూడమని ఆదేశించాడు. విక్రమదేవుని దహన సంస్కారాలను జరిపించాడు. ఈలోపు విక్రమదేవుని అనుచరగణము, అతని సైన్యము ఏకమై, కళింగగంగుపై యుద్ధానికి సిద్ధపడ్డారు. విక్రమదేవుని సైన్యంపోగా, భీమకవి భవిష్యత్తు చూసి చెప్పిన ప్రకారముగానే 1000 ఏనుగులు 10,000 గుర్రలసైన్యము కళింగగంగు పక్షాన నిలిచింది. ఈ సారి భీమకవి ఆశీర్వాదబలము ఉన్నందున కళింగగంగు తిరుగులేని విజయముతో షష్ఠిలోపు పట్టాభిషేకము చేసుకొని సింహాసనము అధిష్ఠించాడు.
పట్టాభిషేకము తర్వాత తనకు సహాయం చేసిన వేషగాళ్ళను, మంగలిని తగిన పారతోషికము ఇచ్చి సంతోషపెట్టాడు. భీమకవిని తానే స్వయంగా వెళ్ళి, తన ఆస్థానమునకు సభక్తియుక్తంగా పిలుచుకువచ్చి పూజించాడు. తగిన విధంగా సత్కరించాడు. నాటి నుండి భీమకవి కొంత కాలము అతని ఆస్థానమునే ఉండి, రాజ్యపాలనలో సహాయపడుతూ కళింగగంగును అనుగ్రహించారు. ప్రజలు కూడా తమ సమస్యలకు పరిష్కారములము పొందుతూ మిక్కిలి భక్తియుక్తులతో మెలిగేవారు.

# కోమటి గురునాధుడు

భీమకవి రాజమహేంద్రవరం వెళ్ళినపుడు తానే స్వయంగా భోజనము వండుకోవాలని తలచారు. అందుకు కావలసిన బియ్యం, పప్పుదినుసులు మొదలైన వంటసామాగ్రిని కొనడానికి కోమటి గురునాధుని అంగడికి వెళ్ళారు. ఈ కోమటి ఎవరైనా కొత్తవారు, వేరే ఊరి వారు, తన కొట్టుకు వస్తే అందరికీ అమ్మే ధర కంటే రెండు మూడు రెట్లు ఎక్కువ ధరకు అమ్మి లాభము గడిస్తాడు. అతను భీమకవి పేరు వినడమే కానీ, ఎన్నడూ చూడలేదు. అందువల్ల భీమకవి అతని అంగడికి వచ్చినపుడు, కొత్తవారిలా భావించాడు, తనకు ఈ రోజు భలే బేరము దొరికిందని సంతోషపడి, అందరికీ అమ్మే ధర కంటే మూడు రెట్లు అధిక ధర చెప్పాడు. భీమకవి " ఇదేమిటయ్యా! అందరికీ ఇచ్చే ధర కన్నా ఎక్కువ చెబుతున్నావు " అని ప్రశ్నిస్తే, అతను "వచ్చిన వారిని బట్టి, వారి అవసరాలను బట్టి ధరలు నాకు ఇష్టమైన ధర చెబుతాను. ఇష్టమైతే కొను. లేదంటే వెళ్ళిపో. నువ్వు కొనకపోతే నాకు వచ్చే నష్టమేమి లేదు." తలబిరుసు సమాధానము చెప్పాడు. భీమకవి కోపంతో ఈ క్రింది పద్యమును చెప్పారు.

చ  గొనకొనిమర్త్యలోకమునఁ గోమటిపుట్టగఁ దోడఁ బుట్టె బొం
కునుఁగపటంబులాలనయుఁగుత్సితబుద్ధియు రిక్త భక్తియుఁ
జనిమిరిమాటలున్ పరధనంబును గ్రక్కుననొక్కఁ జూచుటల్
కొనుటలు నమ్ముటల్ మిగులఁ గొంటుదనంబును మూర్ఖవాదముల్

ఉ  కోమటి కొక్కటిచ్చి పదిఁ గొన్నను దోషములేద; యింటికిన్
సేమమెఱింగి చిచ్చిడినఁ జెందదు పాపము; వానినెప్పుడే
నేమరుపాటునన్ మఱియు నేమి యొనర్చిన లేదు దోసమా
భీముని లింగమాన; కవిభీముని పల్కులు నమ్మియుండుఁడీ

భావము: అబద్ధములాడడం(బొంకు), మోసముచేయడం(కపటము), అత్యాశ(లాలస), నీచపుటాలోచనలు(కుత్సితబుద్ధి), గౌరవాభిమానాలు లేకపోవడము(రక్తిభక్తి), కల్లబొల్లి మాటలు చెప్పడం (చనిమిరి మాటలు), పరులధనమును నొక్కే అవకాశము కోసము చూచుట (పరధనంబును గ్రక్కునన నొక్కజూచుట), కొని అమ్మడములో మొహమాటమును వదిలి మూర్ఖంగా వాదించడం వంటి లక్షణాలతో పుట్టిన ఏ కోమటి దగ్గరైనా పది కొని ఒకదానికి మాత్రమే చెల్లించినా తప్పులేదు. వారికెటువంటి హాని కలుగకుండా, వారి ఇంటికి చిచ్చుపెట్టినా ఏ పాపమూ కలుగదు. అతని ఏమరపాటును అవకాశముగా తీసుకొని ఏమి చేసినా(మోసము చేసినా) తప్పులేదని భీమేశ్వరునిని మీద ప్రమాణముచేసి ప్రకటిస్తున్నాను. భీమకవి మాటలను విశ్వసించండి.

ఉ రామునమోఘ బాణమును రాజశిఖామణి కంటిమంటయుఁ

దామరచూలి వ్రాతయును దారక విద్విషు ఘోరశక్తియున్

భీముగదావిజృంభణము వెన్నుని చక్రము వజ్రి వజ్రమున్

వేములవాడ భీమకవి భీషణ వాక్యము రిత్తవోవునే

భావము: తిరుగులేని రామబాణం, శివుని మూడోకంటి మంట, బ్రహ్మ తలరాత, తారకాసురున్ని వధించిన సుబ్రహ్మణ్యేశ్వరుని "శక్తి" అస్త్రము, భీముని గదాఘాతము, విష్ణుమూర్తి చక్రము, ఇంద్రుని వజ్రాయుధం ఎలా తిరుగులేనివో శ్రీ వేములవాడ భీమకవి భీషణ వాక్యము కూడా అంతే తిరుగులేనిది.

అక్కడే ఉన్న మరొక కవి, భీమకవి మాటలు వినగానే, మిక్కిలి సంతోషముతో, ఇన్నాళ్ళూ ఆ కోమటిపై ఎంతో కోపమున్నా, అణుచుకొని ఉన్నవాడు, ధైర్యము తెచ్చుకుని, ఒక కోమటికి వ్యతిరేఖంగా ఈ పద్యమును చెప్పాడు.

వేములవాడ భీమ! భళిరే! కవి సన్నుత! పద్యమందు నీ

వేమని చెప్పినాడ వొక యించుక కోమటి పక్షపాతివై

కోమటి కొక్కటిచ్చి పదిఁగొన్నను దోసములేదటందురా?

కోమటి కొక్కటీక పదిగొన్నను దోసము లేదు లేశమున్

భావము: వేములవాడ భీమా! భళారే! చాలా చక్కగా చెప్పారు. పద్యములో నీ వేమని చెప్పావు. ఈ కోమటి వైపు ఇంకా ఒక ఇంచు పక్షపాతము చూపి, ఒక్కటికి చెల్లించి పది కొన్నా దోసము లేదంటిరి? కానీ ఈ కోమటి దగ్గర పది కొని, ఒక్కటికి కూడా చెల్లించకున్నా ఏమాత్రమూ దోసము లేదనినేనంటాను.

ఆ కోమటికి "భీమకవి" అన్న పేరు వినగానే వణుకు పుట్టింది. కళింగగంగును ఒనరించిన తీరు గుర్తుకు వచ్చిందతనికి. అంతేకాక భీమకవికి, ఇంకోక కవి తోడవ్వడంతో వీరిరువురి పలుకులు తనకే ముప్పు కల్గించునోనని భయపడి, బదులు చెప్పకుండా పాదాలపై వాలి "మహానుభావా! నన్ను మన్నించండి. ధనవ్యామోహముతో ఇన్నాళ్ళూ ఇలా చేస్తూ వచ్చాను. తమరెవరో తెలియక మీపట్ల కూడా అదే తప్పచేశాను. ఇకపై ఎవరిని మోసగించకుండా నిజాయితీగా బ్రతుకుతాను. నా అపరాధముకు మన్నించి తమరి యవతజ్ఞతను ఉపసంహరించుకొమ్మని" వేడుకున్నాడు. భీమకవి శాంతించి తన మాటలను ఉపసంహరించుకున్నారు. ఆ కోమటి భీమకవికి కావాల్సిన అన్ని పదార్థాలను ఉచితంగా ఇవ్వబొగా, భీమకవి మాత్రం డబ్బు చెల్లించే తీసుకువెళ్ళారు.

# జన్నమాంబ

జన్నమాంబ ఉదంతము కూడా ఇలాంటిదే. భీమకవి రాజసందర్శనార్థం వెళ్తూ ఒక గ్రామమును చేరారు. ఇంటి ముందు నిలుచున్న జన్నమాంబ అనే వితంతువును చూసి భీమకవి "అమ్మా! భోజనము చేసి పెట్టవా?" అని అడిగారు. అందుకామె "నాయనా నా కంఠమ్మీద ఉన్న వ్రణము(గడ్డ) ఎన్నో రోజుల నుంచి నన్ను బాధ పెడుతోంది. నాకు ఓపిక లేదు." అంది. బహుశా ఆమెకు వ్రణవిముక్తి కల్గించడానికే ఆమె ఇంటికి వచ్చినట్లు భీమకవి "ఆ వ్రణమును నేను పోగొట్టెదను. వండి పెడతావా?" అని అడిగారు. "వ్రణమును పోగొట్టిన ఎందుకు చేసి పెట్టను. భోజనము చేసి పెడితే పాపము రాదుకదా!" అలానే అని బదులిచ్చింది.

భీమకవి ఆమె వ్రణమును పోగొడుతూ ఈ పద్యమును చెప్పారు.

క ఘనరోగంబుల బలమా

కనుగొనగా జన్నమాంబ కర్మపు ఫలమా!

నినుఁ బ్రార్థించెద వినుమా

మునుకొని యో గండమాల మునగకుఁ జనుమా

భావము: కనుగొనగా జన్నమాంబ కర్మల ఫలితంగా అంటిన భయంకర రోగపు బలమా! ఓ గండమాలా(వ్రణమా)! నా ప్రార్థన విని వెళ్ళి మునగ చెట్టును పట్టుకో!

వెంటనే ఆ వ్రణము జన్నమాంబ కంఠమును వదిలి ఇంటి ఎదురుగా ఉన్న మునగ చెట్టును చేరింది. బాధానివృత్తిని పొంది మహదానందంతో భీమకవికి వండి పెట్టింది.

వెళ్ళిన పని ముగించుకొని తిరిగి వస్తూ, భీమకవి ఆమెను పరీక్షించదలచి మళ్ళీ ఆమె ఇంటి ముంగిటికి వెళ్ళి "అమ్మా ఈ ఒక్క పూటకు భోజనము చేసిపెట్టవా?" అని అడిగారు. జన్నమాంబ చేసిన ఉపకారమును మరచినదై, మిట్టమధ్యాహ్నమున భోజనానికి వచ్చిన అర్థికి సహాయం చేయకుండా, " నాకు ఇదేపనా నయనా! ఇంకేం పని లేదా? నేను వండి పెట్టను. ఇంకొకరి ఇంటికి వెళ్ళి అడుగు" కఠినస్వరంతో సమాధానం చెప్పింది. అక్కడి నుంచి వెళ్ళిపోతూ మునుపు మునగ చెట్టును చేరిన వ్రణమును తిరిగి ఆమె కంఠమును చేరేలా చేసి వెళ్ళిపోయారు.

## సాగిపోతురాజు

కళింగగంగు, గురునాథులు భీమకవి పట్ల అపచారము చేసి తొలుత కోపానికి గురైనా, తమ తప్పును తెలుసుకొని క్షమించమని వేడుకొని భీమకవి కృపానుగ్రహాలను పొందారు. కానీ సాగిపోతురాజు గర్వమదము తలకెక్కినవాడై భీమకవి దేశయాటనం ఉపయోగించు గుర్రాన్నే అపహరించుకుపోయాడు. భీమకవి ఎన్నిసార్లు నెమ్మదిగా తన గుర్రమును ఇవ్వమని అడిగినా ఇవ్వలేదు. భీమకవి ఆగ్రహము చెంది ఏడురోజులకు(తప్పు తెలుసుకునేందుకు ఏడు రోజుల గడువు) మరణిస్తావని శాపమిచ్చారు. భీమకవి పలుకులు నన్నెంచేయగలవని పెడచెవినపెట్టడంతో ఏడవరోజున మరణించాడు. దేశయాటనముచే తన కవితాశక్తిని లోకానికి వెల్లడిచేయాలని సంకల్పించి, భీమకవి ద్రాక్షారామభీమేశ్వరునికి మొక్కుబడిగా ఇవ్వబడిన ఒక గుర్రంపై ప్రయాణమయ్యారు. ద్రాక్షారామభీమేశ్వరుని గుఱ్ఱమును అధిరోహించే సమర్థుడు, అర్హుడు భీమేశ్వరుని తనయుడైన ఒక్క భీమకవి తప్ప మరొకరు లేరు, కావున ఆ గుఱ్ఱాన్ని భీమకవికి ఇచ్చారు. నాటి నుంచి భీమకవి ఎక్కడికి వెళ్ళినా, ఆ గుఱ్ఱము మీదే వెళ్ళేవారు. ఒకసారి కృష్ణ మండలంలో నందిగామకు నాలుగు క్రోశముల దూరంలో నైరుతి మూలాన ఉన్న గుడిమెట్టకు వెళ్ళారు.

అలా గుడిమెట్ట చేరిన తర్వాత భీమకవి భోజనానికి వెళ్ళినపుడు, పోతురాజు ఆ గుఱ్ఱాన్ని చూసాడు. అది తన గుఱ్ఱాల నుంచి తప్పిపోయిన గుర్రమని భావించాడు. కనీసం ఆ గుఱ్ఱము తనదా? కాదా? తనదే అయితే భీమకవి వద్దకు ఎలా వచ్చింది? అని ఏ మాత్రం విచారించక కనీసం భీమకవికి తెలియజేయకుండా, ఆ గుర్రాన్ని తన అశ్వశాలకు తోలుకు పోయి కట్టేశాడు. తనను ఎదురించే ధైర్యం ఎవరికుందన్న పొగరుతో ఇలా చేసాడు. భీమకవి భోంచేసి వచ్చేసరికి గుఱ్ఱం లేదు. అక్కడే నివసిస్తున్న రాహుతిమారుడను ఒకడు "అయ్యా మీ గుర్రమును పోతురాజు తీసుకొని పోయాడు" అని భీమకవికి చెప్పాడు. అక్కడి వారంతా రాజే నిజానిజాలు విచారించక అన్యాయంగా ప్రవర్తిస్తే, మనలాంటి వారి పరిస్థితి ఏంటని" నివ్వెరపోయారు.

భీమకవి పోతురాజు పినతండ్రి కుమారుడైన వాత్సవరాయలక్ష్మీగజపతిరాజుకి జరిగిన విషయం చెప్పారు. ఇతను భీమకవి ఉద్దండచరిత్ర తెలిసినవాడు కావున భయపడి ఎలాగైనా తన అన్నను ఒప్పించి గుర్రమును తిరిగి ఇప్పిస్తానని మాటిచ్చాడు.

లక్ష్మీగజపతిరాజు, పోతురాజు వద్దకు వెళ్ళి "అన్నా భీమకవి మహాకోపి. తను కోపగించుకోక ముందే గుఱ్ఱమును తిరిగి ఇచ్చి వేయండి. లేదంటే నిన్ను నాశనము అయ్యేలా శపించి వెళ్ళిపోతాడు" అని హితువు చెప్పాడు. పోతురాజు " ఆ గుఱ్ఱమును ఇవ్వను గాక ఇవ్వను" అంటూ మూర్ఖంగా పట్టుపట్టాడు.

తన తండి ద్రాక్షారామభీమేశ్వరునికి బహుమానంగా ఇవ్వబడిన గుఱ్ఱం. భీమకవికి గుఱ్ఱాన్ని రప్పించుకోవడం పెద్ద విషయమేమీ కాదు. కానీ పోతురాజుకు తప్పు తెలుసుకుంటాడని ఇంత కాలము ఆగారు. ఇక పోతురాజు దిగిరాక పోవడముతో ఇటువంటి పాలకుడికి మరణదండమే న్యాయమని క్రింది పద్యంతో శిక్షించారు.

హయమది సీత పోతవసుధాధిపుడారయ రావణుండు ని
శ్చయముగ నేను రాఘవుడ సహ్యజ వారధి మారుడంజనీ
ప్రియతనయుండు లచ్చన విభీషణుఁ డీ గుడిమెట్ట లంక నా
జయమును బోతరక్కసుని చావును నేడవనాడు చూడుడీ.

భావము: గుఱ్ఱము సీత వంటిది. అపహరించిన పోతురాజు రావణుడు. నేను ఖచ్చితముగా రాముడిని. ఈ కృష్ణానది సముద్రము. గుఱ్ఱము ఆచూకీ తెలిపిన రాహుతిమారడు అంజనీ ప్రియతనయుడైన హనుమంతుడు. తనకు రాయబారము నడిపిన పోతురాజు తమ్ముడు లక్ష్మీగజపతిరాజు విభీషణుడు. పోతురాజు పాలిస్తున్న ఈ గుడిమెట్ట లంక. నా గెలుపును పోతురక్కసుని చావును ఏడవ రోజున చూడండి.

ఇలా ఈ వృత్తాంతాన్ని రామాయణంతో ఎంతో అద్భుతంగా పోల్చిచెప్పారు. ఎడవ రోజు దగ్గర పడుతున్నా, పోతురాజు తప్పను తెలుసుకోలేకపోయాడు. అమోఘమైన భీమకవి శిక్షము ఎవరు తప్పించగలరు? ఏడవరోజున ఖచ్చితంగా పోతురాజు చనిపోయాడు.

భీమకవి దైవాంశసంభూతుడు. ఆశ్రయించిన వారికి దయాసాగరుడు, తన సంకల్పానికి అడ్డుతగిలిన వారికి మహాకఠినుడు. అంతేకాక గుణవంతులూ, ధర్మపరిపాలకులూ, గొప్ప దాతలూ ఎదురైతే వారిని పొగుడకుండా ఉండలేరు. అటువంటి వారిని గురించి, ఎవరైనా అనుచితంగా ప్రవర్తించిన వారిని వదిలేవారు కాదు. వారికి తగిన విధంగా సమాధానమిచ్చేవారు. ఇలా భీమకవి నుంచి పొగడ్తలందుకున్న ధర్మాత్ములు చాలా మంది ఉన్నారు.

# గోపరాజు రామప్రధానుడు

గోపరాజు రామప్రధానుడనే నియోగబ్రాహ్మణుడు భీమకవి కాలానికి చెందినవాడు. ఇతడు గజపతి వంశానికి చెందిన కాకతీయరాజైన గణపతిదేవుడి ఆస్థానమంత్రిగా ఉండేవాడు. ఇతను తన స్వశాఖీయులైన బ్రాహ్మణులపై చాలా అభిమానమును కలిగినవాడు. నియోగబ్రాహ్మణులకు ఉపాధి కల్గించడానికి ఎందుకూ ఉపయోగము లేకుండా కంసాలుల ఆధీనములో ఉన్న భూములను ఇప్పించాడు. కృష్ణానదీతీరాన ఉన్న భూములను కూడా గణపతిదేవుని నుంచి గ్రహించి ఉపాధి లేని బ్రాహ్మణులందరికీ ఇప్పించాడు. వారికి మంచి మంచి సదుపాయాలను కల్పించాడు. వేములవాడ భీమకవి ఇతని వద్దకు వెళ్ళి అతను చేయు పనులకానందించి ఇలా పొగిడారు.

సీ వీడెపోదుష్టారి వీర మంత్రి కఠోర
భూధరంబులకు దంభోళిధార
వీడెపో కవిరాజు గాఢదారిద్ర్యాంధ
కారంబులడఁగించు కమలహితుడు
వీడెపో బహునీతి విద్యానిరూఢిచే
సురగురుగెల్చిన శుభకరుండు
వీడెపో చతురబ్ధి వేష్టితావనిఁ గల్గు
బహుమంత్రికుల సార్వభౌమమూర్తి
ఈతడే సర్వదేవతా ప్రీతికరుడు
ఈతడే గోవరాట్కుల శీతభానుఁ
డని కవీంద్రులు పొగడంగ నతిశయిల్లె
మంత్రి జంభారి రామయామాత్యశౌరి

సీ తనకీర్తి యాచంద్ర తారార్కముగ మంత్రి
కులులకు గరిణీకములనొసంగి
నతిథిసంతర్పణమను దినంబునొనర్చి
ఖ్యాతిగాహరిహర ప్రీతిఁజేసె
వర్ణాశ్రమాచార నిర్ణయంబులనెల్ల
వేదోక్తరీతిగా వెలయఁజేసె
ఘనవిప్రవందిమాగధకవీంద్రులనెల్ల
నగ్రహారములిచ్చి యాదరించెఁ

నతడు శ్రీగోపరాజా న్వయాబ్ధిచంద్రుఁ
డవఁగ విలసిల్లెఁ దనపాటిఘనులువొగడ
మంత్రి దేవేంద్రుఁడనఁగ స్వతంత్రలీల
మంత్రి కులహేళి రామయా మాత్యమౌళి

ఈ రామప్రధానుడు భీమకవిని ఎంతగానో ఆదరించి, ఆయన వద్ద శిష్యుడిగా ఉండి, కవిత్వము చెప్పడము అలవర్చుకున్నాడు. భీమకవి శిష్యులందరిలో గోపరాజు రామప్రధానుడు ఎంతో రసవంతంగా కావిత్వమును చెప్పగలిగారు.

ఒకనాడు భీమకవి రామప్రధానునితో "నువ్వు గొప్ప ఉద్యోగంలో ఉన్నావు. ఈ ప్రాంతంలో ఎంతో మంది వృత్తిహీనులై ఉన్నారు. వారందరికీ ఉపాధి కల్పించమని" చెప్పారు. రామప్రధానుడు భీమకవికి అలానే చేస్తానని మాటిచ్చాడు.

ఇది జరిగిన కొంత కాలానికి ఒకరోజు రామప్రధానుడు పన్నుల వసూలుకై పల్లకినెక్కి సముచితపరివారముతో వెళ్ళాడు. ఇతని కుమార్తె చాలా పేదరాలు. ఆమె భర్త ఆస్థినంతా దుర్వ్యయాలకు ఖర్చుపెట్టి నాశనము చేశాడు. కుటుంబం నడవక తాను వైదికవృత్తి నవలంభించి పొట్ట నింపుకొనేది. ఆమె ఆనాడు అదే దారిలో వెళ్తూ, తన తండ్రి పల్లకిలో వస్తుండడం చూసి, తన దుస్థితిని చూస్తే తండ్రి ఎక్కడ బాధ పడతాడోనని, కనపడకుండా, చెట్టు మాటున దాక్కుంది. అది గమనించిన రామప్రధానుడు చాలా బాధపడ్డాడు. అందరికీ ఉపాధి కల్పించమని భీమకవి ఎందుకు చెప్పారో అతనికి తన కూతురి దుస్థితిని చూసిన తర్వాత అర్థమయ్యింది. అప్పటిలో ఇలాంటి దురావస్థ బ్రాహ్మణకులంలో ఎక్కువగా ఉండేది. ఇక ఏమాత్రం ఆలస్యము చేయకుండా, నియోగిబ్రాహ్మణుల కష్టాలను అతి త్వరగా తొలగించాలని దృఢంగా నిశ్చయించుకున్నాడు.

ఆ తరువాత శాలివాహనశకమున రక్తాక్షినామ సంవత్సరభాద్రపద బహుళ అమావాస్య, సోమవారము నాడు, సూర్యగ్రహణ కాలము నందు గణపతిదేవుని నుంచి 90 వేల పణ్యారముల భూమిని తన ఇష్టము వచ్చినట్లూ దానం చేయడానికి అధికారము తీసుకోని, నియోగి బ్రాహ్మణులకు భూదానములు చేశాడు.

ఈ సంఘటన తర్వాత వైదికులలో మూర్ఖబ్రాహ్మణులు కొందరు అధికారదానము పరిగ్రహించాడని రామప్రధానున్ని విమర్శలు చేశారు.ఆ మాటలు భీమకవి చెవినపడ్డాయి. ఆ మూర్ఖబ్రాహ్మణులనుద్దేశించి క్రింది పద్యాలను రచించి వారికి తగిన సమాధానము చెప్పారు.

ఉ	మానఘనుండు; బ్రహ్మకులమండనమూర్తి; పరోపకారి; దు
ర్దానదురానముల్ గొనడు; తప్పడుస్వామిహితోపకారముల్
దీనులఁబోచుబాంధవవిధేయుడు డస్సియు వేడబోడు తా
నూనిన వేడ్కతోడను నియోగికిచ్చిన దానమల్పమే!

భావము: గోపరాజు రామప్రధాముడు గొప్పస్వభావము కలవాడు; బ్రాహ్మణకులానికి మకుటము(భూషణము) వంటివాడు; పరోపకారి; ఆడినమాటా, చేసిన దానం (పంచదానాలు) వెనక్కితీసుకోడు; ఎల్లవేళలా తన అధికారి మంచినికోరుతూ, రాజకార్యాలలో అతనికి సహాయపడ్డం మరువనివాడు; పేదవారిని తన బంధువులవలె, స్నేహితునివలె అవసరాలందు ఆదుకొనేవాడు; విధేయుడు; ఒకరిని యాచించడు. తనను వేడుకొనిన వెంటనే నియోగబ్రాహ్మణులకు దానము చేసాడు. అది చిన్న విషయమా? గుర్తించడగినది కాదా?

ఉ వ్రాయుట చిత్రమా! వికృత వైదికమా! నిజదార రక్షణో

పాయముకై నియోగి యిల బార్థివ సేవ యొనర్చినంతనే

పాయునె వంశ శీలములు? పాయకయెప్పుడు చిత్రగుప్తుడున్

వ్రాయడె యెల్ల లోకముల వారలు సేసిన పుణ్యపాపముల్,

భావము: అనామతునిగా దాచబడి, ఎందుకూ నోచుకోని సంపదను కాపాడి, సద్వినియోగము చేయదలచి నియోగి బ్రాహ్మణుల సేవకై(ఉపాధి కై) ఇచ్చినంత మాత్రాన కులగౌరవము చెడిపోవునా? అతడు కీర్తి హీనుడగునా? ఇలా వ్రాయుట భావ్యమా? వికృతమైన పనిగా వేదాలలో చెప్పబడిందా(లేదు)? ఎవరు గుర్తించకపోయినా ఎల్ల లోకముల వారు చేసిన పాపపుణ్యాలు వ్రాసే చిత్రగుప్తుడు మాత్రము అతని పుణ్యకార్యాలను గుర్తించి ఎప్పటికీ చెరిగిపోకుండా వ్రాయును.

"చిత్రగుప్తుడు మాత్రము అతని పుణ్యకార్యాలను గుర్తించి ఎప్పటికీ చెరిగిపోకుండా వ్రాయును" అన్నమాటలతో అతని పుణ్యకార్యాల ఫలితాన్ని చెరిగిపోకుండా, శాశ్వతముగా నిలిచేలా అనుగ్రహించారు.

## సింగన మాచనమంత్రి

మాచనమంత్రి నియోగి బ్రాహ్మణుడు. ఇతని తండ్రి పేరు సింగన. తల్లి పేరు లక్కమాంబ. ఇతడు రాజేంద్రచోడుని వద్ద మంత్రివర్యునిగా, దండినాథునిగా పని చేశాడు. భీమకవి ఒకనాడు ఈతని ఇంటికి వెళ్ళారు. ఇతను భీమకవిని పలకరించలేదు. కారణము ఆ సమయంలో రాచకార్యవిషయముల గురించాలోచిస్తూ, లీనమైపోయి బయటి ప్రపంచమును పూర్తిగా మరచిపోయాడు. భీమకవి అతనిని చూసి ఈ క్రింది పద్యాలను చెప్పారు.

సీ. కులమును రూపును గుణమును గల్గిన
యింతి నిల్లాలుగా నేలవలయు
వీర్యంబు హితమును నెరవును గల్గిన
పురుషుని బంటుగాఁ బ్రోవవలయు
స్త్రీ పెంపు వాటింప నోపక కలిమిమై
నిలయేలురాజును గొలువవలయు
అఖిలంబు నెఱిఁగి దయాళుఁడై పెంపొందు
మూర్తి సద్గురుఁ డంచు మ్రొక్కవలయు

గీ. కాన నిన్ని గుణంబులు గల్గెనేని
అలియెడఁ బుత్త్రునందు భూపాలువలన
గురునిపట్టున సౌఖ్యంబు గూడు టరుదె
మనుజమందార! సింగనమంత్రి మాచ!

సీ. న్యాయంబుదప్పనినరపతి నరపతి
నరపతి పాలించునాడు నాడు

నా డెఱింగినదొరపోఁడిమి పోఁడిమి
పోఁడిమి సొబగైనబుధులు బుధులు
బుధులు సంభావించుపురుషుండు పురుషుండు
పురుషోత్తమునిమీఁదిబుద్ధి బుద్ధి
బుద్ధిమంతున కైనపుణ్యంబు పుణ్యంబు
పుణ్యలక్షణ మైనపొలఁతి పొలఁతి

గీ. పొలఁతి యట్టిద కలవానికలిమి కలిమి
కలిమి చల మని తెలిసినతెలివి తెలివి
భానునిభతేజ! లక్కమాంబాతనూజ!
మనుజమందార! సింగనమంత్రిమాచ.

సీ. అర్థులయెడలఁ బ్రత్యర్థులయెడలను
వెఱ వెఱుంగనివాఁడె వీరవరుఁడు
సతులసన్నిధి మహీపతులసన్నిధియందుఁ
దత్తఱింపనివాఁడె ధైర్యపరుఁడు
ధన మగ్గలంబైనఁ జన నగ్గలంబైన
గర్వ మెర్గనివాఁడె కార్యపరుఁడు
శివుమీఁద నైనఁ గేశవుమీఁద నైనను
దలఁపు నిల్పినవాఁడె తత్త్వఘనుఁడు

గీ. కాన నిట్టివివేకంబు గలిగి మెలఁగు
పురుషు లిహపరసౌఖ్యముల్ పొందువారు
భానునిభతేజ! లక్కమాంబాతనూజ!
మనుజమందార! సింగనమంత్రి మాచ!

సీ. ఈలోకపుసుఖంబు నాలోకపుసుఖంబు
సతిచేత సుతుచేతఁ జాలఁ బడసి
మేనిరోగంబును లోనిరోగంబును
వెజ్జుచే వేల్పుచే నుజ్జగించి

వెఱ వెఱుంగనివాఁడె వీరవరుఁడు

సతులసన్నిధి మహీపతులసన్నిధియందుఁ

దత్తఱింపనివాఁడె ధైర్యపరుఁడు

ధన మగ్గలంబైనఁ జన మగ్గలంబైన

గర్వ మెర్గనివాఁడె కార్యపరుఁడు

శివుమీఁద నైనఁ గేశవుమీఁద నైనను

దలఁపు నిల్పినవాఁడె తత్త్వఘనుఁడు

గీ. కాన నిట్టివివేకంబు గలిగి మెలఁగు

పురుషు లిహపరసౌఖ్యముల్ పొందువారు

భానునిభతేజ! లక్కమాంబాతనూజ!

మనుజమందార! సింగనమంత్రి మాచ!

సీ. ఈలోకపుసుఖంబు నాలోకపుసుఖంబు

పతిచేత సుతుచేతఁ జాలఁ బడసి

మేనిరోగంబును లోనిరోగంబును

వెజ్జుచే వేల్పుచే నుజ్జగించి

సురతర్పణంబు భూసురతర్పణంబును

భక్తిచే శక్తిచేఁ బరఁగఁ జేసి

అతిసుకృతంబును నభిమతార్థంబును

నీతిధైర్యంబుల నెఱయఁ జేసి

గీ. తొల్లిచన్నమహాత్ముల త్రోవ దెలిసి

తప్పకుండ మెలఁగువారు తత్త్వఘనులు

భానునిభతేజ! లక్కమాంబాతనూజ!

మనుజమందార! సింగనమంత్రి మాచ!

సీ. తల్లిదండ్రులఁ బ్రోచుతనయుండు తనయుండు
తగురాజు చేపడ్డధరణి ధరణి
అభిమానవతి యైన యంగన యంగన
యక్కఱకొదవిన యర్థ మర్థ
మెఱుకాంతఁ గోరనిపురుషుండు పురుషుండు
వేఁడనియాతనివిద్య విద్య
సంగరాంగణమునఁ జచ్చుట చచ్చుట
పవసించి సల్పెడువ్రతము వ్రతము

గీ. ఎదురు తన్నెఱిఁగినయట్టి యెఱుక యెఱుక
ప్రజలు మెచ్చఁగఁ జెప్పెడిపాటి పాటి
పగయె లేకుండ బ్రదికినబ్రదుకు బ్రదుకు
మనుజమందార! సింగనమంత్రిమాచ!

సీ. ఎఱువుశృంగారంబు నరవుసంభోగంబుఁ
జేయుంటయెల్లను సిగ్గుగాదె
విప్పునిపువ్వును నొప్పునికాంతను
ననుభవించుట యెల్ల నధమవృత్తి
తన్నెఱుంగక యున్న మన్నింపు లేకున్నఁ
గాఁపురం బుండుట కష్టకరము

తరమెఱుంగనిరాజు వరమీని దైవంబుఁ
గొల్చుటయెల్లను గూళతనము

గీ. గాన నెప్పుడుఁ జతురుఁడై ఘనత మెఱసి
ప్రజలు మెచ్చంగ సుఖలీల బ్రదుకవలదె
భానునిభతేజ! లక్కమాంబాతనూజ!
మనుజమందార! సింగనమంత్రిమాచ!

సీ. ఉద్యోగహీనుఁడై యుండెడుమనుజుఁడెఁ
బ్రోవంగఁ జాలఁ డేదేవుఁడైన
ధరఁ గృతఘ్నుండైననరునివర్తన చూచి
క్రక్కదే పుచ్చిఁకుక్క యైన
అత్యంతధనలోభి యగువాని యెడరోసి
నవసి వర్తిలవె ప్రాణంబులైన
అఖిలజగద్ద్రోహి యగువాని కఁగరే
కృప చాలఁ గల్గినతపసులైన
గీ. గాన నుద్యోగియై కృతఘ్నతఁ బాసి
వెలయ లోభంబు విడిచి జీవులకు నెగ్గు
సేయకుండెడువాఁడు విశిష్టుఁ డంద్రు
మనుజమందార! సింగనమంత్రిమాచ !
సీ. సంపద్ఘ్నునిఁ జేయఁజనదు కృతఘ్నుని
సైన్యాధిపతిఁ జేయఁజనదు భీతు
కపటాత్ము సాక్షియుఁగాఁ జేయ వలవదు
సన్మంత్రి మెలఁగింపఁజనదు సభల
కార్యంబు లూహింపఁగా దవివేకితోఁ
గాదు వంచకుఁ గార్యకర్తఁ జేయ
పాపాత్ముఁ బరమిత్రు భక్తిహీనుని
వలవదు పరిచరవర్గిఁ జేయ

గీ. అనృతభాషణము చేత దుర్వ్యసని చేత
లోలమతిచేత నత్యంతలోభిచేత
వినినకార్యంబు వలవదు విశ్వసింప
మనుజమందార! సింగనమంత్రిమాచ!

సీ. కులమున నధికుఁడై గుణవంతుఁ డయ్యెనా
యాకారహీనుఁడై యలరుచుండు
నాకారలక్షణం బంతయుఁ గల్గినా
యోగ్యత లన్నియు నొప్పకుండు
యోగ్యత లన్నియు నొప్పుచు నుండెనా
గర్వాంధకారంబు గప్పియుండు
గర్వాంధకారంబు గప్పక యుండెనా
యనుకూలసతి లేక యవయుచుండు

గీ. కొమ్మ గలిగిన సంతతికొఱకు వగచు
పుత్రసంతతి మొదలుగాఁ బొందె నిన్ను
భానునిభతేజ! లక్కమాంబాతనూజ!
మనుజమందార! సింగనమంత్రిమాచ!

అప్రతిహతంగా చెప్పిన ఆ అద్భుత పద్యాలను విని మాచన మహదానందుడై భీమకవిని సత్కరించాడు. ఆ సత్కారములను గైకొన్న భీమకవి, అతని కళ్ళముందే ఆ ధనాన్నంతటినీ పేదవారికి పంచిపెట్టి “ధనమొకరి వద్ద శాశ్వతంగా నిలిచి ఉండదు. దానము చేయుట దాచుకొనుటయే. కావున ఇలా చేసాను. నీవు కూడా దానకర్ణుడవు కమ్ము“ అని హితోపదేశము చేశారు. ఆనాటి నుండి మాచన మంత్రి విద్వాంసులనూ, కవులనూ సత్కరిస్తూ, బీదవారికి మహాదానాలను చేస్తూ గడిపాడు.

# పావులూరి మల్లన

పావులూరి మల్లన భీమకవికి సమకాలికుడు. ఇతను శివ్వన్న అను అతనికి కుమారుడు. భీమకవి సవతి తల్లులలో ఒకామెకి ఈ శివ్వన్న తోబుట్టువని మలయమారుత కవీంద్రునిచే రచించబడిన "నీతి శాస్త్రము"లో వ్రాయబడింది. పావులూరి మల్లన గణితశాస్త్రములో మిక్కిలి పండితుడు. "పావులూరి గణితము" అనే పేరుతో గణితశాస్త్రమున ఒక పుస్తకం రచించాడు. పావులూరు మల్లనకు రాజరాజనరేంద్రుడు నవఖండవాడ అనే గ్రామమును దానము చేశాడు. పిఠాపురములోని కుక్కుటేశ్వరస్వామి వారి ఆలయాము నందు ఈ దానశాసనం లభించింది. ఈ దానశాసనమును భీమకవి రచించారు. ఈ శాసనం చివరిభాగమున "ఇతి వేములవాడ భీమకవి కృతమ్ " అని ఉన్నది. ఈ పావులూరి మల్లనపై వేములవాడ భీమకవి రచించిన పద్యమాలిక

సీ ఆందోళికంబునం దతిరహస్యంబుగాఁ
జాపఱాయిని బెట్టఁజాటినావు
జలనిధిలోతు లెక్కలచేతగన్గొని
యద్దఱిద్దఱియొడ్ల కరిగినావు
మూసినబండిలో మునిగియుండెనని తెల్పి
ఱేనికిఁగోపంబు ఱేచినావు
గాలిచేనల్లాడు కాగడాచుట్టలో
గద్యాణములమూటఁ గాంచినావుఁ
గణితశాస్త్రంబురచియింపఁ గల్గినావు
పతిని మెప్పించి గ్రామముల్వడసినావు
తలఁవనీసాటి మంత్రులిద్ధరనుగలరె?
మహితగుణవార! శివ్వన మల్లధీర.

# గణపతిదేవుడు-వాసుదేవభట్టారకుడు

భీమకవి దురుసుగా ప్రవర్తించేవారిని, కవులను తక్కువ చేసి చూసే వారిని వదిలేవారు కాదు. వారిని ఓడించి, గర్వభంగము చేసి చూపేవారు.

గణపతిదేవుని ఆస్థానమున ఉన్నపుడు భీమకవి కొన్ని పద్యాలను రచించి వినిపించారు. భీమకవి గణపతి దేవుని వద్ద ఉన్నపుడు వ్యాకరణశాస్త్రములో ఆరితేరిన వాసుదేవభట్టారకుడనే బ్రాహ్మణుడు రాజదర్శనార్థం వచ్చాడు. గణపతిదేవుడి కన్నా తొలుత భీమకవిని సత్కరించాడు. వాసుదేవభట్టారకుడిని అతని పాండిత్యప్రకర్షమును విన్న తర్వాత సత్కరించాడు. కానీ భీమకవి కన్నా తనను తక్కువగా సత్కరించాడని భావించి, మనసులో "ఔరా కాలమహిమ కాకపోతే! కల్లబొల్లి మాటలతో కవిత్వమల్లే వారిని సత్కరించినట్లు సకల విద్యాపరిపూర్ణుడైన పండితున్ని సత్కరించట్లేదు. ఎలాగైనా నా నైపుణ్యం చూపించి కవీశ్వరుని కన్నా శాస్త్రపండితులనే విశేషముగా సత్కరించేలా చేస్తాను. నేను కూడా కొద్దిపాటి కవిత్వము చెప్పగలను కదా! నా కవిత్వమును ఉపయోగించి కవుల కన్నా గొప్పగా వినిపించెదనని" ఈ క్రింది పద్యమును చెప్పాడు  వాసుదేవభట్టరకుడు.

సీ	అవగతశబ్ద శాస్త్రచయులైన మహాత్ములు పండితోత్తముల్
	భువనతలంబునం దధిక పూజ్యులు; వారటులుండఁ గూటికై
	నవనవకల్పనావిధి చణత్వముదోఁపనబద్ధమాడు నీ
	కవులిల దాన పాత్రులయి గౌరవమందుట చూవెచిత్రముల్

భావము: వ్యాకరణశాస్త్రము నందు పరిపూర్ణజ్ఞానం కలిగిన మహాత్ములు, గొప్పపండితులు ఈ భూలోకములో గొప్పగా పూజింపదగినవారు. వారిని వదిలేసి, పొట్టకూటికై క్రొత్త క్రొత్త కల్పనలు చేస్తూ పొగుడ్తలతో పిండి, అబద్ధమాడే కవులు ఈ లోకములో అధికంగా దానపాత్రులై, గౌరవమును పొందుతున్నారు ఎంత విచిత్రమో చూడండీ!

వెంటనే భీమకవి అందుకొని

చ	కవికమలాసనుండు; త్రిజగత్పతియైనపినాక పాణియున్
	కవియె తలంపగాఁ గవులు కారె పరాశర బాదరాయణుల్
	కవికృతపుస్తకగ్రహణగర్వితులల్పులె? పూజలందగాఁ
	గవులట! దానపాత్రులట కారట! యిట్టి విపోచిత్రముల్!

భావము: కవియే బ్రహ్మదేవుడు(బ్రహ్మ తన ఊహాశక్తిని పదునుపెట్టి మన తలరాతలు వ్రాస్తాడు. అలాగే కవి కూడా తన కల్పనాశక్తిని రంగరించి సత్కావ్యాలను వ్రాస్తాడు కావున కవి బ్రహ్మ దేవునితో సమానము). ఆలోచిస్తే కవియే ముల్లోకపాలకుడు, త్రిశూలధారి అయిన పరమేశ్వరుడు కూడా(లయకారకుడైన పరమేశ్వరుడు ఈ జగన్నాటకములో మనలను ఆడించి నడిపిస్తాడు. కవి కూడా తన కావ్యాలలోని పాత్రలను ఆడించి ముందుకు నడిపిస్తాడు కావున కవి

పరమేశ్వరునితో సమానము) అంతటి గొప్పవైన కవులచేత రచింపబడిన పుస్తకాలను గ్రహించి, కవులను ఆదరించి సంతోషపడేవారు అల్పలా? అలాంటి కవులు పూజలందుటకు, దానపాత్రులగుటకు అర్హులు కారా? యాచకులు, సన్యాసులూ అయినంత మాత్రాన కవులు కవులు కాకుండాపోతారా? నిష్ప్రయోజకులవుతారా? ఇది వినడానికి ఎంత విచిత్రంగా ఉంది!

అందుకు వాసుదేవబట్టారకుడు ఏదోవిధంగా భీమకవిని ఓడించాలని "ఓ భీమన్న కవీ! నీవు నిజముగా మహాకపీశ్వరుడవు. మీ కవిత్వం విన్న తర్వాత నేను కూడా ఇంత సులభంగా పద్యము చెప్పగలిగాను" అన్నాడు. భీమకవి "ఇదేమిటి వ్యాకరణవేత్తలకు 'పీ'కీ 'వీ'కీ బేధము తెలియలేదు" అన్నారు. వాసుదేవుడు "కొంచెము శబ్దశాస్త్రవిషయమును నీతో మాట్లాడాలని ఇలా అన్నాను. "పవయోరభేదః" అనే వ్యాకరణ సూత్రము ప్రకారం 'వ' బదులు 'ప', "ప" బదులు "వ" పలికినా తప్పలేదు. అందువలన ఇలా అన్నాను" అని చెప్పాడు. భీమకవి " అయ్యో పాసుదేవభట్టూ! నాకాసూత్రము సమయానికి గుర్తుకురాక మిమ్మల్ని తప్పబట్టాను." అన్నారు. భీమకవి తనను పాసుదేవభట్టారకుడని అని పిలిచేసరికి కోపంగా "ఎందుకలా పిలిచారని అడిగాడు" ప్రశ్నించాడు. భీమకవి "ఇప్పుడే కదా వాసుదేవా! "పవయోరభేదః" అను సూత్రమును అనుసరించి 'ప' బదులు 'వ' పలికిననూ తప్పు కాదని అందుకే పాసుదేవా అని పిలిచాను" అని సమాధానమిచ్చే సరికి వాసుదేవబట్టారకుని నోటమాట రాలేదు. తన సూత్రం తనకే అల్లేసే సరికి భీమకవితో వాదించడం వల్ల పరువు పోవడం తప్ప, తనకి వచ్చేదేమీ లేదని గ్రహించి సభలో గమ్మున ఉండిపోయాడు. ఇలా అసమాన ప్రతిభాశక్తిసంపన్నుడై, సమస్తశాస్త్రాలు తెలిసవాడైన భీమకవికి ఎక్కడా, ఎందునా తిరుగులేకుండెను.

## నారాయణ భట్టు

భీమకవి గొప్ప గురువు కూడా. ఈయన వద్ద శిష్యునివలె మెలిగి తెలుగులో కవిత్వము చెప్పడం నేర్చుకునేవారు. అలాంటి వారిలో నారాయణభట్టు ముఖ్యుడు. ఇతను భీమకవితో శిష్యరికం చేసి, తెలుగులో కవిత్వం చెప్పడం అలవరచుకున్నాడు. ఇతడు తెలుగు, సంస్కృతం, కన్నడ మూడుభాషలలోనూ సమాన పాండిత్యమును సంపాదించాడు. భీమకవి పట్ల ఇతడు గురుభక్తియుక్తుడై వినయవిధేయతలతో మేలిగే వాడు.

# నల్లసిద్ధి భూపాలుడు

భీమకవిని అత్యంత పూజించి ఆయన కరుణ పొందినవారిలో నల్లసిద్ధిభూపాలుడొకడు. మొదట ఈ రాజు దర్శనము కోసం వచ్చినపుడు, అక్కడి విద్వాంసుడైన కాలనాథభట్టు అంత త్వరగా కలవనివ్వలేదు. భీమకవి కొంతకాలము ఓపికపట్టి వేచి చూసాడు. ఆ తర్వాత ఒక రోజు కాలనాథభట్టుతో "నల్లసిద్ధిభూపాలుని వద్దకు తీసుకెళ్ళేదవా? లేదా నా పద్ధతిలో వెళ్ళమంటావా?" అని ఆగ్రహముతో అడిగే సరికి, అతడు "సమస్త శక్తులూ కలిగిన మీకు నేను రాజదర్శనము చేయించవలెనా? మీ సామర్థ్యము మరచి నన్ను అడుగుతున్నారే కానీ, మీవు నేరుగా లోనికి వెళ్ళినా నీకు అడ్డుచెప్పగల వారున్నారా? మీకు ఎందులోనైనా ఎదురుందా?" అని వినయంగా సమాధానమిచ్చాడు. భీమకవికి "నిజమే. అలా వెళ్ళినా, ఒకవేళ మమ్మల్ని ఎవరైనా అడ్డగించే ప్రయత్నము చేస్తే, మా సామర్థ్యాన్ని చూపించి బాధ పెట్టవలసి వస్తుంది. అది మాకు ఇష్టముండదు. మాకు అడ్డుతగలకుండా ఊరికే ఉంటారని అనుకున్నా, మా శక్తిసంకల్పాలు తిరుగులేనివని తెలుసుకోవడానికి వారి వివేకము చాలదు. అందువలన వారు మూర్ఖులై అడ్డువస్తారు. అలాంటి వారుని కూడా ఇబ్బంది పెట్టకూడదని, మేమే నలుగురితో పాటి ఈమార్గమునే అవలంభించాము" అని చెప్పారు. భీమకవి మాటలకు సంతోషించి రాజు వద్దకు తీసుకెళ్ళడు. నల్లసిద్ధిభూపాలుడి ఆస్థానమున భీమకవి దాదాపు ఒక సంవత్సరకాలమున్నారు. నల్లసిద్ధిభూపాలుడు కూడా భీమకవికి ఏలోటు రానీయకుండా అత్యంత భక్తి శ్రద్ధలతో చూసుకున్నాడు.

ఒకనాడు వీరిరువురూ ఊరు దాటి ఒక ఆడవి వైపుకు వెళ్ళారు. ఒక ప్రశాంతమైన ఉద్యానవన ప్రదేశాన్ని చేరారు. అక్కడ పరిమలభరితమై వీస్తున్న చల్లని గాలితో ఎంతో ప్రశాంతంగా ఉంది. భూపాలుడు భీమకవిని చూసి "మహాశయా! ఇట్టి సమయము కవిత్వను చెప్పటకు చాలా అనువుగా ఉంటుంది కదా?" అని ప్రశ్నించగా, అందుకు భీమకవి "రాజా! కవిత్వమున కెప్పడూ ఇటువంటి ప్రశాంతతే కావాలి. ఇప్పడేదయినా కావ్యమును వ్రాయ మంటావా?" అని అడిగారు. " మీరు కావ్యమును రచిస్తే నేను విని తరించడానికి సిద్ధముగా ఉన్నాను" అని భూపాలుడు తన సంసిద్ధత తెలిపాడు. అందుకోసం శ్రీరాముని చరితమైన "శతకంఠ రామాయణము" అనే చక్కని ప్రబంధమును రచించి రాజుగారికి వినిపించారు. శతకంఠ రామాయణము నుంచి సంగ్రహించిన ఒక పద్యము.

ఉ     వారక వారకామినుల వర్తులచారుకుచోపగూహముల్
కోరక కోరకోల్ల సితకుంజములఁ జిగురాకు పానుపుల్
చేరక చారుకేరళ కళింగ కుళింగ నరేంద్ర మందిర
ద్వార విహారులై సిరులనందక నందకపాణి కొల్వరే

భావము: ఎన్నటికీ స్త్రీ సౌక్యమును కానీ, సుఖమైన, విలాసవంతమైన జీవితమును కానీ కోరుకోకుండా, రాజ ఆస్థానములను చేరి సిరిసంపదలను ఆశింపక, ఎల్లవేళలా నందకపాణి అయిన శ్రీరామున్ని కొలవండి.

ఒకప్పుడు నల్లసిద్ధిభూపాలుడి సామంతరాజైన రాజరాజు స్వతంత్రుడు కాదలచి కప్పమును చెల్లించకుండా యుద్ధానికి సిద్ధమయ్యాడు. ఆ యుద్ధాన నల్లసిద్ధిభూపాలుడికే విజయము సిద్ధించింది. రాజరాజు నుంచి యుద్ధానికి అయిన వ్యయానికి గాను 40 లక్షల గద్యాణములను తీసుకొని తరిమితరిమి కొట్టాడు. భీమకవి రాజరాజును తరిమికొట్టాడన్న విషయాన్ని విచిత్రంగా ఈ క్రింది పద్యములో చెప్పారు.

ఉ    వాండిమి నల్లసిద్ధి జన వల్లభుడోర్చిన రాజు భీతుడై
యాంధ్రన గానకుండ వృషభాంకముఁ బెట్టుకొనంగఁ జూచితో
నేండిది యేమినీవనుచు నెచ్చెలులెల్లహసింప నంతలో
మూండవ కంటితోడి దొరమూర్తి వహించిన మ్రొక్కిరంగనల్

భావము: వాండిమి నల్లసిద్ధిభూపాలుడు ఓడించిన రాజరాజు, భయకంపితుడై, ఎవ్వరికీ కానరాకుండా వృషభాంకమును(మొఖము కనపడకుండా) ధరిస్తుండడం చూసిన అతని నెచ్చెలులు "ఏమిటిది? ఏమిటి నీవు ఇలా?" అని పరిహసించగా, అంతలో కోపంతో రాజరాజు తన మోఖమును చూపగానే ఆ నెచ్చెలులంతా భయపడి నమస్కరించారు.

# చోడగంగు

నన్నెచోడగంగు చోళదేవుని పినతండ్రి కొడుకు. చోళదేవుడు కావేరీనది తీరన ఒక గ్రామాన్ని రాజధానిగా చేసుకొని పాలించేవాడు. నన్నెచోడగంగు చోళదేవుని వద్ద మంత్రిగా, దండినాథునిగా పనిచేస్తూ అతనికి కుడిభుజముమై మెలిగేవాడు. నన్నెచోడగంగు కార్యదీక్ష, రాజభక్తి, పరాక్రమములకు మెచ్చి అతనికి చోళదేవుడు తిరుచినాపల్లెను ఇచ్చి అక్కడ ఒక కోటను కట్టించాడు. ఇంకా ఈ ఇరువురూ కూడా మంచి కవిత్వము చెప్పగలిగేవారు. భీమకవి ఒకనాడు చోడగంగును దర్శించి అతని పరాక్రమమును చూసి, మెచ్చుకుంటూ ఈ పద్యములని చెప్పారు.

చ    అని మొన జోడగంగుడు మురారి బకారినరుండు మాద్రిజుం
డన ఘన చక్రతోమర శరాసనకుంతము లల్కఁబూని ప్రే
యను వడిడాయనేయఁ బొడువన్ గళమస్తరవత్సమర్మముల్
తునియవె? నుగ్గుఁగావె? యెదదూరవె? నాటవె? వైరివీరులన్

భావము: చోడగంగు యుద్ధవ్యూహంలో శ్రీకృష్ణుడు, విలువిద్యలో అర్జునుడివలె భయంకరమైనవాడు, ధీటైన గొప్ప ఆయుధాలు గల శరాసనకుంతము(ఒరలాగా బాణములుంచే చోటు) కోపము వహించి, బాణము వదిలిన ఆ వేగానికే(శౌర్యానికి) దుర్జనులు తల, కుత్తుక, అణువణువు ఖండింపబడవా? నుసికావా? శత్రువుల గుండెల్లో దూరిపోవా? గుచ్చుకుపోవా?

భోజుడు మంకు; ధర్మజుడు బొంకు; శచీపతి రంకు; కల్పపూ
రాజుకళంకు; దైవధరాజము డొంకు; పయోధి యింకు; నర
భోజభవుండు పంకు; ఫణిభూషణ దేవుడు సంకు; పద్మినీ
రాజ హితుండు క్రుంకు; సరిరారు గుణంబుల నీకు ధారుణిన్

భావము: పరాక్రమవంతుడైన భోజరాజు మొండి పట్టుదల కలవాడు కావున నిను పోల్చుటకు అతడు సరిరాడని, ధర్మరాజు కురుక్షేత్రసంగ్రామమున “అశ్వర్థామ హతః కుంజరః” అని అసత్యమాడి ధర్మము తప్పిన వాడగుటచే ధర్మరాజు కూడా నిను పోల్చుటకు తగడని, శచీపతి ఇంద్రుడు అహల్యాజారుడగుటచే నీకు సరిరాడని, కలువలరాజు అయిన చంద్రుడు కళంకము(మచ్చ) కలవాడు కావున అందమందు నీకు సాటిరాడని, మేరుపర్వతుడు క్రుంగి ఉండుటచే ధైర్యమున నీకు సరిరాడని. సముద్రపునీటికి ఇంకిపోయే గుణం కలిగినది కావున గంభీరమున నీకు సాటి రాడని, బ్రహ్మదేవుడికి బంకించే గుణము ఉండుటచేత విద్యలో నీకు తీసికట్ట అని, శంకరుడు బికిరమడుగు కొనుటచే ఇవ్వడమే కానీ యాచించడమేరుగని నిన్ను పరమేశునితో పోల్చలేనని, సూర్యుడు అస్తమించే గుణము కలిగిన వాడగుటచే తేజము నందు పోల్చడానికి సరిరాడని. గుణములందు ఈ భువిలో ఎవ్వరూ నీకు(చోడగంగుకు) సరిరారు. (అనగా చోడగంగు గుణములందు పరిపూర్ణుడు. ఏ లోపం లేని వాడు అని అర్థము.

ఈ పద్యములను స్వయంగా విని రసభావములు బాగా తెలిసినవాడు, కవిత్వము చెప్పగలవాడు అయిన చోడగంగు, భీమకవికి వేయినూటపదహారు గద్యాణములిచ్చి సత్కరించి, కనకాభిషేకము చేశాడు.

# నన్నెచోళదేవుడు

భీమకవి నన్నెచోళదేవుడు రచించిన కుమార సంభవమును తిలకించి అతని గురించి ఈ క్రింది పద్యములను చెప్పారు.

| | |
|---|---|
| చ | రవికుల శేఖరుడు; కవిరాజశిఖామణి; కావ్యకర్త; స |
| | త్కవి; భువినన్నుచోడుఁడటె! కావ్యము దివ్యకథఁగుమార సం |
| | భవమటె! సత్కథాధిపతిభవ్యుడు జంగమమల్లికారు నుం |
| | డవిచలితార్థయోగధరుఁడటె! వినంగొనియాడఁజాలదే |
| క | కలుపొన్నవిరులు పెరుగన్ |
| | గలుకోడిరవంబు దిశలఁగలయఁగఁజెలఁగఁ |
| | బొలుచునొరయూరికధిపతి |
| | యలఘుపరాక్రముడు టెంకణాదిత్యుడిలన్ |
| సీ | కుతలంబునిడుకొనఁ గొలకొండగానిల్పి |
| | శిరనిధిఁజొచ్చిరి నగరసుతులు |
| | మిన్నులపైఁబాఋచున్న యేరిలదెచ్చి |
| | వారాశినించె భగీరధుండు |
| | గోత్రాచలములెత్తికొని వచ్చి కడచన్న |
| | రత్నాకరముఁగట్టె రాఘవుండు |
| | జలధిమహీనతి మొలమాలుగాఁ జుట్టి |
| | పాలించెగరిగరికాలజోడు |
| | వరుసనిట్లు సూర్యవంశాధిపతులందు |
| | నిధియ మేరగాగ నిఖిలజగము |
| | నేలిచనిన వారికెనవచ్చు సుశ్లాఘు |
| | ధనుడు నన్నెచోళ జనవిభుండు |

తాను వ్రాసిన కుమారసంభవము భీమకవిచే ప్రశంసలందుకోవడం చూడగానే, నన్నెచోళదేవుడు మహదానందుడై భీమకవికి కనకాభిషేకము చేసి విస్తారముగా డబ్బునిచ్చి సత్కరించెను. భీమకవి ఇలా రాజుల నుంచి గ్రహించిన బహుమతులను, ద్రవ్యమును లోకకళ్యాణార్థము యజ్ఞయాగాది క్రతువులను జరిపించుటకు, పేదలకు దానం చేయుటకు వినియోగించేవారు.

# రాయనమంత్రి భాస్కరుడు

భీమకవి ఒకనాడు రాయనమంత్రి భాస్కరుని ఇంటికి వెళ్ళారు. చరిత్రలో ఎంతో మంది రాయనమంత్రి భాస్కరుని పేరు కలవాళ్లు ఉన్నారు, కానీ ఈ భాస్కరుడు భీమకవి కాలంనాటి భాస్కరుడు. ఇతను తిక్కన సోమయాజికి తాత. భీమకవి బంధువులలో ఒకడు. ఇతను రాజేంద్రచోడునికి మంత్రిగాను, దండినాధునిగాను పనిచేసేవాడు. భీమకవి రాయనమంత్రి భాస్కరుని ఇంటికి వెళ్ళినపుడు తనకు ఒక గుర్రమును ఇవ్వమని అడిగారు. అయితే రాయనమంత్రి ఆలోచనలోపడి ఎంతసేపటికీ తన అంగీకారము తెలుపలేదు.

అపుడు భీమకవి

క వగమాన్ప యర్థికియ్యని

మగముండకు మీసమేల మఱి మూతిపయి

దెగఁ గొఱుగడాయె మంగలి

రగడందునఁ గీర్తిదోచ రాయని బాచా!

భావం: సంఘంలో ఎంతో పేరు మోసిన ఓ రాయనబాచా! సహాయం కోరివచ్చిన వాడి కష్టాన్ని తీర్చని మగవాడు విధవతో సమానం. అటువంటి వాడికి మరి మూతిపయిన మీసము దేనికి? మీకు మంగలి సరిగా గొరుగుతున్నట్లు లేదు.

అని చెప్పగానే భాస్కరుడు "నువ్వు చెప్పినది సత్యమే. కానీ నేను నీకు ఎటువంటి గుర్రాన్నిస్తే బాగుంటుందా అని ఆలోచనలోపడి ఇంత వరకూ కాలయాపన చేసినందుకు నేను మీసము గొరిగించుకోవాల్సిందే" అని చెబుతూ భీమకవిని తన అశ్వశాలకు తీసుకువెళ్ళాడు. తన వద్ద ఉన్న అన్ని అశ్వాలను చూపించి, వీటిలో ఏది కావాలో, ఎన్ని కావాలో తీసుకొమ్మని చెప్పాడు. భీమకవి ఒక గుర్రమే చాలని, కవిరాక్షసునికి అనుకూలముగా ఉండునని నల్లగుర్రమును తీసుకున్నారు. తరువాత అతను భీమకవిని తన ఇంటికి తీసుకువెళ్ళి విందు భోజనం పెట్టి విశేష ద్రవ్యమునిచ్చాడు. గోదానము మంచిదని తన వద్ద ఉన్న మంచి మంచి పాడియావులను నూరింటిని భీమకవికి బహుమతిగా ఇవ్వబోగా, ఇన్నిటిని తానేమి చేసుకోనని భీమకవి రెండు ఆవులను తీసుకున్నారు. ఇంకా ఏమైనా కావాలా నాయనా? అని భాస్కరుడు అడగగా భీమకవి

క చేకొని రాయన బాచడు

కాకాలు గుణించు పిన్నకాలము నాడే

లా కేత్వమియ్యఁజాలడు

దాకునుగొమ్మియ్యఁ డిట్టిధన్యులు గలరే?

భావము: రాయన బాచడు చిన్నవయస్సులో కాకాలు (అక్షరాలు) దిద్దేనాడే 'లా' కు ఏత్వమును (అంటే లే అన్న అక్షరమును) దిద్దలేదు. 'దా' అనే అక్షరానికి కొమ్మునూ (అంటే దు అన్న అక్షరము) దిద్దలేదు. ఇటువంటి ధన్యులు

ఉన్నారా? అంటే "లేదు" అను మాటను తన చిన్న కాలమునాడు అక్షరాలలో దిద్దనేలేదు. ఏనాడు అప్రయత్నంగా కూడా తననోటి నుంచి లేదు అన్న మాట రాదు. ఆ మాటను ఊహ తెలియని వయసునుంచే దూరం పెట్టాడు, అంత దాన గుణము కలవాడని అర్థము.

క ఏవ్రాలైననువ్రాయును

నావ్రాయడు వ్రాసెనేని నవ్వుచునైనన్

సీ వ్రాసి తావడియ్యడు

భావజ్ఞుడురాయనార్య భాస్కరుడెలమిన్

భావము: ఏ "వ్రా" లైనా వ్రాస్తాడు, కానీ పరిహాసముకు కూడా "నా" వ్రాయడు అంటే "నావి" అన్న స్వార్థము లేని వాడు అని అర్థము. సీ వ్రాసి "తా"కు వత్తు ఇయ్యడు. అంటే "వ్రాసి"స్తాడేకానీ, "వ్రాస్తిని" అని "ఇస్తిని" అను అహంభావము లేని వాడు అని అర్థము. ఈ జగతిలో ఎంతో దానగుణం కలిగిన వాడు మన రాయన భాస్కరుడు.

భీమకవి రాయనభాస్కరుడు చేసిన దానధర్మాలను తెలుపుతూ, అతనిని పొగుడుతూ చాలా పద్యాలను రచించారు. (ఈ పుస్తకం చివరి భాగాన ఇవ్వబడ్డాయి). రాయనభాస్కరుడు తాను చేసిన సత్కార్యాలు నుంచి, ఎటువంటి కీర్తిని ఆశించని వాడని భీమకవి ఈ క్రింది పద్యములో చెప్పారు.

ఉ ఒక్కడు మంసమిచ్చె మఱియొక్కడు చర్మముఁగోసియిచ్చెవే

ఁడొక్కరుడస్తినిచ్చె నిఁకనొక్కడు ప్రాణములిచ్చె వీరిలో

నొక్కొక పట్టునన్ బ్రదుకనోపకయిచ్చిరో? కీర్తికిచ్చిరో

చక్కఁగఁజూడు మంత్రికులసంభవ! రాయనమంత్రి భాస్కరా!

భావము: ఒకరు(శిబి చక్రవర్తి) తన మాంసమునే దానముగా ఇచ్చారు. మరొకరు తన చర్మము కోసి దానముగా చేసారు. వేరొకరు(దధీచి) తన అస్తిక(వెన్నెముక)నే దానముగా ఇచ్చారు. ఇంకోరు తన ప్రాణములనే(బలి చక్రవర్తి) దానముగా ఇచ్చారు. వీరిలో ఒక్కొక్క సందర్భంలో బ్రతుక ఇష్టం లేక ఇచ్చారో? లేదా కీర్తి కోసము ఇచ్చారో? ఆలోచించు మంత్రికులమున పుట్టిన రాయనమంత్రి భాస్కరా! (రాయనభాస్కరుడు అటువంటి కీర్తి ఆశించడనీ, పై చెప్పిన వారితో సరిసమానుడని భావము)

ఈ రాయన భాస్కరుడు మహాదాత అని చాలా మంది చెప్పేవారు. ఇతను వయసులో భీమకవి కన్నా పెద్దవాడు. భీమకవికి తల్లి తరపు బంధువు.

ఈ రాయనభాస్కడి మంత్రి కుమారుడు కొండనామాత్యుడు. ఇతను కూడా భీమకవి పట్ల ఎంతో భక్తిప్రపత్తులతో మెలిగేవాడు. ఇతను కూడా తన తండ్రిలాగా దానగుణసంపన్నుడు. ఇతని మీద భీమకవి చెప్పిన అద్భుత చాటువులు.

శా	కాండావిర్భవ భాండభూపరి వృఢగ్రైవేయ శైలేయసూ
కాండా టాధిప కేతుమాతుల బలాకాశ స్రవంతీ మరు
త్కాండా ఖండలతుండి పాండురయశః కర్పూర పేటీభవ
త్కాండా! రాయనమంత్రి భాస్కరుని కొండా! దండనాధాగ్రణీ!

శా	రెండానాల్కలు సాంప్రదాయకునికిన్ లెక్కింపగా నొక్కటే
గండాగొండి శిఖండిబండనికి లెక్కల్లేని నాల్కల్ కదా
చండా రాతికులాట వీదహన తేజస్ఫార ధాటీల స
త్కాండా! రాయనమంత్రి భాస్కరుని కొండా! దండనాధాగ్రణీ

క	పద్యము చెప్పిన సుకవికి
హృద్యముగా నొసఁగనట్టి హీనాత్మునియా
పద్యము పామైకఱచును
ప్రద్యోదిత కీర్తికాండా! భాస్కరుకొండా!

ఆవె	పడుచునిడిన వానిఁ బద్యమిచ్చిన వానిఁ
గడువుకిడినవాని నడుపవలయు
నడుపలేనివాని నయవిదులెంతురా
భువిని భాస్కరేంద్ర పుత్ర! కొండా!

# భేతాళ భట్టు

కేరళదేశానికి చెందిన భేతాళభట్టు అనే ఒక మాయగాడు ప్రజల మూఢనమ్మకాలను ఆసరాగా చేసుకోని డబ్బు సంపాదించేవాడు. అలా ఊరూరా తిరుగుతూ ద్రాక్షారామము, వేములవాడ ప్రాంతాలకు వచ్చాడు. ఇతడు సంసారుల ఇండ్లలో పోయిన పదార్థాలను తెప్పించుట, సంజనమువేసి శకునము చెప్పుట, పిశాచములను వదిలించుట, పద్మము వేసి ఇతరులచే చేయబడిన ప్రయోగములను మాన్పించుట, మొదలయిన భూతవైద్యమంత్రాలు తెలిసినవాడని చెప్పుకుంటూ ప్రజలను మోసంచేసేవాడు. హస్తలాఘవవిద్యలో(కనపడకుండా చేతి కదలికలతో మాయాజాలము చేయుట) ఆరితేరినవాడు.

భీమకవికి ద్రాక్షారామములో విఠలదేవుడను పినతండ్రి కుమారుడొకడుండేవాడు. ఇతను తరచూ అనారోగ్యం పాలయ్యేవాడు. ఇతని తల్లిదండ్రులు భీమకవిని ఆశ్రయించకుండా, మూర్ఖత్వముతో భూతవైద్యులను సంప్రదించేవారు. వాళ్ళు పిశాచము పట్టిందని. దయ్యము, పట్టిందని చెప్పి, వాళ్ళను మరీ కృంగదీసేవారు. ఒకే కుమరుడవ్వడం వలన ఇతనిని ఎక్కడకీ పంపక, విద్యాబుద్ధులు కూడా చెప్పించక ప్రాపంచికజ్ఞానశూన్యుడను చేసారు. విధివశము వలన ఒకసారి పూర్తి జ్వరం వచ్చి కదలేకపడిపోయాడు. అతని దేహమంతా విపరీతమైన నొప్పులు ఆవహించాయి. అప్పటికే భేతాళభట్టు వేములవాడ భీమకవి ఏమన్నా అది జరుగుతుందని, అనారోగ్యంతో కష్టాల్లో ఉన్నవారు భీమకవిని ఆశ్రయిస్తారని, ఆ నోటా ఈ నోటా విన్నాడు, కానీ భీమకవిని ఎన్నడూ చూడలేదు. భీమకవికి ఇక్కడ ప్రాబల్యము తగ్గితే తనకు డబ్బు గడించడం తేలికవుతుందని, ఈ ప్రాంతంలో ఎవరింట భూతవైద్యానికి ఒప్పుకున్నా అది వేములవాడ భీమకవి చేసిన ప్రయోగము వలన సోకినదని చెప్పేవాడు. విఠలదేవుడను వాడికి అనారోగ్యము కలిగిందని విని, అతని ఇంటి వైపుకు వెళ్ళి "పిశాచాలను వదిలిస్తాను" అని గట్టిగా అరవసాగాడు. అది విన్న ఆ కుటుంబము అతనిని ఆశ్రయించింది. ఆ భూతవైద్యుడు వారి ఇంటచేరి పద్మమేసి, జపము చేయుటకై కుర్చున్నాడు. ఆ పద్మమునకు నాలుగు వైపులా దీపములుంచాడు. కనులు మూసి జపము చేస్తున్నట్లు నటించి తన చంకలో దాచుకున్న వికృతాకారము గల ఒక బొమ్మను తన హస్తలాఘవముచే బయటకుతీసి ఆ పద్మములో ఎవ్వరికీ కనపడకుండా నిలబెట్టి "ఆ వచ్చితివా? నీవెవ్వరవు ఎందుకు విఠలదేవుడను సోకితివి?" అని ప్రశ్నలడిగి, సమాధానమును కూడా తానే మారుకంఠంతో పిశాచముపలికిన విధంగా "నేను పిశాచమును. వేములవాడ భీమకవి ప్రయోగమంత్రము వలన వచ్చి సోకాను" అని పలికాడు వీరు భీమకవి బంధువులని తెలియక. అది విన్నవారందరూ భీమకవి ప్రయోగము చేశాడా అని వణికిపోయారు.

భేతాళభట్టునకు మహామంత్రాలేమీ రాకున్నాతనకు తెలిసిన ఒకే మంత్రాన్ని పదేపదే ఉచ్చరిస్తూ, హస్తలాఘవవిద్యతో చేతులూపుతూ ఆదే బొమ్మను తిరిగి తన చేతులతో మాయం చేసి పిశాచము వదిలిందని చెప్పి వారి నుండి ధనమును గ్రహించి ఇంకో వీధికి వెళ్ళిపోయాడు. ఒకతల్లిపిల్లలకు ఇంత వైరమా! భీమకవిలాంటి మహానుభావుడు ఇలా చేయునా? ఆయనే ఇలా చేస్తే ఈ లోకములో సన్మార్గులెవ్వరుంటారు? అని నలుగురూ

అనుకుంటుండగా భీమేశ్వరవరప్రసాది అయిన భీమకవి దైవయోగము వలన ఆనాటి సాయంత్రానికే ద్రాక్షారామము చేరారు. జరిగిన విషయం విని భీమకవి మిగుల ఆశ్చర్యపడి భేతాళుడి వద్దకు వెళ్ళి "నేను నా పినతల్లి కుమారుని మీద ప్రయోగమొనరించానని చెప్పావట కదా? ఏది నా ఎదుట పద్యము వేసి పిశచమును ఒకసారి రప్పించుము" అని అడిగాడు. అతను భీమకవి తనను ఎటుల ఒనర్చునోనని భయపడి, ఒక్క నిమిషము ఇప్పడే వచ్చెదనని లోపలికి వెళ్లి, దొడ్డి దారిలో పారిపోయాడు. భీమకవి విఠలదేవుడిని పరీక్షించి " ఈ భూతవైద్యుడి హడావిడికి భయపడ్డం వలన జ్వరము ఇంకా ఎక్కువయ్యింది" అని చెప్పి, వైద్యశాస్త్రములో కూడా భీమకవికి హస్తమున్నందున తన నోటి మాటకు పని చెప్పకుండా ఒక ఔషదమిప్పించి అతని రోగమును మరుసటిరోజుకంతా మటుమాయము చేసారు. ఆ తరువాత అక్కడి వారితో "అనారోగ్యం కలిగినపుడు వైద్యుడిని ఆశ్రయించాలి లేదా భగవంతున్ని నిష్కల్మషమైన మనసుతో వేడుకోవలెను కానీ, ఇలా కల్లబొల్లి కబుర్లు చెప్పే భూతవైదులను సంప్రదించి, వారి తప్పడు మాటలను నమ్మవద్దని, ఒకవేళ నేను ఈసమయానికి ఇక్కడకు రాకపోయుంటే మీ మూర్ఖత్వము వలన నేను నింద మోయాల్సివచ్చేదని చెబుతూ ఈ పద్యాలను రచించారు.

ఉ  పాడమి మంత్రముల్చదివి భూతములన్ వదలింతుమంచు నా
డాడను మోసగాండ్రు మృషలాడి ధనంబు గడింపజూతు రీ
పాడుగుణంపు మానిసులఁ బాపుల చెంతకుఁ జేరనీక పం
డ్లూడగ దౌడ వ్రేసినను నొందరు పాపమొకింతయేనియున్

భావము: లేని మంత్రములను సృష్టించి చదివి భూతములను వదిలిస్తానంటూ వచ్చి మోసగాళ్ళు, అబద్ధాలు చెప్పి డబ్బు సంపాదిస్తారు. ఈ పాడు గుణమును కలిగిన మనుషులను,పాపులను దగ్గరకు చేరనీకుండా పండ్లూడబీకి దౌడ వేసినా ఒక్కింత కూడా పాపము కలుగదు.

ఉ  చచ్చినవాడు భూతమయి శాతకఠోరకుఠార వేదనో
పచ్చలితప్రతీవ్రగతి బాధలఁ బెట్టునటంచుఁ బామరుల్
పిచ్చితలంపులన్ దవిలి భీతిలుచుండెదరీ ధరాస్థలిఁ
జచ్చినవాని కెక్కడిదిశక్తి? వివేకము నందుడీజనుల్

భావము: ఈ లోకంలో మూర్ఖులు, మరణించిన వాడు భూతముగా మారి, పగబట్టి తీవ్రంగా బాధలు పెడుతున్నాడట అంటూ పిచ్చి ఆలోచనలతో, కొద్దిగా భయపడుతారు కానీ చచ్చిన వాడికి అంతటి శక్తి ఎక్కడి నుంచి వస్తుంది? జనాలు వివేకము పొందరే?

మ  కవిమాన్యుండు శపించెనేని యదియే గాఢప్రయోగంబుగా
భువి నెవ్వారిని నాశనంబు సలుపుఁ బుణ్యాత్ములౌ సజ్జనుల్
కవిసత్కార మొనర్చి సంపదలు భోగంబుల్ సౌఖ్యసంతానముల్
దవులన్ బొందుట దక్షవాటిక విరాట్తత్వంబై చాటించెడున్

భావము: ఈ కవిమాన్యుడు శపించాడంటే, అది ఎవరినైనా తీవ్రప్రయోగముమై నాశనము చేస్తుందని(అంటారు). సజ్జనులు నను సత్కరించి, ఆరాధించి పుణ్యాత్ములవుతారు. సంపదలు, సుఖసంతోషాలు, సంతానాలకు అర్హులౌతూ పొందడము నాలోని ద్రాక్షారామ భీమేశ్వరుని గుణాన్ని చాటిచెప్తాయి.

చ అని మొనఁ గూలిపోమఱల నాయువొసంగితిఁ దిక్కమంత్రికిఁ

గనికరమొప్ప సంపదల గంగునికిచ్చితిఁ దొల్లి కోపముఁ

బెనఁగొని పోతరక్కసునిఁ బెట్టితి శాపముఁ జచ్చునట్లుగా

ఘనుడను వేములవాడ కవికాంతుఁడ భీమవరప్రసాదుడన్

భావము: ఘనుడను, వేములవాడన భాసిల్లే కవీశ్వరుడను, భీమేశ్వరవరప్రసాదుడనైన నేను యుద్ధములో చనిపోయిన తిక్కనమంత్రిని మరలా బ్రతికించి ఆయువును ప్రసాదించాను. కళింగ గంగుపై తొలుత కోపించినా, తర్వాత కరుణ కురిపించి, అతనికి సంపదలను ఇచ్చాను. పోతురాక్షసున్ని మరణించే విధంగా శపించాను.

ఉ మానుగబంధుకోటి నభిమానమునఁ దిలకింతుంగాని లో

నూనిన కోపావేశమున నొప్పి శపింపగ విఠ్ఠలయ్యకున్

బూని ప్రయోగమున్ సలుపఁబూనితినం చపనిందఁజెందగా

లేనని సప్రమాణముగ లేఖినిముట్టి వచింతు మాటికిన్

భావము: విఠ్ఠలయ్యను ఆవహించేలా మంత్రప్రయోగము చేయబోయానంటూ అపనింద కలుగగా, బంధుకోటి నిజమైన అభిమానమును చూస్తానే కానీ, మనసులో కోపావేశాలను దాచుకొని, నొచ్చుకొని తిట్టలేదనీ, ప్రమాణపూర్వకముగా వ్రాసే కలమును తాకి మరలా మరలా చెబుతున్నాను.

# మేడమార్యుడు

మేడమార్యుడు కులోత్తుంగదేవుడి కుమారుడగు వీరచోడదేవుడి వద్ద సైన్యాధిపతిగా ఉండెను. ఇతనికి వేములవాడ భీమకవి స్వయంగా "రాజ రాజ బ్రహ్మ మహా రాజ" అని బిరుదు ఇచ్చారు. ఇతను వేదవేదాంగవేదియైన ఉత్తమద్విజుడు. ధనుర్వేదమును కూడా అభ్యసించాడు. భుజబలపరాక్రముడు. రాజనీతివేత్త కూడా. అందుకే వీరచోడదేవుడితనిని తన సైన్యాధిపతిగా నియమించాడు. ఇతను కూడా ఆ కాలమున ఏయుద్ధానికి వెళ్ళాల్సివచ్చినా, భీమకవి వద్దకు వచ్చి, ఆయన ఆశీర్వాదమును తీసుకొని వెళ్ళేవాడు. అందువలన ఈతను ఏ యుద్ధానికేగిననూ విజయమే తప్ప పరాజయము కలుగలేదు. వెళ్ళిన ప్రతి యుద్ధములో విజయముతో తిరిగిరావడం వల్ల వీరచోడదేవుడిని మేడమర్యుడు ఎంతో అభిమానించేవాడు. వీరచోడదేవుడు, మేడమర్యుని "రాజ రాజ బ్రహ్మ మహా రాజ" అనే పిలిచేవాడు. తను కూడా " నాకీ బిరుదు భీమకవి ఇచ్చినదని" గొప్పగా చెప్పుకొనేవాడు. ఇతడు భీమకవిని ఎంతో భక్తి విశ్వాసాలతో సేవించాడు. భీమకవి వద్ద ధర్మోపదేశం ప్రకారం, తన బంధువులపట్ల ఎంతో గౌరవాభిమానాలు చూపుతూ, పేదవారయిన సన్మార్గులకు దానధర్మాలను చేస్తూ, తన జీవితమంతా భీమకవి సేవకే వదిలివేసాడు. అంతేకాక పిఠాపురము, ద్రాక్షారామాల్లో భీమకవి పేరిట సత్రములను కూడా కట్టించాడు. అక్కడ నిత్యాన్నదానములను చేయించాడు. చెల్లూరులో వైష్ణవాలయమును కట్టించి, ఒక కోనేరును త్రవ్వించి కర్తృత్వమును భీమకవి ఇచ్చివేసాడు.

# భీమకవి మహాకావ్యాలు

**కవిజనాశ్రయం(భీమన ఛందస్సు):**

భీమకవి పద్య నియమాలను తెలుతూ వర్తమానకవుల కోసం కవిజనాశ్రయం లేదా భీమన ఛందస్సు అను పేరిట ఒక ఛందశ్శాస్త్ర గ్రంథాన్ని వ్రాశారు. ఈ గ్రంథము శ్రీ జయంతి రామయ్య పంతులు గారిచే శోధించబడి ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారిచే ప్రచురించబడినది.

అందులోని ఈ క్రింది పద్యాలు భీమకవి రచించిన గ్రంథమనుటకు ఆధారములు.

క వేములవాడను వెలసిన

భీమేశ్వరు కరుణఁగల్గు భీమసుకవినే

గోమటి రేచన మీదను

నీమహిఁ గవులెన్న ఛంద మెలమి రచించున్

భావము: భీమేశ్వరుని కరుణ వల్ల, వేములవాడన జన్మించిన భీమకవిని నేను. కోమటి రేచన చేతున మీద ఈ భువిలో కవులు ఎంతదగ్గ ఛందస్సును రచించాను.

**కవిరాక్షసీయం:**

భీమకవి సంస్కృతమున రచించిన గ్రంథాలలో "కవిరాక్షసీయం" అనే లక్షణమైన కావ్యం ఒకటి. ఇది ద్వ్యర్థి కావ్యము(రెండర్థముల కావ్యం). ఈ గ్రంథములో ప్రతి పద్యానికీ రెండు అర్థాలు కలవు. ఒక అర్థంలో పోలిక. రెండవ అర్థం తాను చెప్పదలచుకున్న విషయము. ఈ కావ్యాన్ని "శ్రీనివాసపురము లోకనాథ కవి" తెలుగులో టీకాతాత్పర్యవ్యాఖ్యాన (ప్రతి పదార్థ భావ) సహితముగా అందించారు.

**రాఘవపాండవీయం:**

కవిరాక్షసీయంలా రాఘవపాండవీయం కూడా ద్వ్యర్థి కావ్యము. ఇది తెలుగులో మొదటి ద్వ్యర్థి కావ్యము.ఈ కావ్యంలో ప్రతి పద్యం ఒక అర్థంలో రామాయణ కథను, మరొక అర్థంలో మహాభారతకథను వివరిస్తాయి. ఈ కావ్యము గురించి ఆకాలమున నలుగురూ గొప్పగా చెప్పేవారు. కానీ నేడు ఈ కావ్యం ఎక్కడా దొరకలేదు. అందువలన పింగళిసూరన తానకు అలాంటి కావ్యమును వ్రాసే శక్తి కలదని తలచి మళ్ళీ అదే పేరుతో (రాఘవపాండవీయం) ద్వ్యర్థికావ్యమును రచించాడు. పింగళిసూరన తాన "రాఘవపాండవీయం"లో ఇదే విషయాన్ని మొదటి పద్యాలలో ప్రస్తావించాడు.

చ రెండర్థంబుల పద్యమొక్కటియు నిర్మింపంగ శక్యంబుగా

కుండుందద్గతిఁ గావ్యమెల్లనగునే నోహో!యనం జేయదే

పాండిత్యంబున నందునుం దెనుగు కబ్బంబద్భుతంబండ్రు ద

క్షుం డెవ్వాడిల రామభారతకథల్ జోడింప భాషాకృతిన్

భావము: రెండర్థముల పద్యము ఒకటి కూర్చుటకే సాధ్యము కాదు. అటువంటి కావ్యమే నిర్మింపజేస్తే ఆ అద్భుతము అందరినీ అశ్చర్యపోయేలా చేయక మానదు. అటువంటి కావ్యము మన తెలుగులో అరుదు. అటువంటి కావ్యం రామాయణ, భారతములను జోడించి, ఆ రెండర్థాలనూ ఒకే పద్యమాలికలో ఈ భూమిపై ఎవరు చెప్పగలరు.

ఉ భీమన తొల్లి చెప్పెనను పెద్దల మాటయె కాని యందునొం;
డేమియు నేయెడ న్నిలుచు టెవ్వరు గాన రటుండనిమ్ము నా
నామహిత ప్రబంధరచనా ఘనవిశ్రుతి నీకుఁ గల్గుటన్,
నామదిఁ దద్ద్వయార్థ కృతి నైపుణియుం గల దంచు నెంచెదన్

భావము: మొదట భీమకవి రెండర్థముల కావ్యమును చెప్పెనని పెద్దలు చెప్పారు, కానీ ఆ కావ్యంలో ఎక్కడా ఒక్క పద్యం కూడా నేటికి లభించలేదు. ఏ ఒక్కరు కూడా చూసి ఎరుగరు. ఈ విషయం అలా ఉంచితే, ఎన్నో విధాలుగా పూజ్యులైన, మీకు (వేములవాడ భీమకవి) కావ్యరచన వలన అధికమైన ఖ్యాతి లభించుట వలన ఈ రెండర్థముల ప్రబంధము యొక్క కూర్పు నందు నైపుణ్యము(కవితా శక్తి) నీకు కలదని నా హృదయము నందు తలచెదను.

<u>నృసింహపురాణము(వరాహపురాణం):</u>

ఇది వరకే నృసింహపురాణము తెలుంగరాయుడి అస్థానమున ఉన్నపుడు, రచించాడన్న సంగతి విదితమే. అందులోని కొన్ని పద్యాలను ఇక్కడ పొందుపర్చబడ్డాయి.

చ సురచిరపానపాత్రమున సుందరియొక్క తే కేలనిండు చం
దురుడు ప్రకంపితాంగములతోఁ దిలకించెఁ దదానంబుజ
స్ఫురిత వికాస వైభవము సొంపులడంకువమ్రుచ్చిలింపఁ జె
చ్చెరఁ జనుదెంచికట్టువడి చేడ్పడి భీతివడంకుచాడ్పునన్

<u>భావము:</u> భావము: ఆ సుందరి చేతిలో ఉన్న మిక్కిలి రమణీయమైన పానపాత్రము (లోటా లేదా పాత్ర)లో చంద్రుడు అత్యంతగా ప్రకాశిస్తున్నాడు. చంద్రుని అందాలన్నీయూ ఆ సుందరి ముఖవైఖరులచే దొంగలింపబడినట్లుగా ఆమె చేతిలో (ఉన్న పాత్రలో) కట్టుబడపాయి భయముతో వణుకుతూ ఉన్నట్లుండెను.

క భువిఁ బుట్టి పీచమడఁచెను
దివిజారాతుల దినేశ దీప్తులడర రా
ఘవుఁడనుచు మునులు వొగడిరి
దివిని దివౌకనులు మిగుల దీవించి రొగిన్

చ	కలగకుఁడీ నభశ్చరులు కంపము జెందకుఁడెప్పు గిన్నరుల్
తలకకుఁ డచ్చరల్ మునులుఁ దత్తరమందకుఁ డేను వచ్చి మీ
యల జడులెల్లఁ బాపి మిమునందఱఁ గాచెదనంత వట్టు మీ
గలిబిలిమాని యుండుఁడని కైటభమర్దనుఁ డెల్ల  భంగులన్

క	ఈక్షితికి వచ్చి వేగమ
ద్రాక్షారామమున వార తరుణులనృత్యం
బీక్షించి యంతకంటెను
దక్షణమున నేర్చి రంభతగ వేర్పడగన్

చ	శ్రుతిమత ధర్మయోగములు చోద్యపుమూల్యములప్పరంబునఁ
జతురతఁ బుణ్యవస్తువులు సారవిముక్తి పదంబు లమ్ము వా
రతులిత విఘ్న శాసన సమాహితులైన మహాత్ములందితో
ద్ధతిఁ గొనువారు మీసువిహితవ్రత పారగులైన బోధనుల్.

తే.గీ	అదరుపాటున వెసనిచ్చి పొదివికొనిన
దొలగిపోవఁ గూడక యుండి మలయపవనుఁ
డిందుఁ దలదూర్చుకొనియెనో యిప్పుడనఁగ
నమరుఁ దాళవృంతముల మందానిలంబు!

తే.గీ	పొదవియొండొండ దివియును భువియు దెసలుఁ
బొదవికొని యుండు చీకటి ప్రోవువలన
మిక్కుటంబుగఁ గాటుక గ్రుక్కినట్లు
కరవటంబున జగదండ ఖండమమరె

క	అది యట్లు కాదె నిప్పనఁ
జెదలంటునె దేవ దేవు శ్రీరమణీశుఁ
మదినుంచుకొన్న వానిని
బొదవునె యాపదలు? దవినిఁ బొందునె తమమున్

ఉ	శ్రీ స్తవకుంకుమద్రవ నిషిక్త భుజాంతరభాగ విస్ఫుర
త్కౌస్తుభ నూతనార్కరుచి గర్వితనాభిసరోజ సౌరభ
ప్రస్తుత మత్తభృంగవర రాగరసోల్బణ భోగిభోగ త
ల్పాస్తరణుందలంచు సుకృతాత్ముల పాస్త సమస్త కల్మషుల్

చ కడిఁది వరంబు వారిరుహగర్భునిచేఁ గొనినాడు వాడు మీ
యెడ ననిశంబుఁ బెన్పగయు నీనును దోషము నెమ్మనంబులో
జడిగొని యుండుఁ గావున నసాధ్యుఁడవధ్యుఁడు దైత్యనాధుడే
వడువునఁబౌరుషంబుఁగొని వానిజయించుట ప్రేగుచూడగన్

తే.గీ పొగడప్రూకుల మొదలను బుష్పరసము
తొరగ నెత్తావియందున నెరయనొప్పెఁ
బూచు కొఱకుసు మున్ను నింపులు దలిర్పఁ
గడగి వనలక్ష్మి యుమిసిన కళ్ళయనగ

మ ధరణీమండలి దిర్దిరం దిరిగెఁ బాతాళంబు ఘూర్ణిల్లె ని
ర్జరనాధ ప్రముఖాఖిలామర నివాస శ్రేణులం దోలిమై
నెరయుఁ బంకజ సంభవాలయమునఁ నిండా రె నెవ్వేళ శ్రీ
కర దైతేయ తనూభ వోద్భవకథా కల్యాణ ముద్ఘోషమై

క మీఱీన మానుల కినుకకు
మాఱలుగక యున్న మీసమగ్రక్షమవే
మాఱుఁగొని యాడఁగా దగు
గీఱునె సాత్వికుల బుద్ధిఁ గిల్బిషచయముల్

క వేదములాదిగఁగలయ
ష్టాదశ విద్యలకునీవ స్రష్టవుత త్త
ద్బోధకులును భవదాజ్ఞా
పాదకులు సమస్త ధర్మపాలన చతురా.

**శతకంఠరామాయణం**: భీమకవి రచించిన శతకంఠరామాయణం అను కావ్యము నేటికి దొరుకలేదు. ఆ గొప్ప గ్రంథములోని ఒక పద్యము ఈ క్రింద ఇవ్వబడింది. ఈ పద్యము ఎంతో జిగిబిగి, సొంపులతో కూడి ఎంతో వినసొంపుగా ఉన్నది. ఈ పద్యము భీమకవి ఉద్దండ స్వభావమునకు గుర్తు.

వారక వారకామినుల వర్తులచారుకుచోపగూహముల్
కోరక కోరకోల్లసితకుంజములఁ జిగురాకు పానుపుల్
చేరక చారు కేరళ కళింగ కుళింగ నరేంద్ర మందిర
ద్వార విహారులై సిరులనందక నందకపాణిఁ గొల్వరే

భావము: స్త్రీవ్యామోహముతో వేశ్యల పొందు కోరక, విలాసవంతమైన, సుఖమయమైన జీవితమును ఆశించక, రాజాస్థానములను చేరి సిరులను ఆశించకుండా, ఎల్లవేళలా నందకపాణి అయిన విష్ణుమూర్తిని కొలవండి.

**జ్యోతిష్యామృతసారము:**

జ్యోతిష్యామృతసారమను కావ్యాన్ని భీమకవి రచించారు. భీమకవి రచించిన జ్యోతిశ్శాస్త్రంలో జ్యోతిష్యమునకు సంబంధించిన అన్ని ప్రశ్నలకు సమాధానాలు లభిస్తాయని చెబుతారు. భీమకవి రచించిన జ్యోతిష్యామృతసారమును పారశీక భాషలో అనువదించబడింది.

**లకోటాప్రశ్నశాస్త్రము:**

భీమకవి సంస్కృతంలో రచించిన ప్రశ్నశాస్త్రము. ఇది తెలుగులో అనువదించబడింది. ఈ పుస్తకము నేడు ద్రాక్షారామ ప్రాంతములో లభించును. మనసులో తలచుకున్న సంఖ్యను బట్టి ఆ తరువాత రోజుల్లో ఎలా జరుగునో (వార ఫలాల మాదిరి) వివరించారు.

ఇంకనూ ఈ మహానుభావుడు కవిత్వములోను, జ్యోతిశ్శాస్త్రము, గణితశాస్త్రము, వైద్యశస్త్రములలో కూడా ప్రావీణులు. "**భావప్రకాశిక**" అను పేరుతో ద్వాదశ(12) భావములను తెలుపు ఒక గ్రంథమును కూడా రచించారు. "**భీమేశ్వర నాడీనిదానము**" అనే పేరుతో 108 పద్యములను ద్రాక్షారామభీమేశ్వరా! అను మకుటముచే వైద్యశ్శాస్త్ర గ్రంథమును రచించారు. భీమకవి గణితశ్శాస్త్రములో కూడా గ్రంథమును రచించారని చెబుతారు. కాని ఆ గ్రంథము పేరు తెలియరాదు.

భీమకవి సాహిణి మారుడి పేరున చెప్పిన పద్యాలు కొన్ని కనపడుతాయి. కానీ ఆ సాహిణి మారన, చొక్కభూపాలుని ప్రార్థన మేరకు కదనరంగమున తుదముట్టించిన సాహిణి మారడా? లేదా వేరేవాడా? అనేది తెలియరాదు. బహుశా భీమకవి నిగ్రహానుగ్రహ సమర్థుడగుట వలన ప్రయోజనమును బట్టి తరువాత అతనిని బ్రతికించిన తర్వాత ఏదైనా సందర్భములో ఈ పద్యాలు చెప్పాడో ఏమో తెలియరాదు.

**పద్యాలు:**

క అప్పులిడు నతడు ఘనుడా
అప్పుడొసగ మఱలఁ గాంచునాతడు రాజా?
చెప్పగవలె సాహిణిమా
రప్పను దానమున ఘనుడు రాజునటంచున్!

క మాటాడరాదు సభలన్
మాటాడినఁ దప్పరాదు మగసింగముకున్
మాటయె మానము కాదా
పాటువుగల వారికెల్ల సాహిణిమారా!

క    ఇంతుల మనముల నరిసా

మంతుల మనములను బుద్ధిమంతుల మదిలోఁ

జింతింపని బ్రతుకేటికి

సంతత సత్కీర్తి హారా సాహిణిమారా!

**<u>సుమతీ శతకము:</u>**

ఈ సుమతీ శతకము చాలా పురాతనమైనది. అయితే ఈ సుమతీ శతకమును రచించిన కవి ఎవరన్న చిక్కుముడి ఇప్పటికీ వీడలేదు. ఈ సుమతీ శతకము మద్రాసులోని ప్రాచ్యలిఖిత భాండాగారము(గ్రంథాలయము)లో D1810 అను తాళప్రత ప్రతిలో "భీమన" అను కవి రచించినట్లున్నది.

శ్రీకరమగ భీమన మును

లోకమునకు బొగడగా విలోకించి మదిన్

బ్రాకతముగా సుమతికి మతి

చేకూడగ సుమతి నీతి చెప్పెదొడంగెన్

సుమతీ శతక తాళప్రత గ్రంథమును మొదటి ప్రచురణ పీఠికలో పరిశోధకులు ఈ భీమన్న చెదలవాడ భీమకవినా? లేదా వేములవాడ భీమకవినా? అన్న సందేహము వ్యక్తము చేసారు. చెదలవాడ భీమకవి అను పేరిట కవి ఉన్నట్లుయెక్కడా కనపడదు. పరిశోధనలో ఆకాలాన లభించిన వివిధ శాసనాల వలన భీమన అనే పేరుగలవాళ్ళను పరిగణలోకి తీసుకుంటే వారిలో కవిత్వం చెప్పగల వారెవ్వరూ లేరు. ఈ శతకమును బ్రౌనుగారి కాలాన ఆంగ్ల భాషలో అనువదించబడింది. ఆ ప్రతిలో వేములవాడ భీమకవిచే రచింపబడిన సుమతీ శతకానికి ఆంగానువాదము చెప్పబడింది. ఈ సంగతి అటుంచితే "నీతిశాస్త్రముఖ్తావళి"లో ఒక చోట బద్దెన(బద్రభూపాలుడు) సుమతీ శతకము వ్రాసాడు అని చెప్పబడి ఉంది. ఈ విషయాలను అన్నియూ తొలి ప్రచురణము నోచుకున్న సుమతీ శతకములో పీఠికలో చెప్పబడి ఉన్నది. భీమన, బద్దెన ఇరువురూ సుమతీ శతకము పేర శతకములు వ్రాసి ఉండవచ్చును. అయితే మనకు అందుబాటులో ఉన్న సుమతీ శతకము తాళపత్ర ప్రతి మీద భీమన అని వ్రాయబడి ఉన్నది.

సుమతీ శతకము భీమకవి రచించినదని చూపబడిన పీఠిక.

# పీఠిక.

సుమతీశతకము చాలపురాతనగ్రంథ మనియు, స్వాదుమధురపద సంఘటిత మనియు, వేరుగ వ్రాయ నవసరము లేదు, కాని రచించినకవి యెవ్వఁడై యుండునా యను సంశయము పాఠకులకుఁ దోఁపక మానదు. శాస్త్రప్రతి గ్రంథములలో భీమన యనుకవి రచించినట్లు గానఁబడుచున్నది, ఆభీమన్న వేములవాడభీమకవియా వేములవాడ భీమకవిగా యని పరిశోధకు లనేకులు శంకించుచున్నవారు. ఇట్లు వేము॥ రా॥ శ్రీ॥ మానవల్లి రామకృష్ణయ్యకవిగారు భద్రభూపాలప్రణీత మను నీతిశాస్త్రముక్తావళి యనుగ్రంథమును 1930 సం॥ మున ముద్రించి ప్రకటించుచు నందొక పీఠికవ్రాసి, దానిలో సుమతీశతకము రచించినకవి భద్రభూపాలుఁడనియు నీతిశాస్త్రముక్తావళిలోఁ దాను సుమతీశతకమును రచించినట్లు చెప్పుకొనుటయే రచించెననుటకాధారమని సూచించినారు. భద్రభూపాలుఁడే సుమతీశతకమును రచించినయెడల నితఁడు క్రీ॥ శ. ౧౨౭౦ ప్రాంతమున రచించెనని యూహింపవచ్చును. ఈశతకముశైలియు నాకాలపుశైలిని బోలి యున్నది నీతిశాస్త్రముక్తావళిలో నీశతకమునుగూర్చి చెప్పబడిన యను సామాంతరము గలభద్రభూపాలుఁడు రచించినపద్యమిందుఁ బొందుపరచినాము, కావున పాఠకులు పరిశీలింతురుగాక.

« క. శ్రీవిభుఁడ గర్వితారి
క్ష్మావరదళనోపలబ్ధజయలక్ష్మీసం
భావితుఁడ సుమతిశతకము
గావించినప్రోడఁ గావ్యకమలాసనుఁడన్. »

అని నీతిశాస్త్రముక్తావళి యనుగ్రంథమున గలదు. ఈకవికి రాజరాజ మనోజుఁ డనియు, సన్నవగంధవారణుఁ డనియు, సుదారశైగోచసుఁడనియు, దశదిశాభరణాంకుఁ డనియు, నరేంద్రచతురాననుఁ డనియు రాజార్హంబు లగుచిహ్నంబులును, కవిబ్రహ్మ యనుకవిత్వబిరుదమును గలవు. కవి నీతిశాస్త్రముక్తావళిలో ననేకపద్యాంతములఁ దనబిరుదముల

# భీమకవిని స్తుతించిన కవులు

- శ్రీనాథుడు తన "కాశీఖండం"లో తన పూర్వపు కవులను స్తుతిస్తూ, మొదటగా భీమకవి ఉద్దండ శైలిని గుర్తుకుతెచ్చుకున్నాడు.

" వచియింతు వేములవాడ భీమన భంగిఁ
నుద్దండలీల నొక్కొక్క మాటు
భాషింతు నన్నయభట్టుమార్గంబున
నుభయభాషాప్రౌఢి నొక్కమాటు"

- పట్టపు సరస్వతీ సోమయాజి (సాక్షాత్తు భీమేశ్వరుడు భీమకవి నాలుక చివర వాగ్భామిని బీజాక్షరాలను లిఖించాడని)

భీమేశ్వరు డితడు మా నామము వాడనుచు వ్రాసి
నాలుకతుద వాగ్భామిని బీజాక్షర మా భీమన
దలచినను గల వభీష్టఫలంబుల్ (పృథుచరితము)

- తిరువేంగళ కవి తన "చొక్కనాథచరిత్ర" గ్రంథములో తెలుగు కవులను స్తుతిస్తూ భీమకవి ని తొలుత తలచి తరువాత కవిత్రయాన్ని తలచాడు.

" భవభూతి దండుమాఘునిని బిరుద వేములవాడ భీము,
నన్నయ తిక్కన ఎఱ్ఱపార్య శ్రీనాథునిలఁగల్గు కవులను నెల్ల
సద్భక్తి విలసిత సద్వాక్య వినుతి నుతించియెకతి రచియింప"

- కొరవి గోపరాజు అను కవి భీమకవిని (బలభీముడు, వినుత భీముడు) గూర్చి

"వేములవాడక సుఖియై
వేములవాడం జరించి వేములవాడన్
దా మెరసిన భీముని సుత
భీముని బలభీము విముఖతభీముదలంతున్"

- ఆంధ్రకవి రామయ్య (భీమకవి ఛందోనిబంధన చాతురీ ధోరేయుడని, వాగ్ధాముడనీ)

"ఛందోనిబంధన చాతురీధోరేయు వాగ్ధాము
వేములవాడ భీమ"

"చను నుత్తమగండాధ,ర్వణహనుమదనంతన కవిరాక్షనజయదే
వనుత శ్రీధరగోక,ర్ణనీలకంఠాది భీమన ఛ్ఛందంబుల్"

- వెల్లంకి తాతంభట్టు (భీమకవి లక్షణకర్త)

  "భీమన అఖండంబు మొదలైన కొన్ని వళులకు

  లక్షణ లక్ష్యంబులు చెప్పడు"

  ప్రజ్ఞాలవదుర్విదగ్ధు లసంగతంబుగా బెనచి

  తగిలించినా; రతని యంకితంబు లేవున

  వానిం బ్రమాణింపతగదు"

- చంద్రరేఖావిలాప రచయిత కూచిమంచి జగ్గకవి (తిట్టు కవిత్వం అనగా అందులో భీమకవి అగ్రగణ్యుడని చెప్పాలని)

  భీమకవి రామలింగని

  స్త్రీ మన్మధుడై చెలఁగు శ్రీనాధకవిన్

  రాముకవి ముఖులను ర్రో

  ద్ధామగతిఁ జిత్తువీధిఁదలచి కడంకన్

- పెదపాటి సోమనాథుడు రచించిన అరుణాచలపురాణంలో భీమకవిని ఇలా తలచాడు.

  వాక్ప్రితోషితదక్షవాటి మహాస్థాన

  భీము వేములవాడ భీముఁగొలిచి

- మొల్ల

  స్తుతగుణోద్ధాము నాచనసోము భీముని

- పింగళి సూరన్న భీమకవి రచించిన రాఘపాండవీయం అను రెండర్థముల కావ్యం దొరకకపోవడం వలన అలాంటి కావ్యమును అదే పేరున రచించాడు. ఆ గ్రంథములో మొదటి పద్యాన ఇదే విషయాన్ని ఇలా వ్రాశాడు.

  ఉ　　భీమన తొల్లి చెప్పెనను పెద్దల మాటయె కాని యందునొం;

  డేమియు నేయెడ న్నిలుచు టెవ్వరు గాన రటుండనిమ్ము నా,

  నామహిత ప్రబంధరచనా ఘనవిశ్రుతి నీకుఁ గల్గుటన్,

  నామదిఁ దద్వ్యయార్థ కృతి నైపుణియుం గల దంచు నెంచెదన్

- చిత్రకవి పెద్దన (భీమకవి ఈశ్వరప్రసాది కవితాఢ్యుడని)

ప్రత్యక్ష వర ప్రసాదకవితాఢ్యుని

వేములవాడభీమునిన్

- లింగముగుంట తిమ్మన

భీమనయు ననంతయును బెద్దనయును

తాతానయును జెప్పినట్టి ఛందములు గూర్చి

ప్రకరణము లొప్పజేసెను బ్రహ్మసంఖ్య

నొనర లింగముగుంట తిమ్మన యనుకవి

- పొత్తపి వెంకట రమణ కవి

భీముని ఫణబంధపేశలంబు

- వార్తకవి రాఘవయ్య

"జనతతగణయుతము సంపత్కరంబుగా

మంచి దనుచు భీము డెంచినాడు"

"ఛందం మొదలనే వేములవాడ భీమ

కవిగారి ప్రయోగం ఉన్నది"

- కాకునూరి అప్పకవి

"వికటకవులు కొన్ని వింతలు గల్పించి

కవిజనాశ్రయమున గలిపినారు. వాని గఒకొనంగ

వలదప్రయుక్తంబు లేల సెప్ప, భీముడెరిగి యెరిగి"

" కవిజనాశ్రయమున

'శ్రీకాంతా' యని వేములవాడ భీమకవియును"

"భీమన పది చెప్పె ననం

తామాత్యుడు చెప్పె వెనుక యతు లిరువదినాల్గు"

- ఓరుగంటి రామకవి

భీమేశ్వర లబ్ధకవితావాచా సిద్ధిగల వేములవాడ

భీమనార్యుం డొనరించిన కవిజనాశ్రయం

బను ఛందంబు (కవితాలక్షణసారం)

- కూచిమంచి తిమ్మకవి

భీమన చెప్పిన పదియతులను ప్రకారాంతమున వ్రాసుకోన్న పద్యమే ఉంది.

- కస్తూరి రంగకవి

ఆదిమకవి భీమన రేచన మీద నంకితముగా జెప్పినాడు.

- పిండిప్రోలు లక్ష్మణకవి

పృథు కుకవి స్వాంభీము భీము దలచి

- కట్టమూర్తి కామేశ్వరకవి

రమణీయపాకాభిరాము భీము దలచి

- శేషధర్మము లక్ష్మణకవిస్తుతి

భీము ననంతు జిత్రకవి పెద్దన సుధింద్రు జగత్ప్రసిద్ధులన్

- అనంతామాత్యుడు తన భోజరాజీయము అను కావ్యమునందు

నన్నయభట్టుఁదిక్కనకవి నాచనసోముని భీమనార్యుఁ బే

రెన్నిక జిమ్మపూడియమరేశ్వర భాస్కర శంభుదాసునిన్

నన్నుతిఁజేసివాక్య సరసత్వము వీనులకింపు మీర న

త్యున్నతిగా నొనర్తు నెఱ యోధులమేలనఁ గావుమిమ్ములన్

## భీమకవి చెప్పిన ఇతర చాటువులు

సీ	గడియలోపలఁ దాడిఁగడగి ముత్తునీయగాఁ

దిట్టిన మేధావి భట్టు కంటె

రెండు గడెల బ్రహ్మదండి ముండ్లన్నియు

డుల్లఁదిట్టిన కవి మల్లుకంటె

మూడు గడియలకు మొనసియత్తిన గండి

పగులఁ దిట్టిన కవి భాను కంటెఁ

నఱజాము లోపలఁ జెఱువు నీళ్లింకంగఁ

దిట్టిన బడబాగ్ని భట్టు కంటె

ఆ.వె	నుగ్రకోపినేను నోపదు శపియింపఁ

గ్రమ్మఱింప శక్తి గలదు నాకు

వట్టి మ్రానుఁ జిగురు పుట్టింపఁ గిట్టింప

బిరుద వేములాడ భీమకవిని

ఉ	నవ్యవిలాస రమ్యనలినంబని బాలముఖాబ్జ సౌరభా

భివ్యసనంబునన్ బరగు భృంగ కులోత్తమ! తద్వియోగ తా

వవ్యథఁ బ్రాణినిల్వదు కృపాగుణ మేర్పడ బ్రాణ్మాణోనహం

తవ్వ యనంగనొప్పు వచనస్థితిఁ గుందకెరుంగఁ జేయుమా!

చ	బిసరుహగర్భవ్రాతయును విష్ణుని చక్రము వజ్రి వజ్రమునఁ

దెసలను రామబాణము యుధిష్ఠిరు కోపము మౌని శాపముఁ

మసకపుంబాము కాటునుఁ గుమారునిశక్తియుఁ గాలుదండముఁ

శుపతి కంటిమంటలును బండిత వాక్యము రిత్తవోవునే!

కవిజనాశ్రయంలోనివి

ఉ	మానుగ విక్రమాక్షర సమన్వితమై స్వరమూదినఁ దది

యాను గుణాక్షరంబుఁ గొనియైననుఁ జెప్పగనొప్పు నీ క్రియఁ

భాను సహస్ర భాసి వృషభాధిపుడన్నటులర్థ యుక్తమై

పూనినచో నఖండవళి పొల్పగు నాది కవి ప్రణీతమై

క   నెఱయంగా నీఛందము

తెఱఁ గెఱుగక కవిత చెప్పఁ ధృష్టాత్ముడు ద

బ్బఱ చీకు చీకు గుఘ్ఘముఁ

బఱపిన క్రియ నిఖిల హాస్యపద నిరతుడగున్

క   జననుత భీమతనూజా

సున యార్పిత విభవతేజ సుభగమనోజా

విమత విశిష్టసమాజా

యననంత్వబ్రాసమగు నహర్పతి తేజా.

గీ   అదరుపాటున వెసనిచ్చి పాదవికొనిన

దొలగి పోవఁగూడక యుండి మలయపవనుఁ

డిందుఁదలదూర్చుకొనియెనో యిప్పడనగ

నమరుఁ దాళవృంతముల మందానిలంబు

శ్లో   అజాగళస్థ స్తనముష్టి వృష్ఠం

నాసాంతరే కేశమ థాండయుగ్మమ్

వృథాన్రుజం త్సాహిణి మారభూవం

పూజాం నలేభే భవి పద్మయోనిః

➢ **రణతిక్కనపై భీమకవి చాటుధార:**

రణతిక్కన రణనిహతుడైనపుడు అతని గుణగణాలను, అతని శౌర్యపరాక్రమములను వర్ణిస్తూ చెప్పిన అద్భుతపద్యాలు.

చ   పదటునవాజిరాహుతుల పై దుమికించుచుఁదిక్కఁడార్చనన్

బెదిరిపరిభ్రమించికడుఁ బిమ్మట వీరులు భీత చిత్తులై

యదె! యదె! వాలువాల్మెఱుఁగులల్లదె! యల్లదెయాతడంచనఁ

గొదుకకయాజిసే సెరిపుకోటుల కందఱకన్ని రూపులై

ఉ చిక్కక మన్మసిద్ధివిభుచేమును గొన్న రుణంబుదీర్చె మా
తిక్కనమంత్రిసోమశిల దేవరసాక్షిగఁ బెన్న సాక్షిగా
నెక్కినవాజిసాక్షిగ మహిన్నుతికెక్కినకీర్తి సాక్షిగా
స్రుక్కక మారుకొన్న రణశూరులు సాక్షిగఁ గొండ సాక్షిగన్

సీ రణరంగమున మోహరంబులఁబొడగని
ప్రాణంబువాసిన వందగజమ!
విజయాధిపునిదాడి వెనుకొని తాగులంగ
దెసదప్పి పాటిన దిగ్గజంబ!
చేరఁజాలకతిర్గిచే మడమల్లించి
మంచానకందని మదగజంబ!
పెనుతుల్లిచెఱ్ఱులోఁ బిరుదులన్నియుఱొంపిఁ
గ్రుంగంగఁద్రొక్కిన కుంజరంబ!
నేడు మొదలుగాఁగ నెల్లూరుపురములోఁ
బొగడుతనము సేయు మగలతలలు
వూరిఁగఱచితిక్క! భూతమైసోకుము
యూరివారిసోఁకుఁ గారుసేసి.

సీ ధైర్యంబు నేమేనఁదగిలి యుండుటఁజేసి
చలియించి, మంథరాచలము తిరిగె
గాంభీర్యమెల్లనీ కడనయుండుట చేసి
కాకుత్థ్సచే వార్ధికట్టువడియె
జయలక్ష్మి నీయురస్థలిని యుందుట జేసి
హరిపోయి బలిదాన మడుగుకొనియె
ఆకారమెల్లనీ యందయుండుటఁజేసి
మరుడు చిచ్చునఁబడి మడిసిచనియెఁ

గీ దిక్క దండనాథ! దేవేంద్రపురికినీ
వరుగుటెఱిఁగి నగము తిరుగుటుడుగు
నబ్ధికట్టువిడుచు నచ్యుతుకొదమాను
మరుఁడు మఱలఁగలుగు మగలరాజ!

సీ	నందినిఁ బుత్తెంచె నిందు శేఖరుఁడునీ

వన్న!! యేతెము తారాద్రికడకు

గరుడుని బుత్తెంచె నరహరి రావయ్య

వగసిద్ధతిక్క! కైవల్యమునకు

హంసను బుత్తెంచె నజుఁడు నీకడకును

భయకులమిత్ర! రాబ్రహ్మ సభకు

ఐరావతమునంపె నమరేంద్రుఁడిప్పుడు

దివమునకేతెమ్ము తిక్కయోధ!

గీ	యనుచు వేఱువేఱ యర్థితోఁ బిలునంగ

వారు వీరుఁగూడి వచ్చి వచ్చి

దివ్యయోగియైన తిక్కనామాత్యుడు

సూర్యమండలంబు సొచ్చచనియే.

ఉ	వెన్నెలలేని రాత్రియు రవిప్రభ లేనిదివంబు నీరులే

కున్న సరోవరంబుఁగ నొప్పగు దీపము లేని యిల్లు నై

విన్నదనంబునొందె మనవిక్రమసింహపురంబు చూడఁగాఁ

బున్నమచంద్రుఁ బోలుమన పోలమతిక్కడు లేమినక్కటా!

ఉ	ఏమి తపంబుఁజేసి పరమేశ్వరునేమిటఁ బూజసేసిరో

రాముని తల్లియుఁ బరశురాముని తల్లియు భీముతల్లియుఁ

గాముని కన్న తల్లియును గంజదళాక్షుననుంగుఁ దల్లియున్

శ్రీ మహిత ప్రతాపుడగు సిద్ధయ తిక్కనఁగన్న తల్లియున్

ఉ	శ్రీలలరారశత్రువులఁ జెండితివార్యులు మంత్రివర్యులా

ర్వేలఘనుల్ నుతించిరలవేర్పు దొరల్ ముదమంది మెచ్చరో

లాలిత శౌర్యధైర్య జయలక్ష్మి ప్రియంబున నివ్వరించెనీ

లీలలుహెచ్చెఁ దిక్కని కళేబరమా యిక నిల్చియాడుమా

- **మైలమభీముని పై చెప్పిన పద్యాలు**

మైలమభీముని శౌర్యపరాక్రమములను కొనియాడుతూ చెప్పిన అద్భుత పద్యమాలిక.

ఉ యాచకఖేచరుండు సుగుణాంబుధి మైలమభీమఁ డీల్గినన్
జూచి వరించె రంభ యెడఁజొచ్చెఁదిలోత్తమ; దారినిద్దఱన్
ద్రోచె ఘృతాచి ముగ్గుఱకు దొద్దడి కయ్యముపుట్టెనంతలో
నాఁచుకుపోయె ముక్తిసతి నవ్విరి యద్దశఁ జూచినిర్జరుల్
నోచినవారిసొమ్ములవి నోమనివారికి వచ్చునేధరన్

చ అహితులఁ దాఁకి పోరు నెడ నంబుధికట్టిననాటిరాము గో
గ్రహణమునాటి పార్థు గదఁగాఁ గౌరవునేసిననాటి భీమునా
గ్రహ మెసగంబురత్రయముఁగాల్చిననాటిలలాటలోచనున్
మహి నుపమింపఁగాఁ దగునె మైలమభీముని విక్రమున్

ఉ పన్ని తురంగమంబునకుఁ బక్కెర వెట్టినవార్త చారుచే
విన్న భయంబునంగలఁగ వేసటనాటనెచక్ర? గోట్టముల్
మన్నియపట్టణంబులును మక్కెన వేంగి కళింగ లాదిగా
నిన్నియు నొక్కపెట్టెగొని నేఱువభీమనృపాలుధాటికిన్

క అరివరు లేఱువభీముని
సొరువున మనలేరు చిచ్చుపొంతను వెన్నై
తెరువునఁ బైసరై జూదరి
సిరియై రేన్చెట్టుక్రింద జిల్లెడుచెట్టై

ఉ ఆలములో నరాతులకు హమ్మని మార్కొనవచ్చునే మహా
కాళికి శూలికిన్ బ్రళయకాలపుగాలికి రాఘవేంద్రుబా
ణాళికిఁ బక్షి నాయకునఖాళికి మత్తగజేంద్రవైరిదం
ష్ట్రాళికి దావపావకశిఖాళికి మైలమభీమువాలికిన్

మ తెరలంబాఱి నభంబు దాఁకినఁ బయోధిం జొచ్చినన్ శైలగ
హర్వముల్ దూఱినఁ జిక్కభీముడునృపవ్రాతంబుఁబొనిచ్చునే
గరుడండై చని పట్టు మింటితుద నుగ్రగ్రాహమై చొచ్చి సా
గరమధ్యంబునఁబ్రుంగుఁ బట్టుకొను సింగంబైగుహాంతరంబునన్

క ఆలమునఁ జిక్కభీముడు
నా లతివేగమునఁ బెఱికి నడితుదగవియఁ
బ్రేలిపడఁ బడుగు నేసెను?
ఏలేరును గసిమి భైరవేశుం డెఱుఁగన్

ఉ వీరగుణప్రతాపగుణవిశ్రుత! మైలమ భీమ నీయశం
బారభమానితారకరహారవిలాసము నీనికేతనం
బాభమానతారకరహారవిలాసము నీభుజార్గళం
బారభమానతారకరహారవిలాసము చిత్ర మిద్ధరన్

ఉ భండనభీమ నీయెదురఁ బాఱక నిల్చినశాత్రవుల్ బృహ
న్మండలపుండరీకపురనాకనివాసులు నోర్చినన్ బృహ
న్మండలపుండరీకపురనాకనివాసులు చచ్చినన్ బృహ
న్మండలపుండరీకపురనాకనివాసులు చిత్ర మిద్ధరన్

చ విదితగురుప్రతాపగుణవిశ్రుత మైలమభీమభూప నీ
పదిలపుఖడ్గదారఁ దెగి పాఱినవీరుడు గోపురంబుపై
విదితసువర్ణరత్నమయవేదిక మీదను నిల్చి కాంచు నౌ
పదిపదు లగ్నిహోత్రులను బన్నిరుసూర్యుల నూఱుచంద్రులన్

చ ఆసమునఁ గాసికానగరమం దసువుల్ త్యజియించినంతనే
యసదృశ మైనకన్నుగల దచ్చట మైలమభీమభూప నీ
యసిఁ దెగపడ్డవైరులకు నంబకముల్ పదినూఱులయ్యె నీ
యసికిని వారణాసికిని నంతర మెంత దలంచి చూచినన్

ఉ ఏఱువ భీమ! నీ పగతు లెక్కని కొండలు చంచలాత్ములై
దూఱనియట్టి ఘోరవనదుర్గములున్ వనితావియోగులై
పాఱనిత్రోవలుం దిననిపండ్లును నాఁకటఁగూర లుప్పగా
నేఱనికల్జులుం గలవె యీలవణాంబుధి వేష్టితావనిన్?

- **రాయనభాస్కరుని పై చెప్పిన పద్యాలు:**

రాయన భాస్కరుడు మహా దాత, ఎన్నోదానధర్మాలను చేసాడు. ఎన్నో సత్రాలను కట్టించి, ఉచిత అన్నదాన వసతులను కల్పించాడు. ఈయన చేసిన దానధర్మాలను వర్ణిస్తూ చెప్పిన అద్భుత చాటుధార.

క	పసముత్య మొకటి చాలును
గస వూడ్చిన చింపిరాలు గంపెం డేలా?
రసికుం డొక్కడె చాలును
రసహీనులు పదువురేల రాయనిబాచా!

ఉ	రాజితకీర్తిశాలియగురాయనిబాచ! భవద్యశంబు ది
క్పూజితమౌచు మించె సురభూధరభూధరభూధరేంద్ర కాం
తాజసుగోత్రరు గ్విధు రథాంగరథాంగరథాంగ శేషభా
షాజలజాహితాహితతుషారతుషారతుషారధాములన్

ఉ	ఏమనిలింపశాఖి? పనియేమిసురేశ్వర! యీవి నిన్నుఁ జిం
తామణి మీఱినాఁడటకదా మన రాయనబాచకోవిద
గ్రామణి!యౌన యింతటనె కాదుచుమీ విభవంబునందు ని
న్నో మతియందు నీగురువునో సుకుమారత నీకుమారునో

మ	ఆయలక్ష్మీనిధి రాయన ప్రభునిబాచామాత్యుఁడశ్రాంతమున్
నియతిన్ బ్రాహ్మణపూజసేయు టభివర్ణింపగ శక్యంబె త
త్ప్రియ గ్రేహంబున హేమపంజరమునన్ బె'ల్లర్చతప్రార్చత
ప్రియమేధా' యనుచుం బఠించు శుకశారీకిన్నరీద్వంద్వముల్

ఉ	అన్నరొ కొండపల్లి సచివాగ్రణి రాయనమంత్రి పట్టి బా
చన్నజలాన్నసత్ర మెడపైన పథంబునఁ బెట్టు నెయ్యి రా
జాన్నము లొప్పఁబప్పు పదియాఱు తెఱంగులకూరగాయలున్
వెన్నెలగుజ్జుఁబోలుదధి వేసవికాల మవారితంబుగన్

క	ముసలాపెవ్రేలుఁజన్నుల
పసవంటిది లోభివానిబ్రదుకు ధరిత్రిన్
బిసిబాలవయసువంటిది
రసికునిజీవనము మంత్రిరాయనిబాచా!

సీ ఫణిరాజు తనశిరోమణు లర్థికిచ్చునో

యనుచు విష్ణువు క్రింద నణగియుండె

కైలాసకుధరమెక్కడ నిచ్చునో యని

యుగ్రుఁడక్కడఁ గావ లుండఁబూనె

తనయందు మణుల నేతఱి నిచ్చునో యని

వనధిసంతతమును వణఁకుచుండె

సురధరాధరము నెవ్వరి కిచ్చునో యని

తరణి యగ్గిరిచుట్టుఁ దిరుగుచుండె

గీ ఔర! నీదానవిఖ్యాతి యఖిలదిశల

మించివర్తించె నీకీర్తి నెంచఁదరమె

గాఢదారిద్ర్య యామినీ కాంతిచంద్ర

భాగ్యదేవేంద్ర! రాయన భాస్కరేంద్ర!

సీ నీపంక్తినొకనాడు నెఱిభుజించినవిప్రుఁ

డమృతాన్నమైనను నరుచిసేయు

నీసభాస్థలి నొక్కనిముసమున్నజనుండు

తల్పశేషునినైనఁదప్పపట్టు

నీరూపమొకనాడు తేఱిచూచినభామ

కందర్పునైన డాకాలఁ దన్ను

నీచేతిదానమ్ము నెమ్మినమ్మినయర్థి

యెమ్మెధనాధుపుఁ బొమ్మబెట్టు

గీ నీవె నినుఁ బోలుదువు గాక నిన్ను నెన్ని

యున్నమంత్రుల నెన్నుట పిన్నతనమె

బాలికాప్రాణ నూతన పంచబాణ!

భాస్కరేంద్రుని రాయనభాస్కరేంద్ర!

క అక్షరాభ్యాసంబు శిక్షచేసెడునాఁడె

యొవ్రాసి నా వ్రాయకుండినావు

గుణితవేళలయందుఁ గోరి లాకేత్వంబు

దాకుఁ గొమ్మియ్యక తర్లినావు

ఒకటి పంక్తినివ్రాయు నూహ నేర్చిన నాడె
సున్నచుట్టక వ్రేలు చూపినావు
గణితవేళలనాఁడె ఘనయుక్తిగా నేర్పు
గురుకీర్తికిని బాలుగూర్చినావు

తే నిజకులాచారధర్మంబు నిర్వహించి
హెచ్చు గలయట్టిదాతవై హెచ్చినావు
సరసహృదయుండ వినుకొండ శాసనుండ!
భవ్యభరతుండ! రాయన భాస్కరుండ!

సీ సంగీత సాహిత్యసరసవిద్యల కిచ్చు
బహురూపులకు నిచ్చుఁ బట్టు కిచ్చు
పెండ్లి పేదల కిచ్చుఁ బేదవిప్రులకిచ్చు
బీదసాదుల కెల్లఁ బిలిచియిచ్చు
తిట్టవచ్చిన నిచ్చు దీవించఁగా నిచ్చుఁ
గొట్టవచ్చిన నిచ్చుఁ గొంటె కిచ్చు
బాచన్న! యననిచ్చు భాస్కరా! యననిచ్చుఁ
దేర బాచా యన్నఁ దిరిగి యిచ్చు

గీ మెచ్చి తగ నిచ్చు మెచ్చులుమెచ్చి యిచ్చు
వీడువాఁ డనకయె సొమ్ము వేడ నిచ్చు
మంత్రిరాయని భాస్కరామాత్యుఁబోలఁ
గలరె దాతలు మూడులోకములయందు?

సీ కదలియి ల్వెడలంగఁ గడప కాల్ దాఁకినఁ
దలపాగ పందిటఁ దగులుకొన్న
ఎందుఁబోయెద వన్న నేకవిప్రునిఁ గన్న
నొంటిరోదన మన్న నుండు మన్న
తగినచోఁ దుమ్మినఁ దంబళియెదురైన
వీడినతలవాని వీథిఁ గన్న
ఒలిమిడిమిక్కిలి యొంటికొమ్మెక్కినఁ
బులుఁగువీచినఁబొడపురుగుఁ గన్న

గీ మాన కేతెంచు నర్థిసమాజములకు
నిచ్చు నిష్టార్థవస్తువు లెలమితోడ
సరసహృదయుండు వినుకొండశాసనుండు
భవ్యభరతుండు రాయనభాస్కరుండు

సీ అతిథికోట్లకు నిల నమృతాన్నసత్రంబు
నంబలిసత్రంబు నాతురులకు
ఆచార్యులిండ్ల రామానుజసత్రంబు
నూనెసత్రము శిరస్స్నానమునకు
బాలకులకును నేర్పడఁ బాలసత్రము
కామసత్రము విటగ్రామణులకు
జలకమాడుట కింట జల స్పష్టి సత్రంబు
తాంబూలసత్రంబు ధన్యులకును
గీ కట్టడలు చేసె వినుకొండ పట్టణమున
సర్వకాలము సత్కారపూర్వకముగ
మంత్రి రాయనభాస్కరామాత్యుఁ బోల
గలరె దాతలు మూడులోకములయందు?

సీ నిత్యసత్యత్యాగనీతిలో శిబిఁ జెప్పి
నినుఁ జెప్పి మఱియును నినుఁ జెప్పి
బహుపరాక్రమమునఁ బరశురామునిఁ జెప్పి
నినుఁ జెప్పి మఱియును నినుఁ జెప్పి
రఘుకులోత్తముఁడైన రామచంద్రునిఁ జెప్పి
నినుఁ జెప్పి మఱియును నినుఁ జెప్పి
సుకుమారతను సరి సురరాజసుతుఁ జెప్పి
నినుఁ జెప్పి మఱియును నినుఁ జెప్పి
గీ చెప్పఁ దగుఁగాక యితరులఁ జెప్పఁదగునె?
కలియుగంబున నీవంటిఘనుడు కలడె?
అమితగుణసాంద్ర! మానినీకుముదచంద్ర!
భాగ్యదేవేంద్ర! రాయని భాస్కరేంద్ర!

ఉ	సన్నుతలీలఁ బాండవులసంతతిఁ గర్ణుఁడు దాత గాక వా
రన్నలు దమ్ములందు నొక రైన వదాన్యులు గారు; కీర్తిసం
పన్నునిరాయన ప్రభుని భాస్కరుసంతతి నెంచి చూడ వా
రన్నలు దమ్ములింటఁ గలయందఱు దాతలు భూతలమ్మునన్.

సీ	ఏవేళఁ జూచిన నిందిరానంద మై
		యందమై చెలఁగు నీమందిరంబు
ఏపాళఁ జూచిన గోపాలసత్కథా
		ఆందమై చెలఁగు నీ మందిరంబు
ఏజాముఁ జూచిన నిష్టాన్నభోజనా
		ఆందమై చెలఁగునీమందిరంబు
ఏప్రక్కఁ జూచిన సుప్రజానాయకా
		ఆందమై చెలఁగు నీమందిరంబు
గీ	గాక తక్కినమంత్రివర్గములయిండ్లు
మేకమెడచండ్లు గజిగాండ్ల మెఱుగుగూండ్లు
పూవుఁబోఁడులు నిర్మించుబొమ్మరిండ్లు
భవ్యవిభవేంద్ర! రాయని భాస్కరేంద్ర!

సీ	రంగత్కృపాదృష్టి గంగాభవానికి
		మణికంకణంబు లేమంత్రి యొసఁగె
భిక్షార్థ మీయఁగా నక్షయంబగునట్లు
		మార్తాండుఁ డర్థ మేమంత్రి కొసఁగెఁ
దగ వేడినంతలో జగతిపై నర్థికి
		మానంబుప్రాణ మేమంత్రి యొసఁగె
మీసంబు తాకట్టువేసి పదార్థంబు
		మహిమచే నర్థి కేమంత్రి యొసఁగె
గీ	అతడు సందవరీకవరాన్వయుండు
దుర్ఘటుండు వసిష్ఠగోత్రోద్భవుండు
శత్రుమథనుండు వినుకొండ శాసనుండు
భవ్యభరతుండు రాయనిభాస్కరుండు.

క వసుధేశుఁ గొల్వరాదో
పసగలమణియంబు చేసి బ్రదుకఁగరాదో
రససిద్ధిఁ బడయరాదో
రసికుఁడు కారాదు గాక రాయన బాచా!

క మీఁగాళ్ల బంటినీళ్లకు
వీఁగుదు రమ్మక్క యనుచు వెరపున వనితల్
చాఁగ పయోధులు దాటెను
రాఁగై నీకీర్తికాంత రాయని బాచా!

సీ ఉత్తుంగ భుజసూనుద త్తనందాపురీ
పుణ్యాగ్రహారాంశభోక్త యితఁడె
ఆజన్మ సంసిద్ధభూజన ప్రఖ్యాత
దానసింహాసనాధ్యాసి యితఁడె
కొండపల్లిరాజ్యమండలాఖిలమహా
గణకసందోహాగ్ర గణ్యుఁడితఁడె
వైకుంఠతీర్థనిర్వాణసంయమికృపా
సంవర్ధితాఖిలైశ్వర్యుఁడితడె
గీ కొండవీ డుద్దగిరి పెనుగొండ గుత్తి
పానుగ ల్విజయనగరపట్టణముల
యర్థులకునిచ్చు నితడె యిష్టార్థ మనుచు
జగమురాయనభాస్కరుఁ బ్రెగడఁబొగడు.

ఉ రాజతకీర్తి శాలి యగు రాయనిభాస్కరు వేఁడబోవఁగా
నాజికి నిట్లనుల్ బరునియాలికి నిట్లను నర్థికిట్లనుల్
దేజము పెంపులేని యతిదీనుని హీనుని వేడఁబోవగా
నాజికి నిట్లనున్ బరునియాలికి నిట్లను నర్థి కిట్లనున్.

చ సహజకళంకమూర్తులు కుజాతులు గూడతరోదయప్రభా
మహితులు గోత్రవిద్విషదమాత్యులు రాత్రి చరానుకూలధి
సహితులు మందవ ర్తనులు సర్పసమానులు రాజసేవక
గ్రహములు కాననయ్యె నల రాయనిభాస్కరుఁ డస్తమించినన్.

శ్లో. కృతేయుగే బలిర్దాతా త్రేతాయాం రఘునందనః

ద్వాపరే సూర్యపుత్రశ్చ కలౌ రాయనభాస్కరః

## నెల్లూరు వర్ణణ : నెల్లూరు పట్టణాన్ని వర్ణిస్తూ భీమకవి చెప్పిన పద్యాలు

సీ పాలించు నేవీట బ్రహ్మాదివంద్యుండు

లీల మూలస్థాన లింగగురుడు

దీపించు నేవీట దేవాలయంబులు

ధావళ్య నవసుధా ధౌతములుగఁ

బ్రవహించు నేవీట బ్రహ్మాండ కర్పరం

బొరసి మిన్నులు ముట్టనున్న పెన్న

చెలువందు నేవీట జిరకాలజీవన

స్వర్ణాల చెఱ్వు సంపూర్ణమగుచుఁ

గీ బ్రజలకును నున్కి సకల సంపదలకున్కి

భోగములవీడు సురపతిపురికి నీడు

నమ్మికలటెంకి వైరులఁ జిమ్ముకొంకి

భాగ్యనికరంబు నెల్లూరు పట్టణంబు

సీ ధీరుఁడై యేలెఁ దిరుకాళ దేవుండు

తిక్కనాయకుఁ డేలెఁ దేజమెసఁగ

మన్మసిద్ధనయేలె మహిమతో దీపించి

దాదినాగనయేలె ధర్మరీతి

మనుగొండుగోపాల మనుజాధి పతి యేలె

స్వర్ణ దేవుండతి ప్రభగనేలె

గోపినాథుండేలె గుణపయోరాశియై

రమణతో శ్రీరంగరమణుఁడేలె

గీ తిక్కనయు మఱియిక కొన్నదినము లేలె

నేలెమీతండ్రి మర్యాదలెల్లఁ గలుగఁ

గడక నీవేలి తందఱకంటె మించి

శరధిగంభీర! సంగమక్ష్మాతలేంద్ర!

సీ ఏపట్టణంబున నెన్నంగమున్నూట

యఱువది దేవాలయంబులుండ

ఏపట్టణంబున రూపింపనన్నియు

నీరేడు బావులింపారుచుండు

ఏ పట్టణంబుననెల్ల మానవులుఁ బ్ర

శస్తిఁగాంచిరి నెఱజాణలనఁగ

ఏపట్టణంబుననే కాలమును చెన్ను

కాల్వలచేత ముక్కాఱుఁబండు

గీ శివునికృపఁబుట్టె వేమాల శెట్టి బావి

పరగజగమెల్ల నెఱుఁగనేపట్టణమున

నట్టి పట్టణమిలను సౌఖ్యములకునికి

పట్టనందగు నెల్లూరు పట్టణంబు

సీ చరియించితినిగాని జగముమూలస్థాన

పరమేశ్వరునివంటి భక్తవరదు

విహరించితినిగాని వివిధభూములు వల్లి

కొంటనాధునివంటి కూర్చువేల్పు

పరికించితిని గాని బహు దేశము లనంత

పద్మనాభుని వంటి దివ్యమూర్తి

వీక్షించితిని గాని విశ్వమంతయుఁ బెన్న

నదివంటి దివ్యపుణ్యస్రవంతి

గీ అరిగితినిగాని దేశ దేశాంతరముల

వేదగిరివంటి పావనోర్విధరంబు

గాన నిన్ని విశేషముల్గలిగి ధరఁబ్ర

సిద్ధికెక్కెఁద్రి విక్రమ సింహపురము

నెల్లూరు పట్టణానికి విక్రమ సింహపురము అను పేరు కలదు.

సీ ఆపట్టణంబున సమరంగఁ దూర్పున

మాకందచందన మహితవనము

ఆ నగరంబున కటుదక్షిణంబునఁ

జెలువారు వేమాల సెట్టిబావి

ఆ యూరి పడమట నంభోజరాజివేఁ

బ్రాకటంబైన తటాకమమరు

నొప్పారు నవ్వీటి కుత్తరదిశయందు

మున్నీటి కనయైన పెన్నఁదనరు

గీ కలిమి నారాజధాని మార్గంబదెన్న

బహుళగంధర్వ సింధూర బంధురంబు

రతనపుం బొమ్మలప్పురి రమణులనఁగ

వినుతికెక్కెను నెల్లూరి విభవమహిమ.

శా మల్లెల్ మొల్లలు సేమమా? శుభములామాకందముల్ జాజులున్

మొల్లంబారక యుండునా? సుదతులున్ మోదంబువాటింతురా?

విల్లుం గోలలు వెస్కకుఁ మఱలునా? వేమాలనూయున్నదా?

నెల్లూరఁ బేదసోమ వీధిన కదా నీరాక జై హిత్ప కా

# భీమకవి కాలం - విశ్లేషణ

భీమకవి చాలా కాలము వివిధ రాజ్యాలు తిరుగుతూ, కవిత్వము చెబుతూ, ఎన్నో మహిమలను చూపారు. ఇలా మనకు పద్యాల్లో దొరికిన ఆధారాలు కొన్ని మాత్రమే. ఎందుకంటే భీమకవి ఆయా సందర్భాల్లో చెప్పిన చాటుపద్యాలు, ఆయా వ్యక్తుల కాలాలను పరిగణలోకి(ఆధారంగా) తీసుకుంటే పదకొండో శతాబ్దం మొదలుకొని దాదాపు నాలుగు వందల సంవత్సరాలకు పైగా వివిధ రాజ్యాలను తిరిగినట్లు తెలుస్తుంది. ఆట్టి సందర్భములో ఈయన జీవితానికి సంబంధించి మనకు దొరికిన ఆధారాలు చాలా కొన్నిగా భావించక తప్పదు. అంతేకాక ఈయన చూపిన మహిమల్లో మనకు తెలియనివెన్నో, ఈయనచే ప్రభావితం చేయబడినవారెందరో మనకు తెలియని వారు ఉన్నారు అన్నది ఆసక్తికర విషయం. ఈ విషయం అలా ఉంచితే, అయితే ఈయన తొలితరం తెలుగు కవి కావడం వలన, అంతేకాక ఒకే ప్రాంతానికి పరిమితము కాకుండా సంచారము చేస్తూ జీవించారు. వివిధ ప్రాంతాలలో ఈయన కావ్యాలను గురించి ఆనాటి కవులు పొగుడుతూ వ్రాసిన కావ్యాలు లభించాయి, కానీ ఈయన కావ్యాలు మాత్రం ఇంకా సంపూర్ణంగా లభించాల్సిఉంది(తాలప్రతుల నుంచీ బ్రౌనుగారు పేపరు ప్రతులను వ్రాయించాక, ఏ ప్రాంతాలలో ఏ ఏ గ్రంథాలయాలలో ఈయన కావ్యాలు మరుగున పడి ఉన్నయో దొరకాల్సిఉంది). కవిజనాశ్రయం అనే ఛందస్సు కొద్ది కాలము క్రిందట లభించి ప్రచురణకు నోచుకుంది. ఈయన జ్యోతిష్యగంథాలు ఒకటి రెండు ద్రాక్షారామప్రాంతాలలో లభిస్తాయి. గ్రంథాలయాల్లో మరుగునపడి ఇప్పటికి మాకు లభించిన కావ్యాల్లో కవిరాక్షసీయం ఒకటి. ఇంకా దొరకాల్సినవెన్నో, అవన్నీ త్వరలో లభిస్తాయని ఆశిద్దాం. చారిత్రకారులకు ఈయన వివిధ వ్యక్తులకు సమకాలికునిగా కనిపిస్తూ, వారందరి కాలాలను పరిగనలోకి తీసుకుంటే 400 ఏళ్ళకు పైగా జీవించినట్లు తెలుస్తోంది. అందువలన వారు నేటికీ వేములవాడ భీమకవి కాలనిర్ణయం చేయలేకపోయారు. లభించిన ఆధారాలలో ఒక్కొక్కరు ఒక్కొక్క బలమైన ఆధారమును చూపి, కొందరు 11వ శతాబ్ధము వాడని, మరికొందరు 12వ శతాబ్ధము వారని, కాదు 13వశతాబ్ధము వారని, 14వ శతాబ్ధము వారని వివిధ రకాలుగా నిర్ధారించారు. ఇది వారికి ఇప్పటికీ వీడని చిక్కుముడిగానే మిగిలిపోయింది. చరిత్రకారులు చూపిన ఆధారాలున్నందున, **భీమకవి** ఇన్ని సంవత్సరాలు సంచారము చేస్తూ గడిపారన్న విషయం నమ్మకతప్పదు. అంతేకాక సాక్షాత్తు పరమేశ్వరుని వరపుత్రుడు. పరమేశ్వరుని నుంచి ఆడింది ఆట పాడింది పాట అగు తిరుగులేని వరము పొందిన వారు, దైవాంశసంభూతుడూ కావడం వలన మనం ఇన్ని ఏళ్లు తిరిగాడన్నా ఆశ్చర్యపడాల్సినవసరం లేదు.

# మూలము

- మలకపల్లి పెదశేషగిరిరావు గారు రచించిన "**ఉద్దండ కవి వేములవాడ భీమకవి చరిత్ర**"
- జొన్నలగడ్డ వేంకట రాధాకృష్ణయ్య గారు రచించిన "**వేములవాడ భీమకవి చరిత్ర**"
- మద్దూరి శ్రీ రామమూర్తి కవిగారు రచించిన "**వేములవాడ భీమకవి చరిత్రము**"
- కందుకూరి వీరేశలింగంపంతులు రచించిన "**ఆంధ్ర కవుల చరిత్ర ప్రథమభాగము**".
- పుట్టపర్తి నారాయణ కవి గారు రచించిన "**ఆంధ్ర మహాకవులు**"
- వానపల్లి సత్యనారాయణాచార్య సిద్ధంతి రచించిన "**మహాకవి భీమన నాటకం**"
- వేటూరి ప్రభాకర శాస్త్రి గారి " **చాటుపద్యమంజరి** "

# శ్రీ వేములవాడ భీమలింగేశ్వరస్వామి

ద్వితియ భాగం

# కృతజ్ఞతాభివందనాలు

శ్రీ వేములవాడ భీమలింగేశ్వరస్వామి జీవిత చరిత్ర ద్వితీయ భాగానికి

కీలక సమాచారాన్ని అందించిన

**కీ.శే. శ్రీ మతి బెస్త సుబ్బమ్మ** గారికి

(కీ.శే. బెస్త మర్రిస్వామి గారి భార్య)

కృతజ్ఞతాభివందనాలు

ఇందులో.......

- వేములవాడ భీమకవి నుంచి
  శ్రీ వేములవాడ భీమలింగేశ్వరస్వామిగా
  అవతరించుట
- స్వామి వారు కొలువైన ప్రాంతాలు
- స్వామి వారు చూపిన మహిమలు

మొదటి భాగంలో భీమకవి, రచనాశక్తి ఏపాటిదో చదివాం, కవిగా ఎంతటి వైభోగాన్ని పొందారో చూసాం. ఇక ఇప్పుడు భీమకవి ద్వితియావతార సమయం అసన్నమైనది. ద్వితియావతారం ఏమిటి, స్వామి వారు మానవ రూపం నుంచి దేవుడిగా ఏలా అవతరించారో ఇప్పుడు చూద్దాం.

11వ శతాబ్దం, ప్రభవనామ సంవత్సరం, శ్రావణ మాసం, శుక్ల పంచమి, శుక్రవారము నాడు తూర్పుగోదావరి జిల్లాలో వేములవాడ అనే గ్రామాన, శ్రీ సోమనాథమాత్యుడు, శ్రీమతి మాచమ్మ దంపతులకు ద్రాక్షరామ భీమేశ్వరుడి అంశతో పుట్టిన బాలుడు, తాను పుట్టకమునుపే తండ్రిని పోగొట్టుకుని, తల్లినే, తండ్రిగా, గురువుగా, ప్రత్యక్షదైవంగా భావించి, అతి పిన్నవయసులోనే సకలవిద్యలను అవపోసన పట్టిన భీమన్న, తదనంతర కాలంలో వేములవాడ భీమకవిగా విశ్వఖ్యాతిని పొందారు. వీటికి సంబందించిన విషయాన్ని మనం మొదటి భాగంలో చదివాం.

ఒకసారి వేములవాడ గ్రామంలోని బ్రహ్మణుల ఇంటికి భోజనానికి వెళ్ళినప్పుడు తనకు భొజనం వడ్డించకుండా అవమాన పరిచినప్పుడు, వారికిబుద్ధి చెప్పడానికి "అన్నం అంత సున్నం అవ్వని, అప్పడాలు కప్పలుగా మారని" చెప్పిన మాటలతో మొదలైన భీమకవి మహత్యాల ప్రస్థానం భీమలింగేశ్వరుడిగా నేటికి అప్రతితహితంగా కోనసాగుతుంది.

తండ్రిలేని వాడని ఊరంతా ఎగతాళి చెస్తున్నా ఏనాడు భీమన్న భాదపడలేదు కాని నా తండ్రి మరణాంతరం పుట్టినందుకే కదా నా తల్లిని ఊరి నుంచి వెలేసారు, శివభక్తురాలైన తన తల్లికి ఏందుకు ఈ అవమానం అని మధనపడి తన తల్లి వద్దకు వెళ్ళి "అమ్మా నేను నా తండ్రి మరణాంతరం పుట్టినవాడిని అని అందరూ ఏగతాళి చెస్తున్నారు, శివ భక్తురాలైన నీవే దీనికి సమాధానం చెప్పాలి" అని తల్లిని ప్రాధేయపడగా అప్పుడు మాచమ్మ, భీమన్నతో ఇలా చెప్పెను "భీమన్నా దీనికి సమాధనం ఆ దక్షారామ భీమేశ్వరుడు మాత్రమే చెప్పగలడు, వెళ్ళి అడుగు అని " చెప్పిన వెంటనె దక్షారామమునకు వెళ్ళి భీమేశ్వరుడిని ప్రార్థించి, ప్రసన్నం చేసుకుని, తన జన్మవృత్తాంత్తాన్ని, ఆవశ్యకతను తెలుసుకుని మరలా వేములవాడకు వెళ్ళి, తన తల్లి పాదాలకు



నమస్కరించి, జరిగినదంతా చెప్పి, తన జన్మ ఆవశ్యకతను తల్లికి వివరించి, ఒప్పించి, భీమకవిగా సూమారు 400 సంవత్సరాలు(11వ శతాబ్దం – 14వ శతాబ్దం) రాజమహేంద్రవరం, నెల్లూరు, పావులూరు, తిరుచునాపల్లి, కావేరీతీర నగరము, చోళరాజ్యము, సామర్లకోట, , కళింగ, కాకతీయరాజ్యము, కొండపల్లి, పంచపాడు, యర్రగడ్డపాడు, హేలాపురం, వేలూరు, పెద వేంగిపట్టణం, పిఠాపురం, సెజ్జ నగరం, వంగదేశం, కోరుమిల్లి, గుడిమెట్ట, భీమవరం ఇలా వేములవాడ భీమకవిగా దేశాటం చెస్తూ, వివిధ రాజ్యాలు తిరుగుతూ, ప్రజాపరిపాలన, ఆధ్యాత్మిక చైతన్యం పట్ల ప్రభువులకు, ప్రజలకు అవగాహన కల్పిస్తూ, కవిగా భూత, భవిష్యత్, వర్తమాన కాలదులను ఆక్షరాలలో బందించి, తెలుగు, సంస్కృత భాషలకు పట్టం కట్టి, రచనలో తనకు ఏవరు సాటిరారని నిరూపించి, జగత్ ఖ్యాతిని పొంది, కవిరాక్షసుడిగా బిరుదాంకితుడైన తరువాత తన జన్మ ఆవశ్యకతప్రకారము, భీమలింగేశ్వరుడిగా అవతరించి సూమారు 300 సంవత్సరాలు (15వ శతాబ్దం-17వ శతాబ్దం) ఈ భూ మండలంపై నడియాడి చివరగా అనంతపురం జిల్లా, గడేకల్లు గ్రామంలో జీవసమాధి అయ్యారు.

వేములవాడ భీమకవి పేరిట వ్రాసిన పుస్తకాల్లో కేవలం కవిగా మాత్రమే, అందునా కొన్ని అంశాలనే పరిగణనలోనికి తీసుకున్నారు. శ్రీ వేములవాడ భీమలింగేశ్వరస్వామి అధ్యయన కేంద్రం వారి అధ్యయనం ప్రకారం వేములవాడ భీమకవి ద్వితియార్థంలో శ్రీ భీమలింగేశ్వరస్వామిగా అవతరించడంతో పాటు దేశాటంలో భాగంగా పలుప్రాంతాలలో తన మహిమలను చూపిస్తూ, భక్తుల కోరికలను నెరవెరుస్తూ…నమ్మి కొలిచిన వారి పాలిట కొంగుబంగారమై నిత్యపూజలను అందుకుంటున్నారు….

స్వామి వారు కోలువైయున్న కొన్ని ప్రాంతాలు

విజయనగరం జిల్లాలోని

- బొబ్బిలి మండలంలోని పరదా గ్రామం
- దొత్తి రాజేరు మండలం
- రామభద్రాపుర మండలంలోని కోటక్కి గ్రామం

శ్రీకాకుళం జిల్లాలోని

- ఇచ్చాపురం మండలంలోని బూదెహళ్ళి గ్రామం
- ఇచ్చాపురం మండలంలోని మసకాపురం గ్రామం
- పలాస మండలంలోని చిన్నబాదాం గ్రామం

పశ్చిమ గోదావరి జిల్లాలోని

- సత్యవోలు

గుంటూరు జిల్లాలోని

- నర్సారావు పేట

ప్రకాశం (ఒంగోలు)జిల్లా లోని

- గిద్దలూరు మండలంలోని కే.యస్. పల్లి గ్రామం
- పందలూరు మండలం

కడప జిల్లాలోని

- రాజుపాలెం మండలంలోని వెల్లాల గ్రామం
- రాజుపాలెం మండలంలోని పుష్పగిరి గ్రామం

కర్నాటక ప్రాంతం లోని

- చిత్రదుర్గం జిల్లాలోని  భీమ సముద్రం
- యాదగిరి జిల్లాలోని, శాహపూర్ తాలుక, నాయకల్ గ్రామం

- చిక్కాబళాపూర్ జిల్లా  కైవార
- కొప్పల్ జిల్లాలోని అంబమ్మ మఠం
- బళ్ళారి జిల్లాలోని  హంపి

కర్నూలు జిల్లాలోని

- కర్నూలు పట్టణం
- ఉయ్యూరు మండలంలోని కాటూరు గ్రామం,
- అలూరు మండలం
- చిప్పగిరి మండలంలోని రామదుర్గం గ్రామం
- చిప్పగిరి మండలంలోని బెల్డోణ గ్రామం

అనంతపురం జిల్లాలోని

- పెదపప్పూరు మండలంలోని ఏ. పప్పూరు గ్రామం
- పెదపప్పూరు మండలంలోని అశ్వర్థం  గ్రామం
- విడపనకల్లు మండలంలోని గడేకల్లు గ్రామం

ఇలా పలు ప్రాంతాలలో కొంత కాలము నివసిస్తూ భక్తులలో తన ఆధ్యాత్మికబోధనలతో, జ్ఞానబోధనలతో, మూఢనమ్మకాల పట్ల స్వామివారు గట్టిగా వ్యతిరేకించి, ఇవ్వన్నీ కేవలం మానవకల్పితాలు అని చెబుతూ, ఇక్కడ పుట్టుక-చావు మధ్యలో అంతా మిథ్య అంటూ వాస్తవికతను వివరిస్తూ భక్తులలో చైతన్యాన్ని తీసుకొచ్చేవారు. స్వామి వారు కుర్చున్న ప్రాంతంలోనే లింగాణ్ణి ప్రతిష్టించి, ఈ లింగాన్ని పూజించండి, సర్వకాల, సర్వావస్థలందు నేను ఈ లింగము నందునె కోలువై ఉంటాను అని చెప్పి ముందుకుసాగెవారు.

## స్వామి వారు కొలువైయున్న ప్రాంత విశేషాలు, అక్కడ చూపిన మహిమలు,

ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, తెలంగాణ, తమిళనాడు, కేరళ, మహరాష్ట్ర, ఉత్తరప్రదేశ్లలో భీమలింగేశ్వర స్వామి వారి దేవాలయాలు నిర్మించినట్లు పరిశోధనలు చెబుతున్నాయి, కానీ తరువాతి కాలంలో కొన్ని ధ్వంసం అయినట్లు, మరికొన్ని అలనాపాలన లేక చరిత్రలో కలిసిపోయినట్లు చారిత్రక పరిశోధనల ద్వారా తెలుస్తుంది.

అనంతపురము జిల్లా పెదపప్పూరు ప్రాంతాన అశ్వర్థభీమలింగేశ్వరస్వామి దేవాలయప్రాంతమున, కర్నూలు పట్టణంలో తుంగబద్ర నదీతీరాన భీమలింగేశ్వరస్వామి చాలా కాలము తపస్సు చేసినట్లు, పూర్వము ఇక్కడ స్వామి వారికి దేవాలయాలున్నట్లు, తదనంతరకాలంలో కాలగర్భంలో కలిసిపోయినట్లు చారిత్రక ఆధారలను బట్టి తెలుస్తుంది.

## అంబమ్మ మఠంలో నిత్యపూజలతో మహిమాన్వితమైన దైవంగా వెలుగోందుతున్న శ్రీ భీమలింగేశ్వరస్వామి వారు.

కర్ణాటక రాష్ట్రంలోని రాయచూర్ జిల్లా, సింధనూరు తాలుక, తుంగబద్ర నదీ తీరాన గల శ్రీ అంబాదేవి మఠం వద్ద కూడా కొంతకాలము నివసించారు. ఇక్కడ స్వామి వారికి ఒక దేవాలయము కూడా నిర్మించారు. అక్కడి ప్రజలు భీమలింగేశ్వరుడు ధ్యానినిమగ్నుడై కుర్చునే చోటు, భక్తులకు తన భోదనలు అందించే చోటున దేవాలయాన్ని నిర్మించి ఒక లింగాన్ని ప్రతిష్టించి శ్రీ భీమలింగేశ్వరస్వామిగా కొలుస్తున్నారు. ఇప్పటికీ ఆ దేవాలయంలో స్వామివారికి నిత్యపూజలు జరుగుతున్నాయి. లింగాయితులు ఆ దేవాలయానికి పూజాదివ్యవహారాలను చూసుకుంటున్నారు. ఈ ప్రాంతమున భీమలింగేశ్వరస్వామికి సంబంధించి ఒక కథ ప్రచారంలో ఉంది. భీమలింగేశ్వరస్వామి దేవాలయమును దర్శించినపుడు అక్కడివారు కొందరు స్వామి గురించి ఈవిధముగా చెప్పారు. అంబమ్మ దేవాలయంలో తిరునాళ్ళు జరుగుతున్న రోజుల్లో స్వామివారు అక్కడకు వచ్చారు. ఈ తిరునాళ్ళు ప్రతి ఏటా పుష్యమాసపౌర్ణమినాడు ఎంతో వైభవంగా జరుగుతాయి.

అంబమ్మ ఉత్సవాన్ని పురస్కరించుకుని పండితులు కొందరు పురాణకథలూ, ఉపన్యాసాలు, జ్ఞానభోదనలు చేస్తున్నారు. ఆ సమయంలో స్వామి వారు అక్కడే ఉన్నారు. అక్కడ చెబుతున్న పండితులలో కొంతమందికి పురాణాల పట్ల, శాస్త్రము పట్ల మరియు సంస్కృతభాషా పట్ల సరైన అవగాహన లేక కల్పిత కథలు చెబుతూ..పైగా మేము వైధిక శాస్త్రలలో నిష్ణాతులమని పండితులలో కొందరు చెప్పకుంటూ అసత్యబోధనలు చేస్తున్నారు. ఆధ్యాత్మిక సందేహాలకు సమాధానాలుగా కల్లబొల్లి మాటలను చెబుతున్నారు. ఇది స్వామి వారికి నచ్చలేదు. స్వామివారు వారి బోధనలను తప్పు పట్టారు. వారిని ప్రశ్నించారు. నలుగురినీ ఇలా తప్పదోవ పట్టించవద్దని హితువు పలికాడు.

అసత్యభోధనలు చేస్తున్న పండితులకు, తోడుగా అక్కడే ఉన్న మిగతా పండితులంతా జతకలిసి గుంపుగా చేరి ఈ ముసలతను ఇక్కడే ఉంటే తమ ఉనికికే ప్రమాదమని భయపడ్డారు. మరుసటి రోజు ఉదయం వారు స్వామిని పిలిచి "ఎవరవు నువ్వు? ఎక్కడినుంచి వచ్చావు?" అని అడిగారు. "నేను దక్షారామభీమేశ్వరుని వరపుత్రుడను వేములవాడ భీమలింగేశ్వరుడను" అని బదులిచ్చారు. ఏదో విధంగా అతన్ని ఇక్కడి నుంచి పంపివేయాలన్న ఉద్దేశంతో పండితులంతా కలిసి "మేము మీకు ఒక పరీక్ష పెట్టదలచాము. అందులో నెగ్గితేనే నీకు ఇక్కడ స్థానము, ఓడిపోతే ఇక్కడి నుంచి వెళ్ళిపోవాల్సి ఉంటుంది. మీకు సమ్మతమేనా?" అని అడిగారు. స్వామివారు "అందుకు నాకు సమ్మతమే. కానీ నేను నెగ్గిన తరువాత మీ అందరికీ కూడా ఒక పరీక్ష పెడతాను అందులో నెగ్గితేనే మీకు ఇక్కడ స్థానం" అని షరతు పెట్టారు.

మరుసటిరోజు జనులందరి మధ్య వారు తమ శక్తిని ప్రదర్శించి స్వామివారు తన పాండిత్యప్రకర్షణాన్ని పరీక్షించారు. సకలశాస్త్రపారంగతుడైన స్వామి సునాయాసంగా నెగ్గాడు. ఇప్పడు స్వామి వారి వంతు. స్వామి అందరినీ అక్కడ ఉన్న బావి దగ్గరకు పిలిచి ప్రజలతో కొన్ని చిన్న చిన్న రాళ్ళను తెప్పించారు. తనతోపాటు పండితులకు ఒక్కొక్క రాయిని ఇవ్వమని చెప్పారు. అందరి సమక్షంలో చూపించి వారివారి రాళ్ళకు గుర్తులు పెట్టి, అందరికీ చూపుతూ ఆ రాయిని ఒక్కొక్కరుగా ఈ బావిలోకి వేసెదము. ఎవరి రాయి అయితే నీటిపై తేలుతుందో వారికి మాత్రమే ఇక్కడ స్థానమని చెప్పారు. అక్కడి ప్రజలు, పెద్దలు అందుకు సమ్మతించిపై చెప్పిన ప్రకారము జరిపించారు. అలా బావిలో వేసిన రాళ్ళలో స్వామివారు వేసిన రాయి మాత్రము నీటిపై తేలినది. ఈ సంఘటన చూసి అందరూ ఆశ్చర్యపోయారు. ఇతడు

సాధారణ మానవుడు కాదని కొనియాడారు. ఆ ఊరివారు రోజు స్వామివారిని దర్శించేవారు, తమ తమ కష్టాలను స్వామివారితో విన్నవించుకొనేవారు. వారి సమస్యలకు పరిష్కారాలు దొరికేవి. స్వామివారిని ఇలవేలుపుగా, ప్రత్యక్షదైవంగా కొలిచేవారు. స్వామివారు ధ్యానంలో కుర్చొనేచోట ఒక దేవాలయమును నిర్మించారు. ఈ దేవాలయానికి తూర్పుముఖాన ఒక కిలోమీటరు దూరాన కొండను అనుకొని శ్రీబాగళాంబదేవి ఆలయము ఉన్నది. పడమర వైపున తుంగభద్రనది ఉన్నది

## స్వామి వారు బెల్డోణ చెరుట – అక్కడ చూపిన మహిమలు

స్వామివారు నాటి కందనవోలు నేటి కర్నూలు పట్టణంలో, తుంగభద్ర నదీతీరాన కోంత కాలం తపస్సును గావించారని, ఇదే జిల్లాకి చెందిన ఆలూరు పట్టణం, రామదుర్గం గ్రామాలలో కూడా కొంతకాలము తపస్సు గావించారని, తపస్సు గావించిన స్థలంలోనే స్వామివారికి ఆలయం కూడా నిర్మించారని చారిత్రక అధారాలు చెబుతున్నాయి. స్వామివారికి సంజీవమ్మ శిష్యురాలు అవకముందు, గడేకల్లు (గడియాద్రిపురము) చేరకముందు బెల్డోణ గ్రామములో చాలా కాలము ఉన్నారు. పెద్దల నుంచి చెప్పబడుతూ వచ్చిన కథనం ప్రకారం స్వామి వారు బెల్డోణ గ్రామమును దర్శించినపుడు మొఘలాయిలు (సూమారు క్రీ.శ 1690-1700 ప్రాంతంలో) ఏలుతున్న రోజులవి.

ఆ గ్రామంలో తిరుగుతూ ఎవరైనా పిలిచి అన్నము పెడితే తినేవారు. లేదంటే తినకుండానే ఉండేవారు. ఒకరోజు ఈ ఊరికి భూస్వాములుగా ఉన్న మారాతి వెంకప్ప ఇంటికి వెళ్ళారు. ఇంటి ఎదురుగా నిలబడి "అమ్మా నాకు ఆకలిగా ఉంది. అన్నం పెట్టవా? " అని స్వామి వారు అడిగితే, అప్పుడు మారాతి వెంకప్ప భార్య "ఇంట్లో అన్నము లేద"ని అబద్ధము చెప్పింది, ఇది తెలిసిన స్వామివారు ఆమె మాట పట్టించుకోకుండా ఆ ఇంటి ముందే నిలబడ్డారు. ఆమె భర్త మారాతి వెంకప్ప పొలము నుండి వచ్చాడు. ఆమె భర్తతో ఈ ముసలాయన అన్నం లేదన్నా పట్టించుకోకుండా పొద్దున్నుంచి ఇలానే నిలబడి ఉన్నాడని చెప్పింది. అతను తన భుజముపై ఉన్న చాలుకోలు తీసి "ఇక్కడి నుంచి వెళ్తావాలేదా" అంటూ స్వామి శరీరమంతటా వాతలు పడేలాకొట్టాడు. స్వామి మాత్రం నవ్వుతూ వెళ్ళిపోయారు.

స్వామి వారు అలా వెళ్ళారో లేదో వెంటనే ఆ మారాతి వెంకప్ప ఎన్ని దెబ్బలు కొట్టాడో అన్ని వాతలు అతని శరీరము మీదపడి ఎర్రగా కందిపోయాయి, అతనికి భరించరాని నొప్పి అవ్వడంతో వైద్యున్ని సంప్రదించి మందులు వాడాడు. అయిన ఫలితం కానరాకపోగా అతనికి మంటలు పదిరెట్లు ఎక్కువయ్యాయి.

చివరకు ఆ ముసలాయనను వెతికి పిలుచుకురమ్మని మనుషులను పంపారు. కానీ స్వామివారు ఎక్కడా కనపడలేదు. ఇక ఈ బాధను ఓర్చుకోవడం చేతకాక ఒక పిడిబాకుతో రొమ్ముకు గుద్దుకొని ప్రాణము తీసుకుందామని చేయి పైకి ఎత్తగా వెంటనే స్వామి \వారు అక్కడ ప్రత్యక్షమయ్యారు. అతన్ని ఆపారు. స్వామి వారి స్పర్శతో అతని శరీరము అంతా చల్లగా మారి యధాస్థితిని పొందింది. మారాతి వెంకప్ప స్వామివారికి సాష్టాంగ నమస్కారము చేసి "ఆసామిని అయ్యి ఉండి కూడా ఆకలి అంటూ వచ్చిన మీకు అన్నం పెట్టకపోగా దారుణంగా కొట్టాను. అందుకు నన్ను క్షమించండి" అని వేడుకున్నారు. ఆ రోజు నుంచి వారే స్వామివారి భోజనాదులు చూసుకొనేవారు. స్వామి వెంకన్న కుటుంబంతోనే ఉంటూ వారి ఇంట్లో పశువులను కాసేవారు. అప్పటి నుండి పశువులు పాలు బాగా ఇస్తూ, వారి పాడిపంటలు బాగా వృద్ధి చెందాయి.

ఒకసారి ఎప్పటిలాగే మొఘలాయిలు బెల్డోణ గ్రామమును ముట్టడించారు. ప్రజలనుండి డబ్బులు వసూలు చేస్తున్నారు. వారిని చూడగామే మారతి వెంకన్న తన ఇంటికి తలుపులు వేసుకున్నాడు. ఇది గమనించిన మొఘలాయిలు వెంకన్న ఇంటి తలుపులు బలంగా తట్టారు. వెంకన్న తలుపులు తీయలేదు. బలవంతంగా తలుపులు తీయడానికి ప్రయత్నించారు. అది జరగకపోవడంతో వారు మొండిపట్టుదలతో ఎన్ని రోజులని ఇలా తలుపులు వేసుకొని లోపలే ఉంటారో చూద్దాం అని ఆ ఇంటి బయటే డేరాలు వేసి మనుషులను కాపలా ఉంచారు.

నాలుగైదు రోజుల తర్వాత వెంకన్నఇంట్లో నీరు అయిపోయాయి. ఒక వైపు ఇంట్లోని పశువులు, పసిపిల్లలు త్రాగడానికి నీరులేక ఇబ్బంది పడ్డారు. తలుపులు తీసి మొఘలాయిల చేతిలో ప్రాణాలు విడువడం కన్నా మేమే ప్రాణాలు తీసుకొనుట మంచిదని ఆలోచిస్తున్న సమయానికి స్వామివారు ప్రత్యక్షమయ్యాడు. స్వామి వెంకన్నను మిద్దెపైకెక్కి అల్లెండ్ల(ధోనె) నుంచి నీరు పోకుండా వాటికి అడ్డంగా ఉంచి ఒకచోట రంధ్రం పెట్టమని చెప్పారు. అతను అలానే చేసాడు. అతను ఇంట్లోనికి రాగానే అందరూ ఆశ్చర్యపోయేలాగా ఆ ఒక్క ఇంటిపై మాత్రమే అద్భుతమైన వర్షం కురిపించారు. రంధ్రం గుండా ఇంటిలోపలికి వచ్చిన నీటిని వారు కడవలలోనూ, బిందెలలోనూ, ఎద్దుల తొట్టెలలోనూ నింపుకున్నాక వర్షం ఆగిపోయింది. మిగిలిన నీరంతా ఇంటివాకిలి నుంచి బయటకు ప్రవహించ సాగింది. ఆ నీరు మొఘలాయిల డేరాల క్రిందకు చేరింది. వర్షం పడిన జాడల్లేవు. కానీ నీరు మాత్రం పారుతోంది. వారికి ఏమయిందో అర్థం కాలేదు. ఆ నీటివెంటనే నడుచుకుంటూ వెళ్ళారు. వెంకన్న ఇంటి నుంచి వస్తున్న నీటిని చూసి "ఈ ఒక్క ఇంటిపై వర్షం కురవడమా?" అని ఆశ్చర్యపోయారు. ఊరి వారిని విచారించి భీమలింగేశ్వరుడనే ఒక ముసలితాత వారి ఇంట్లో నివసిస్తున్నారని, వెంకన్న కుటుంబం ఆ మహానుభావుని భక్తులని, వారి లీలల వల్లనే వెంకన్న ఇంటిపై మాత్రమే వర్షం కురిసిందనివారు తెలుసుకున్నారు. మొఘలాయిలు కూడా స్వామివారిని చూడదలచి వెంకన్న ఇంటి వద్దకు వెళ్ళి "అయ్యా! మిమ్మల్ని తాకే అంత శక్తి మాకు లేదు. మీరు నీటి కోసమైనా బయటకు రాకపోతారా అనుకున్నాము. స్నయానా ఆ భీమలింగుడే మిమ్మల్ని కంటికి రెప్పలా కాపాడుతున్నారని తెలిసింది. ఇంకా మీకు హాని కల్గించాలని తలిస్తే ఆ మహానుభావుని ఆగ్రహానికి గురి అవ్వాల్సిస్తుంది. ఇక తలుపులు తీయండి" అన్నారు. స్వామి వారు తలుపులు తీయమని చెప్పడంతో వెంకన్న తలుపులు తీసాడు.

మొఘలాయిలు "మహాత్మా వీరు మీ భక్తులని తెలియక వీరిని ఇబ్బంది పెట్టాము. మీ గురించి, మీ మహిమను గురించి విని మీ దర్శనము చేసుకోవాలని వచ్చాము." అని చెప్పి స్వామివారికి నమస్కరించి వెళ్ళిపోయారు.

గ్రామంలోని ప్రజలతో ఒక రోజు సాయంసంధ్యవేళ భక్తికి ఉన్న శక్తిని వివరిస్తూ...చివర్లో భక్తులారా ఇక ఇక్కడి నుంచి వెళ్ళే సమయం అసన్నమైనది అని చెప్పగా..భక్తులకు ఏమియును అర్థం కాలెదు...అప్పడు భక్తులు ఏమిటి స్వామి అని ప్రశ్నించగా ఇక్కడే మేము శాశ్వతముగా ఉండుటకు వీలులేదు, ఇది మా స్థానం కాదు అని చెబుతూ... మేము తపస్సు గావించిన స్థలంలో మా పళ్ళతో తోమిన వేపపుల్లను నాటుతాం అది ఎక్కడైతే చిగురిస్తుందో అక్కడ మేము జీవసమాధి పొందాలని సంకల్పించాం అని చెప్పగానె అక్కడ ఉన్న ఆశేశ భక్త వాహిని ఒక్కసారిగా మూగబోయింది, ఓం నమో శ్రీ భీమలింగేశ్వరాయ నమః, జై భీమలింగ, ద్రక్షారామ భీమేశ్వర వరపుత్ర పాహిమాం అంటూ భక్తులప్రార్థనలు, అర్థనాదాలు మిన్నంటాయి. అప్పడు స్వామివారు ఒక్క నిమిషం మేము చెప్పేది విన్నండి. ఇదిగో నా పాదుకలు, ఈ పాదుకలు ఉన్నచోట నేను ఉంటానని, నన్ను నమ్మి కొలిచినవారి కష్టాలను తీరుస్తానని అభయమిచ్చి" వెళ్ళారు. తరువాత మారాతి వంశస్థులు ఆ పాదుకలను సమాధి చేసి స్వామివారికి ఒక ఆలయం కట్టించి నిత్యధూపదీపనైవేద్యాలతో పూజలను జరిపించేవారు. అప్పట్లో స్వామివారు బస చేసిన మారాతి వెంకన్న వంశంవారు దేవాలయబాధ్యతను నిర్వహించేవారు, పూజారులుగా వ్యవహరించేవారు. కొన్ని సంవత్సరాల తరువాత స్వామి వారు గడియాద్రిపురం (నేటి గడేకల్లు)ల్లో జీవసమాధి నోందారు అని విన్న బెల్డోణ గ్రామ ప్రజలు, అందరూ కలిసి స్వామి వారి దర్శనార్థం గడేకల్లుకు బయలుదేరి వెళ్ళారు. అక్కడికి వెళ్ళిన బెల్డోణ గ్రామవాసులకు స్వామి పుజారులుగా ఉన్న బెస్తవారు సాధర స్వాగతం పలికారు. గడేకల్లు గ్రామంలో జీవసమాధినోందిన వృత్తాంత్తాన్ని స్వామివారి పూజారులు బెల్డోణ వాసులకు వివరించారు. స్వామి వారి జీవసమాధి వృత్తాంత్తాన్ని విన్న బెల్డోణ గ్రామవాసులు...మా గ్రామంలో కూడ మీరే స్వామివారికి పూజారులుగా వ్యవహరించాలి అని విన్నవించుకోగా... స్వామివారి పూజారులు

అంగీకరిస్తూ...మేము ఏదైతే ఆహారంగా భుజిస్తామో అదే స్వామి వారికి నైవేద్యం పెడుతాం, బ్రహ్మణుల మాదిరిగా అర్చకత్వం చేయలేము, అని చెప్పగా...అయ్యా మీరు సాక్షాత్ భీమలింగేశ్వరుడి అంశం అయిన ఫక్కీరప్ప వారసులు, మీరు పెట్టిందే నైవేధ్యం, మీరు చెప్పిందే మంత్రం, ఇందులో ఏటువంటి అనుమానం అక్కర్లేదు, పైగా మా గ్రామంలో తొలి పంటను మీకు సమర్పించుకున్నాకే మేము పంటను వాడుకుంటాం, అంతేగాకా మీకు మా గ్రామంలో పొలాన్ని కూడ ఇస్తాము, ఒక్క మాటలో చెప్పాలంటే మిమ్మల్ని మా గురువులుగా గౌరవిస్తాం, మీ జీవనభుక్తి మా భాధ్యత అని బెల్దోణ గ్రామప్రజలు స్వామివారి పూజారులకు తెలిపిరి. వీటన్నింటికి స్వామివారి పూజారులు అంగీకరించి, దశలవారిగా బెల్దోణ గ్రామంలో స్వామివారికి పూజాధికార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

స్వామివారు భీమేశ్వరుడి అంశతో పుట్టడం వల్ల సోమవారము ప్రత్యేకమైన రోజుగా భావిస్తారు. బెల్దోణ గ్రామంలో ప్రతి ఏడాది చైత్రమాసములో పౌర్ణమిరోజున స్వామివారి రథోత్సవము ఎంతో వైభవంగా జరుగుతుంది. అంతేగాక స్వామి జన్మదినమైన శ్రావణ శుక్ల పంచమి రోజున స్వామివారికి ప్రత్యేక పూజా కార్యక్రమాలు జరుగుతాయి.

## చాబాల గ్రామం – సంజీవమ్మ శిష్యరికం

స్వామివారు ఊరూరు తిరుగుతూ, తనకిష్టమైన చోట ఒకటి రెండు రోజులు ఉంటూ వేరే పల్లెలకు వెళ్తూ ఉండెను. అలా అనంతపురము జిల్లాలోని చాబాలా అను గ్రామమునకు వచ్చి అక్కడ కొన్ని రోజులు ఉన్నారు. పెద్దలు చెప్పిన కథనం ప్రకారం స్వామివారు ఒకరోజు కొన్ని మాంసపుముక్కలను తీసుకొని లింగాయతులు నివసించు వీధిలోని ఒక ఇంటిలో విసిరేశాడట. ఇది చూసిన వీధిలోని వారు "ఎవరో పిచ్చివాడు మాంసపుముక్కలను జంగమవారింట్లో వేశాడట" అని చెప్పుకుంటుండగా, ఆ ఇంట్లోని వారు ఇల్లంతా వెతికారట. ఆశ్చర్యంగా వారికి మాంసపుముక్కలకు బదులు నాలుగు "సిద్దోటము" పండ్లు దొరికాయట. ఆ పండ్లు ఘుమఘుమలాడే వాసనతో ఆ ప్రదేశమంతా వ్యాపించెనట. ఆ ఇంటివారు ఆ పండ్లను ఇంటి బయటికి తెచ్చి అందరికీ చూపుతూ, మీరంతా మంసపుముక్కలంటున్నారు, కానీ విసిరినది ఈ పండ్లను చూడమనిరి. అపుడు వీధిలోనివారు "అయ్యా! ముసలాయన విసిరినపుడు మేము కళ్ళారా చూసాము. అవి మాంసపు ముక్కలు.కానీ అవి "సిద్దోట పండ్లుగా ఎలా మారాయో ఏమో ఏం మహిమ చేసినాడో " అని ఆశ్చర్యంగా చెప్పుకోసాగారు.

స్వామి వారు భక్తులు అడిగినదానికి సలహాలిస్తూ, అనారోగ్యాన్ని తనచేతి స్పర్శతో నయము చేస్తుండెను. ఎన్నో రోజుల నుండీ నయం కాని ధీర్ఘవ్యాధులు సైతము స్వామివారి కరస్పర్శతో నయమయ్యేవి. కొంతమంది "మాకు సంతానము లేదు స్వామి. ఎన్ని చోట్ల తిరిగినా కలుగలేదు" అని అడిగే వారు. అపుడు స్వామి "మీకు సంతానము కలుగుతుంది" అని ఆశీర్వదించి పంపేవారు. స్వామి పలికిన పలుకులు పొల్లుపోకుండా జరుగుతుండడం చూసిన గ్రామస్థులు స్వామివారి గొప్పతనమును కీర్తిస్తూ, ఎక్కడకూ వెళ్ళనీయక తమ గ్రామముననే ఉంచుకొనిరి. ఆ ఊరిలో అందరూ చిన్నపిల్లలు మొదలుకొని పెద్దవారిదాకా స్వామివారితో, వారివారి బాధలను చెప్పుకుంటూ, ఉపశమనము పొందుతూ, స్వామి వారినే దేవునిగా భావిస్తూ, పాలూపండ్లూ తెచ్చిస్తూ ఉండేవారు. చిన్నపిల్లలకు గ్రహబాధలు, ఇతర వ్యాధులు కల్గినపుడు స్వామి దగ్గరకు తీసుకు వెళితే, స్వామి వారిని తాకిన వెంటనే ఆ పిల్లలు సంతోషంగా నవ్వుతూ తిరిగి వెళ్ళేవారు.

గురువు త్రిమూర్తి స్వరూపుడు. నిరాకారుడైన భగవంతుడు సాకారుడై సద్గురువు రూపంలో భూమిపై అవతరిస్తాడు. తల్లిదండ్రులు తనువునిస్తారు. పెంచి పోషిస్తారు. కానీ ప్రారభ్ధాన్ని తప్పించలేరు. కానీ సద్గురువుల అనుగ్రహానికి పాత్రులైనవారు ఈ కష్టనష్టాలను అధిగమించగలరు. కల్పవృక్షమూ, కామదేనువూ కోరినవి మాత్రమే ఇవ్వగలవు. గురువు వాటితో పాటి ముక్తిని కూడా ఇవ్వగలడు. గురువు లేకుండా మోక్షం కలుగదు. గురువు మూలంగానే సదసద్వివేకము, భక్తి వైరాగ్యాలు, జ్ఞానము, వాటిద్వారా మోక్షము సిద్ధిస్తుంది. అట్టి సద్గురువును సేవించిన ఆదర్శశిష్యురాలు సంజీవమ్మ. ఈమె దృఢమైనభక్తి, అచంచలవిశ్వాసములతో త్రికరణశుద్ధిగా శ్రీ వేములవాడ భీమలింగేశ్వరస్వామిని సేవించింది. పూజించింది. సూర్యచంద్రులున్నంత కాలం, స్వామి పేరు నిలుచున్నంతకాలం చిరస్థాయిగా నిలిచి పూజలందుకొనేలా వరము పొందింది.

చాబాల గ్రామంలో బెస్తకులానికి చెందిన సంజీవమ్మ అను ఆమె ఉండేది. ఆమెకు పరమేశ్వరుడంటే అపారమైన భక్తి. ఊరి వారందరూ స్వామివారి మహిమను కీర్తించడం విని ఆమె ఆ మహానుభావుని ఒకసారి చూడడానికి స్వామి వద్దకు వెళ్ళింది. స్వామి వద్దకు వచ్చిన భక్తులు తమతమ సమస్యలను ఒకరి తర్వాత ఒకరు చెప్పుకుంటుండగా, ఆమె స్వామితో మాట్లాడ్డమాలస్యమయ్యింది. ఈ సమయమంతా స్వామివారి దివ్యతేజస్సును

చూస్తూ నోరు మెదపక నిలబడింది. చివరికి స్వామివారి దగ్గరకు వెళ్ళి పాదాభివందనం చేసి ఏమీ మాట్లాడక నిలబడి ఉండెను. అప్పుడు స్వామి సంజీవమ్మను చూసి "నీవు మనసులో ఆందోళన పడుతున్నావు. ఏమీ ఫర్వాలేదు. నిదానముగా ఉండమనెను. స్వామివారి వాక్కులు వేదవాక్కులుగా తోచి, సంజీవమ్మ ఒక పక్కగా నిలబడి ఉండెను. అపుడు భార్యాభర్తలు నెల పిల్లవాన్ని ఎత్తుకువచ్చి స్వామివారి పాదాల చెంత పరుండబెట్టి, స్వామీ మీ వరంతో పుట్టిన ఈ బిడ్డకు మీరే నామకరణముచేసి ఆశీర్వదించమని వేడుకొనారు. స్వామి ఆ బాలునికి భీమన్న అని నామకరణం చేసి ఆశీర్వదించి వారిని పంపారు. ఇదంతా చూస్తూ నిలబడిన సంజీవమ్మను, స్వామి పిలిచి ఏమి కావలెనమ్మా? అని ప్రశ్నించారు. అపుడామె "స్వామీ! మీ దర్శనభాగ్యము కలిగినది. ఇంక నాకేమి కావలెను. మిమ్మల్ని చూస్తూంటే సక్షాత్తు ఆ పరమేశ్వరున్ని చూసినంత ఆనందము కలిగినది. పోయి వచ్చెద"నని చెప్పి వెళ్ళిపోయింది. ఇంటికి వెళ్ళిన సంజమ్మకు ఏ దేవుని పటము చూసినా స్వామి రూపమే గోచరించేది. ఒకరోజు సంజీవమ్మకు స్వప్నములో పరమేశ్వరుడు కనిపించి కొద్ది సేపటికి స్వామి రూపముగా కనిపించాడట. అప్పటి నుంచి ఆమె పరధ్యానంగా ఉంది. ఇది చూసిన కొడుకులు "అమ్మా! కొద్ది రోజులనుంచి నీవు పరధ్యానముగా ఉంటున్నావు. పిలిచినా పలుకవు. గట్టిగా పిలిస్తే 'ఆ' అంటావు. కారణమేమిటని అడిగారు. అప్పుడు ఆమె భర్త " మీ అమ్మకు ఊరిలో స్వామివారిని దర్శించినప్పట్నుంచి పరమేశ్వరుని రూపము కనిపిస్తోందట" అని చెప్పి స్వప్నములోని వృత్తాంతమును కూడా చెప్పాడు. అప్పుడు సంజీవమ్మ " అవును నాయనా! ఈ సంసారమూ, బంధములూ ఏవీ మనసుకు రావట్లేదు. వేదాంత ధోరణితో మనసంతా నిండిపోయింది. ఏపని చేయడానికీ మనసు అంగీకరించట్లేద "ని చెప్పి పరధ్యానములో మునిగింది.

ఇలా కొంతకాలము తర్వాత స్వామివారు చాబాల నుంచి వెళ్ళిపోవడానికి నిశ్చయించుకున్నారు. ఈ విషయం తెలిసిన సంజమ్మ చాలా బాధతో నాకు భర్తా, కొడుకులూ కోడల్లతో " నాకు ఈ సంసారబంధములు వద్దు. ఇన్నేళ్ల నా పూజలు ఫలితంగా సాక్షాత్తు సకలలోకాలకూ తండ్రి అయిన పరమేశ్వరుడే నాకు దర్శనభాగ్యమిచ్చారు. ఈ మిగిలిన జీవితం ఆ భీమలింగేశ్వరుని సేవతో తరించాలనుకుంటున్నాను. ఆ మహానుభావునికి శిష్యురాలిగా, నేను కూడా ఆయన వెంట వెళ్తానని" చెప్పింది. ఇక ఆమె భర్త కూడా సంజమ్మ మనము ఎంత చెప్పినా వినదని స్వామి దగ్గరకు పిలుచుకు వచ్చి జరిగిన విషయమంతా స్వామివారికి చెప్పారు. స్వామివారు సంజీవమ్మతో "అమ్మా! పిల్లలను,కోడల్లనూ భర్తను వదిలి రావడము నీకు క్షేమము కాదు. మేము ఒక చోట స్థిరముగా నివసించే వారము కాదు. మా గమ్యస్థానమును చేరుదాకా మా ప్రయాణము ఆగదు. మా మాట విని నీవు భర్త పిల్లలతో ఉండమ్మ" అని చెప్పి వారించారు. అయినా సంజీవమ్మ మాట వినకపోవడంతో ఇక చివరకు చేసేదేమీ లేక ఆమె భర్త పిల్లలూ స్వామివారి దగ్గరకు వచ్చి "స్వామీ మా అమ్మ ఎవరు చెప్పినా వినదు. మీ శిష్యురాలుగా ఉండడానికి నిశ్చయించుకున్నది. దయచేసి మీ శిష్యురాలుగా స్వీకరించండి. ఎక్కడ ఉన్నా ఆమె సంతోషము, క్షేమమే మాకు ముఖ్యము" అని చెప్పారు. స్వామివారు కొంతసేపు ఆలోచించి "ఈమె నా శిష్యురాలుగా సూర్యచంద్రులు ఉన్నంత వరకు కీర్తించబడుతుంది. మీరు కూడా పిల్లా పాపలతో ఉన్నతస్థాయికి ఎదిగి మీ కుటుంబము వృద్ధి చెందుతుంది" అని వారిని ఆశీర్వదించి వెళ్ళిపోయారు. ఆ తరువాత స్వామి వారు శిష్యురాలిగా సంజమ్మకు ఎన్నో పరీక్షలు పెట్టాడు. తిండి తిప్పలు పట్టించుకోకుండా, కొండలూ, గుట్టలూ ఎక్కుతూ దిగుతూ, ముళ్ళదారులూ దాటుకుంటూ పరుగులు తీసాడు. సంజమ్మ అన్నిటికీ తట్టుకొని స్వామివారిని అనుసరించింది.

## స్వామివారు గడేకల్లు చేరుట

చాబాల నుంచి మొదలైన కాలినడక పుణ్యప్రదమైన గడేకల్లు చేరి చౌడమ్మ కొండకు కొంతదూరంగా ఉన్న చెరువు గుంట వద్ద దాకా సాగింది. అక్కడ నివాసస్థలమును ఏర్పరచుకొని ఉండెను. సంజమ్మ స్వామివారి భోజనానికి కావలసిన వంటపదార్థాల కోసం గ్రామానికి వస్తూ పోయేది. ఇది గమనించిన ఊరివారు సంజమ్మను ఎవరు మీరని ఎక్కడినుంచి వచ్చారని విచారించారు. సంజమ్మ "ద్రాక్షారామ భీమేశ్వరుని వరప్రసాది వేములవాడ భీమలింగేశ్వరుడు ఈ ఊరి చివరనున్న చెరువు గుంత వద్ద విడిది చేసారు. నేను ఆయన శిష్యురాలిని. స్వామిసేవ నిమిత్తమై నేనూ ఇక్కడే ఉంటున్నానన్నది. అప్పటికే స్వామి మహిమలను, ఆ నోటా ఈ నోటా విన్న గ్రామప్రజలు, స్వామి తమ వూరికి వచ్చారని విని, వారిని చూడానికి వచ్చారు. స్వామితో మీకేమైనా కావలసినచో సమకూర్చెదము అని చెప్పారు. స్వామివారు తన దర్శనానికి వచ్చేవారికి భగవంతుని ఓన్నత్యాన్నీ, భగవంతున్ని ఎలా ఆరాధించాలో, ఎలా బ్రతకాలో చెప్పేవారు. పిల్లలకు, పెద్దలకు జ్వరాలు వచ్చినా స్వామిని అశ్రయించేవారు. ఆయన మాటలను తూచాతప్పకుండా పాటించేవారు.

# మెండి గోడపై స్వారి చెయడం

ఇలా స్వామి వారి గురించి ఆ నోటా ఈ నోటా ప్రజలు చెప్పుకొనుచుండగా గడేకల్లుకు ఈశాన్యమున 10 మైళ్ళదూరాన చిప్పగిరి అను గ్రామము ఉంది. ఆ గ్రామములో పీరుజాతివారు కొన్ని తాంత్రిక విద్యలయందు ప్రసిద్ధి. స్వామి వారి పేరుప్రఖ్యాతులు విన్న వీరు, అసూయతో ఈతను చాలా ప్రసిద్ధి చెందుచున్నాడు, కావున ఇతనిని ఎలాగైనా భంగపరచి, అడ్డుతొలగించుకోవలెనని లేనిచో తమ కీర్తి తగ్గిపోవుననీ భయపడి కుతంత్రము పన్నిరి. అది ఏమనగా వీరు ఒక మల్లెపూలవస్త్రమును పుష్పములతో తయారుచేసి అందులోని ప్రతి మల్లెపువ్వులో తము నేర్చిన యావత్తు తంత్రవిద్యను కల్పించి, ఈ మహాత్ముని సన్నిధానమునకు రావడానికి గాను ఒక పెద్దపులిని వాహనముగా, అధిరోహనము చేసి పల్లెంలో తాము తయారు చేసిన మంత్రపూరితమైన వస్త్రాన్ని ఉంచుకొని, అంగరంగవైభవంగా మేళతాళాలు సూర్యచంద్ర సురిటీలూ, నగారాలతో గడేకల్లు బయలు దేరారు.



వీరు మార్గమధ్యమున ఉండగానే, స్వామి తన దివ్యదృష్టితో గమనించి, సంజీవమ్మను పిలిచి "సంజీవి! చిప్పగిరిగ్రామము నుండి నన్ను సత్కరించడానికి పీరుజాతివారు వస్తున్నారు. వారికోసం పొలం వెనుకపడి ఉన్న సద్దచొప్పను తీసుకు వచ్చి ఉంచమని" చెప్పి, గ్రామస్థులు కొద్ది మంది చూస్తుండగా స్వామివారు ఒక మొండిగోడపై కూర్చొని వాయువేగమున పీరుజాతివారికి ఎదురేగి గ్రామానికి ఆహ్వానించారట. అంతలో సంజీవమ్మ సద్దచొప్పను కుప్పగా వేసి ఉంచెనట. అప్పడు పీరు జాతివారు, స్వామి మీ కోసము పూలవస్త్రమును తెచ్చామన్నారు. మీరు దీనిని ధరించవలెనని కోరినారు. మరియు ఒక జాడీ సారాయి తెచ్చి పుచ్చుకోగలరా అని అడిగారు. అప్పడు స్వామి వారు ఆ సారాయి మొత్తమూ తాగినారట. స్వామి మత్తులో ఉన్నరని తలచి, ఒక మణుగు సీసమును బాగా కాంచి దీనిని కూడా త్రాగగలరా? అని స్వామివారి నోటి యందు పోయడానికి ప్రయత్నించారట. స్వామివారు సరే అని నోరు తెరిచారట. అక్కడి గ్రామస్థులు "స్వామీ! ఆ సీసమ్మును త్రాగవద్దని" ప్రార్థించారట. అప్పడు స్వామివారు వారిని భయపడవద్దని చెప్పి ఆ సీసమంతయూ త్రాగారు. మంచి భోజనము చేసిన వారివలె త్రేపుచూ సీసమును యావత్తూ పీరుజాతివారు చూస్తుండగానే, మూత్రస్థానము నుంచి విడిచెనట. ఆ సీసము ముందు ఎలాగున్నది అలాగే ఉండటం చూసి తమ పాచికలు పారనందుకు కలత చెంది, చివరి ప్రయత్నంగా తమతో తెచ్చిన మంత్రపూరితమైన పూలవస్త్రమును స్వామివారిపై కప్పినారట. అప్పడు స్వామివారు సంజమ్మను కుప్పగా పోసిన సద్దచొప్పను అంటించమని చెప్పారు. స్వామివారు ఆ వస్త్రముతో పాటు మంటలో కుర్చొన్న వెంటనే ఆ మంట యందు ఛిటపటమని శబ్దం చేస్తూ అనేకములుగా ధ్వనించుచుండగా, ఆ వస్త్రముతో పాటి వారితంత్రవిద్యలు యావత్తూ భస్మీకృతమయ్యెను. పీరుజాతివారి శక్తిహీనులై, విద్యలన్నీ కోల్పోయినవారై, ఈ మహాత్ముని సామర్థ్యమును తెలుసుకుని, మంటలో కుర్చొని ఉన్న స్వామికి సాష్టాంగ నమస్కారమును చేసి క్షమించమని ప్రాధేయపడ్డారు."

పీరుజాతివారు తమ తప్పని తెలుసుకుని మహాత్మా! మేము చేసిన అపరాధములను మన్నింపుము. మీరూ కూడా మాలాగా మంత్రవిద్యవల్లనే మహిమలు చూపుతున్నారని భావించి, మిమ్ము భంగపరచదలచితిమి. పొట్టకూటి కోసము చేసే విద్యలు మీ ముందు సాగవని తెలిసింది. మేము మూఢులము. మమ్ము కాపాడండి" అని స్వామి వారిని

ప్రార్థించిరి. అప్పుడు ఆ మహాత్ముడు మంటల నుండీ బయటకు వచ్చి, వారి యందు దయతో, క్షమించి, వారి జీవనోపాధి కొరకు కొంత విద్యను ప్రసాదించి పంపి వేశారట. వారు భక్తితో రెండు నగారాలను(నేటికీ దేవాలయములో ఉన్నవి) ఒక గుర్రమును కానుకగా సమర్పించుకున్నారు. ఈ నగారాలు నేటికీ స్వామివారి దేవాలయములో కనిపిస్తాయి. ఈ మహాత్మ్యమును గాంచిన గ్రామప్రజలందరూ, భీమలింగేశ్వరస్వామిని భక్తి శ్రద్ధలతో పూజించసాగారు.

## తంబరహళ్ళి కరణం గారికి సంతాన భాగ్యమును కలుగచెయుట

రాయచూర్ జిల్లాలో "తంబరహళ్ళి" అను గ్రామము కలదు. ఆ గ్రామమునకు కరణముగా ఉండిన బ్రాహ్మణ వంశస్థులు వీరప్ప అను అతనికి సంతానము లేకపోయెను. వీరప్ప ఎన్నో విధాలుగా దైవకార్యాలు చేసిననూ, దేవతలను ప్రార్థించిననూ సంతానము కలుగలేదు. వారు ఇక తమకు సంతానం కలిగే భాగ్యమే లేదా అని బాధపడేవారు. అపుడు భీమలింగేశ్వరస్వామి వారి మహిమల గురించి అక్కడక్కడా చెప్పుకొనడం విని వారు గడేకల్లుకు వచ్చారు. స్వామివారితో తమ ఆవేదన చెప్పి సంతానము కోసం వేడుకున్నారు. అంతటా స్వామి వారిని ఆశీర్వదిస్తూ సంతానప్రాప్తి తప్పక కలుగును (సంతాన సిద్ధి ప్రాప్తిరస్తూ) అని దీవించి, తన వద్ద ఉన్న ఒక అరటిపండును తీసి కరణం భార్యకు ఇచ్చారు. భార్యాభర్తలిరువురూ స్వామి వారికి పాదాభివందనము చేసి వెళ్ళిపోయారు. తరువాత కొంతకాలానికి వీరప్ప భార్య గర్భమును ధరించినది. నవమాసాలు నిండిన తర్వాత ఒక పుత్రుడిని ప్రసవించింది. స్వామి అనుగ్రహము వలననే సంతానము కలిగినందుకు ఆ అబ్బాయికి స్వామివారి పేరైన "భీమలింగ" అని నామకరణము గావించారు. తమ కోరిక నెరవేరినదని తమ యోగ్యతకు తగిన విధంగా సత్పురుషులకు దానధర్మాలు చేసి చాలా ఆనందముగా ఉండేవారు.

# గడేకల్లు గ్రామములో సచ్చిన ఎనుమును బ్రతికించడం

గడేకల్లు గ్రామము నందు శివాచార మతస్థులు(లింగాయతులు), "దివాణము వారు" అను వారు చాలా దైవభక్తి కలవారు. వీరి ఇంట్లో ఎప్పటికి పాడి తప్పక ఉండును. ఈ ఇంట ఒక పుణ్యాత్మురాలు "దివాణం బసమ్మ" అను ఆమె ఉండేది. స్వామివారు ఆ గ్రామానికి వచ్చినప్పటి నుండీ రోజూ ఎనుము పాలు ఇచ్చుచుండెను.



ఒక దినం స్వామివారు పాల కొరకు వచ్చేలోపు ఎనుము పాలు పిండాలని చూడగా ఎనుము పాలు ఇవ్వకపోయినది. తర్వాత స్వామి వచ్చి పాలు త్రాగడానికి ఇవ్వమని అడుగగా ఆమె స్వామీ ఈ దినమున ఎనుముకు ఏమయ్యిందో పాలు ఇవ్వలేదు. స్వామివారు ఎందుకు ఇవ్వలేదు అని బసమ్మను అడుగగా " ఆమె ఎందుకో దానికి ఏం పొయ్యే కాలము దాపురించిందో ఏమో?. ఇవ్వలేదు" అని చెప్పింది. అందుకు స్వామి వారు "నీ ఎనుముకు పొయ్యే కాలము వచ్చిందా? పోనీలెమ్మని" వెళ్ళిపోయెను.

స్వామి వెళ్ళిపోగానే గాటికి కట్టిన ఆ ఎనుము తనంతట తానే పడి చనిపోయింది. అంతటా ఆమె ఇది ఏమి అన్యాయమూ, ఈ స్వామి నీ ఎనుము పోనీలెమ్మని వెళ్ళిపోయిన వెంటనే ఎనుము సచ్చి పడిందని స్వామివారి కోసము వెతక సాగింది. ఎక్కడ చూసినా ఆయన కనపడక పోవడంతో ఆ సచ్చిన ఎనుమును గారె వాడికి ఇచ్చివేసింది. అప్పడు సాయంత్రము అవ్వడంతో ఆ గారెవాడు ఆ ఎనుమును ఏమి చెయడానికి వీలులేక ఒక చోట భద్రంగా ఉంచినాడు. మరుసటి రోజున వాడు దానిని కోసి భాగముల ప్రకారము కుప్పలు వేయగా, అదే సమయమున అదే ఇంటికి పోయి పాలు ఇవ్వమని అడుగగా ఆమె నిన్నటిరోజున స్వామివారు వెళ్ళిపోయిన తర్వాత జరిగిన విషయం చెప్పింది. స్వామి వారు ఆమెను ఎనుమును చూపించమని, బ్రతికిస్తానని చెప్పినా, ఇప్పటికే గారెవాడు దానిని కోసి కుప్పలుగా వేసి ఉంటాడు. ఇక లాభం లేదని లోపలికి వెళ్ళిపోయింది.

స్వామివారు గారెవాడి ఇంటి వద్దకు వెళ్ళి చూడగా అప్పటికే వాడు కుప్పలుగా కోసి భాగములు వేసి ఉండడం చూసి ఆ కుప్పలనూ, దాని చర్మం, కొమ్ములూ, గిట్టలనూ ఒక చోట వేయించి స్వామివారు తన బెత్తముతో స్పృశించగానే ఎనుము యధాప్రకారము లేచి వచ్చింది. ఆమె ఆ ఎనుమును చూసి గారె వాడిని విచారించగా " జరిగిన వృత్తాంతమునంతా చెప్పాడు. నాటినుండీ ఆ ఇంటి వారు కూడా స్వామివారికి భక్తులై నడుచుకొనేవారు.

స్వామి వారి మహిమలను గడేకల్లు గ్రామస్థులే కాక, చుట్టుప్రక్కల ప్రాంతముల వారు, బళ్ళారి, గుంతకల్లు, వాటి చుట్టూ ఉన్న పల్లెలు, బెల్దోణ, ఏరూరు, పెంచులపాడు, విడపనకల్లు,, కడదరపెంచి, గుమ్మనూరు, తోరణగల్లు మొదలైన ప్రాంతాలలో చెప్పకొవడంతో, స్వామివారిని చూసెందుకు తండోపతండాలుగా వచ్చెవారు. తన వద్దకు వచ్చిన ప్రతి భక్తునకు, భక్తురాలికి, చిరునవ్వుతో సమస్యలని పరిష్కరించేవారు. అలా స్వామి దర్శనార్థం వచ్చిన భక్తులు స్వామి వారిని ఇలవేల్పుగా కొల్చుకునెవారు.

# ఫక్కీరప్ప జననం – స్వామి వారి జీవసమాధి సమయం

ఒకరోజు సంజమ్మ ఏదో దిగులుగా ఉండడం గమనించి, స్వామివారు " సంజీవా ఈ మధ్య ఏదో ఆలోచిస్తున్నట్లు కనిపిస్తున్నావు? కారణము ఏమిట"ని అడిగారు. నంజమ్మ " స్వామీ! నా తదనంతరం మీకు సేవ చేయడానికి ఒక పిల్లవాడు ఉండుంటే బాగుంటుందనిపిస్తోంది." అని సమాధానమిచ్చెను. స్వామివారు సంజమ్మ మాటలు విని " దానికి ఇంత దిగులెందుకు? ఆ సంగతి నేను చూసుకుంటాను. అని చెప్పి వెళ్ళిపోయారు. ఇలా కొంతకాలము గడిచిపోయింది. ఒక రోజు సంజమ్మ" నేను చెప్పినది స్వామివారు ఆలోచించారో లేదో ఇంతవరకు ఆ సంగతే పట్టినట్లు లేదు. స్వామివారికి తనదగ్గరకూ వచ్చిపోయే



వాళ్ళ కష్టసుఖాలు చూడడమే సరిపోతుంది. అనుకుంటూ మధ్యాహ్నం నడుం వాల్చింది. కొంచెం కునుకు పట్టినట్లయ్యింది సంజమ్మకు. కొంత సేపటికి "సంజీవా! సంజీవా!" అని స్వామివారు పిలిచినట్లయ్యింది. అయ్యో స్వామి పిలుస్తున్నారే అని స్వామి ఉన్న చోటకి వెళ్ళి చూసింది. స్వామి మాత్రం ధ్యానంలో ఉన్నారు. సంజమ్మ "నన్ను పిలిచారా స్వామి" అనడిగింది. అపుడు స్వామి అవును పిలిచినది నిన్నే. అంత పరధ్యానంగా ఉన్నావేమి. నీవు పిల్లవాడిని అడిగావు కదా. ఆ అడ్డు కొండలో ఒక పిల్లవాడు ఏడ్చుచున్నాడు. వెళ్ళి తెచ్చుకొమ్మని చెప్పి మళ్ళీ ధ్యానంలో మునిగిపోయాడు. సంజమ్మ ఇది నిజమేనా! అనుకుంటూ వడ్రంగివారి చేనులోంచి అడ్డుకొండ వద్దకు వెళ్ళగా అక్కడ ఒక పిల్లవాడు తుంటిగుడ్డమీద పడుకొని ఏడ్చుచున్నాడు. అది చూసి స్వామి వింత మహిమకు అబ్బురపడి, తన్ను నమ్మిన భక్తుల కోర్కెలను ఎట్లా తీరుస్తాడో, స్వామివారి లీలలను గురించి తలచుకుంటూ ఆ పిల్లవాణ్ణి తెచ్చుకున్నది. ఆ పిల్లవానికి స్నానాదికాలను చేయించి, స్వామీ ఈ పిల్లవానికి పాలు ఎట్లా అని అడుగగా, స్వామివారు "ఇప్పటి నుండీ ఒక నల్లకుక్క ఇక్కడకు వస్తుంది.ఈ పిల్లవానికి ఆ కుక్కపాలు పట్టుమ"ని చెప్పారు. స్వామి చెప్పిన కొంత సేపటికి నల్లని కుక్క వచ్చి నిలబడింది. సంజమ్మ ఆశ్చర్యంతో ఎప్పుడూ రాని కుక్క స్వామివారు చెప్పినట్లే వచ్చింది. ఇదంతా స్వామి వారి మహిమనే తలచుకుంటూ, ఆ పిల్లవాణ్ణి తెచ్చి ఆ కుక్క స్తనానికి పెట్టగానే ఆ పిల్లవాడు తల్లిపాలలాగే కడుపునిండా పాలు త్రాగెను. ఇలానే కాలము గడుస్తుండగా ఆ పిల్లవాడికి 6,7 నెలలు నిండాయి. రోజూ స్వామి కొరకు వచ్చే జనులు ఆ పిల్లవానికి అప్పడే పిండిన ఆవుపాలు తీసుకురావడం, ఆ పిల్లవాడు సంపూర్ణ ఆహారంతో పాటు స్వామివారి ఆశీర్వాదబలంతో దినదినాభివృద్ధి చెందుతూ పెరగసాగాడు. ఒకరోజు సంజమ్మ "స్వామీ ఈ పిల్లవానికి ఏమి పేరుతో పిలవాలో మీరే సెలవీయమ"ని అడుగగా, స్వామివారు "ఫక్కీరప్ప" అని పేరు పెట్టారు.

భీమలింగేశ్వరస్వామి ఎన్నో స్థలాలలో కూర్చొని(ధ్యానము, తపస్సు చేసి) లేచి వచ్చినారు. తరువాత గడేకల్లు గ్రామమునకు వచ్చి తన స్థిరనివాసము కొరకు చేరుకున్నారు. ఒకరోజు స్వామివారిని దర్శించడానికి వచ్చిన ఊరిపెద్దలు, ప్రజలందరి ఎదుట నేను ఈ లోకానికి వచ్చిన కార్యము ముగిసినది. ఇక మీ అందరికీ నా నిజదర్శనము కలుగదు. వచ్చే ఆషాడశుద్ధ దశమినాటికి జీవసమాధిలో ప్రవేశించుటకు నా తండ్రి పరమేశ్వరుని నుండి అజ్ఞ వచ్చినది. అందువలన మీరందరూ నా సమాధికి కావలసిన బండలు, ఇతర సరంజామాను సిద్ధం చేయాల్సిఉందని చెప్పగా అందరూ ఒక్క

క్షణం శిలాప్రతిమల్లాగా నిలబడిపోయారు. తేరుకొని "మీ పట్ల ఏమైనా అపచారము జరిగినదా స్వామీ! మా తప్పు ఉంటే క్షమించండి. మీరు ఏ శిక్ష వేసినా అనుభవిస్తాము." అని పాదాలపై వాలారు.

స్వామివారు "మీరు ఏ అపరాధమూ చేయలేదు. నేను ఈ కలిలోకంలో ఉండుటకు వీలు లేదు. మీరు నిర్మించిన ఈ సమాధిలో ఉండి మిమ్మల్ని కాపాడుకుంటూ, మీ కోరికలను తీర్చుతూ, మీకు కష్టనష్టాలను రాకుండా కాపాడుతాను. ఎవరు నన్ను మిన్నగా తలచుకుంటారో వారు అంత సుఖసంతోషాలతో తులతూగుతారు. నేను ఈశ్వరాంశసంభూతుడను. నాకు మరణమనేది లేదు. సూర్యచంద్రాదులు ఉన్నంతవరకూ ఇప్పుడు ఎట్లా మీ ఎదుట ఉన్నానో, అలానే మీ భక్తి శ్రద్ధలను బట్టి సమాధిలో ఉన్నా మీ దగ్గరే ఉంటాను." అని సమాధానపరచి ఇంక 5 నెలలలో మీరు నా సమాధికి కావలసిన పై మందిరానికి కావలసిన సరంజామాను భక్తి శ్రద్ధలతో తయారు చేసుకోండని" చెప్పి ధ్యానమగ్నుడైనారు.

ఇది అంతా విని సంజమ్మ స్పృహ తప్పి పడిపోయింది. అక్కడ ఉన్నవారు ఆమె ముఖం మీద నీల్లు చల్లగా కళ్ళు తెరచి "స్వామీ మీరు సమాధిస్థితి పొందినచో నేను ఎలా ఉండగలను. ఎవరికి సేవచేసుకోను" అని చెప్పి బాధపడగా స్వామివారు "నీవు బాధ పడవద్దు. నేను సమాధి స్థితి పొందిననూ, ఎక్కడికీ పోను. నేను ఇక్కడే ఉండి మిమ్మల్ని చూసుకొనెదను. మీరు పిలిచిన వెంటనే పలికెదను. నీవు పెంచిన కొడుకు (పక్కీరప్ప)కు పెళ్ళి చేసి వానికి కావలసినవి అన్ని సమకూర్చిన తర్వాత దేహమును విడిచెదవు. నీ సమాధి నా సమాధి కన్నా ముందు భాగంలో ఉండి, నా కొరకు వచ్చే భక్తులు ముందుగా నీ దర్శనం చేసుకుంటారు. నా కీర్తి ఉన్నంతవరకు నీ కీర్తి ఉంటుంది.. నీవు దిగులు పెట్టుకోక నన్ను సమాధిలోకి వెళ్ళనివ్వు." అని చెప్పెను. "స్వామీ పక్కీరప్ప ఏ రీతిగా బ్రతుకగలడు. వానికి ఏ ఆధారమూ లేదు. ఎలా బ్రతుకు కొనసాగించును." అని సంజమ్మ స్వామిని అడగ్గా స్వామి " పక్కీరప్ప గురించి భయపడాల్సిన అవసరం లేదు. ఏ ఇంటి ముందు నిలిచి భీమలింగేశ్వరుని పూజారి వచ్చినాడు. అని నాపేరు చెప్పిన వానికి కావలసినంత సంపద లభించును. పక్కీరప్ప అతని సంతతియే మా జీవసమాధి పూజాదులు నిర్వహిస్తారు. వేరే ఎవ్వరికీ అర్హత ఉండదు." అని సంజమ్మతో చెప్పెను.

సంజమ్మ "పక్కీరప్పను నేను సాధారణంగా పెంచాను. మీరా బ్రాహ్మణోత్తములు. పక్కీరప్పకు వేదమంత్రాలూ, పూజా పూజాపద్ధతులు తెలియవు కదా. ఎలా?" అని సందేహించగా, స్వామివారు "నేను పరమేశ్వరుని వలె నిరాడంబరుడను. నేను ఏ మతానికీ, ఏ కులానికీ చెందినవాడను కాదు. గొప్పవంశము వారమని కొందరు నీచ కులస్థులని హీనముగా చూడ్డం నేను సహించను. మానవులందరూ ఒకే జాతి, ఒకే కులము అని భావిస్తాను. అందరికీ అన్నపానీయాలు, ఆకలి దప్పులు సమానమే. అందువలన భక్తికొద్ది, ప్రేమకొద్ది ఎవరు ఏది నైవేద్యముగా ఇచ్చినా నేను స్వీకరిస్తాను. మీరు ఏది ఇష్టంగా స్వీకఇస్తారో అదే నాకు నైవేద్యంగా సమర్పించవచ్చు. మీరు చేసినదే పూజ. పలికినదే నాకు మంత్రము అగును. నేను సర్వసామాన్యున్ని కాను. ద్రాక్షారామ భీమేశ్వరుని వర పుత్రుడిని. వేములవాడ భీమలింగేశ్వరుడను. నన్ను భక్తిప్రపత్తులతో కొలిచినవారి భక్తికి మెచ్చి నేను నా సమాధి నుండే పలుకుతాను. కాపాడుతాను. నా మాటలు ఖచ్చితమైనవి. పొల్లుపోవు" అని మాటిచ్చి సంజమ్మ సందేహాలను తీర్చారు. ఊరిలోని పెద్దమనుషులు స్వామివారి సమాధిపనిలో నిమగ్నమయ్యారు. అందరూ వారివారి బాధ్యతలను సక్రమంగా నిర్వహించసాగారు. స్వామి సమాధిలోనికి పోయిన మనకు దిక్కెవరనుకుంటూ, అందరూ స్వామివారు ఏమి వాక్కు చెబుతారో, ఏమి సందేశము ఇస్తారో అని ఎక్కువ సమయం స్వామివారి దగ్గరే గడిపేవారు. స్వామివారు ఆధ్యాత్మిక సంగతులను చెబుతూ, వారిలో భక్తిభావములను పెంపొందించేవారు. రోజులు దగ్గర పడేకొద్ది ఊరిలోని వారు గుంపులు గుంపులుగా వచ్చి స్వామివారి ఉపదేశాలను వినేవారు. సమాధి పనులు అన్నిపూర్తి అయ్యక ఊరిపెద్దలు

స్వామితో " ఇంకా ఏమి చేయమందురు" అని అడగగా స్వామి వారితో "విభూది పండ్లు, రుద్రాక్షమాలలూ, బిల్వపత్రి, ఇంకా సుగంధద్రవ్యాలూ, ఆవు పంచితమును తెప్పించి" తరువాత మఠాధిపతులను(లింగాయతులను) పిలిచి వారితో "అఖండ అభిషేకము చేయించి, సమాధిలో బిల్వపత్ర ఆకులను పరిచి, విభూధి, రుద్రాక్షమాలలను తెచ్చి సంజమ్మకు ఇవ్వండని చెప్పెను. స్వామి సంజమ్మను పిలిచి సమాధి కుడిభాగమున వేపచెట్టు వద్ద ఆవునుగ్గులతో ఒక దాలిని (నుగ్గులను గుంపుగా పేర్చడం) నిప్పు పెట్టమని చెప్పెను.

స్వామి సమాధిలోనికి వెళుతున్నారని అది చూడడానికి ఊరి జనం, చుట్టు ప్రక్కల ప్రాంతాల నుంచి తండోపతండాలుగా వచ్చారు. స్వామి ధ్యాననిమగ్నుడై ఉన్నారు. స్వామి ఒంటినిండా విభూధి రేకులతో మెడలో రుద్రాక్షమాలలు ధరించి, కుడిచేతిలో జపమాలను, ఎడమచేతిలో దండమునుపట్టుకొని ధ్యాననిమగ్నుడై చూచుటకు అపరరుద్రుని వలె తేజోవంతముగా కనిపించుచున్నాడు. అందరూ స్వామివారిని తదేక దీక్షతో చేతులు జోడించి నిల్చున్నారు. ఆషాడ శుద్ధ దశమినాడు శుభఘడియలలో స్వామివారు " సంజీవా! జ్యోతిని ప్రజ్వలింపచేసి సమాధి ముందు భాగమున పెట్టుము. దాలిలోని కాల్చిన భస్మమును ఒక కుందలో తీసుకునిరమ్మని ఆనతిచ్చెను. సంజీవమ్మ స్వామి చెప్పినది తూచ తప్పకుండా భక్తిశ్రద్ధలతో చేసినది. అప్పడు స్వామి కన్నులు తెరచి గంభీరస్వరంతో ఇప్పడు ప్రజ్వలింపచేసిన జ్యోతిని రేయింబవళ్ళు వెలుగుతూ ఉండేలా చూచుకొనవలెను. నేను సమాధిస్థితి పొందిన తర్వాత సూర్యచంద్రులు ఉన్నంత వరకు పూజా కార్యక్రమాలనూ, నిత్యనైవేద్యములను జరుపవలెను. వీటికి ఏలోటు రానీయకుండా చుసుకొనమని చెప్పి, సంజీవమ్మ తెచ్చిన భస్మమును తన అంగాంగాలకు రాసుకొని, మిగిలిన భస్మమును "సంజీవా దీనిని ఎప్పడూ నా జీవసమాధి ఎదుట పెట్టవలెను. ఎందుకనగా ఇది నా అంగాంగాలకు రాయబడినది కనుక "అంగారు" అని దీనిని పిలుస్తారు. ఇంకా భస్మము గురించి ఇలా చెప్పారు. భస్మము ఎప్పటికీ రూపాంతరము చెందనిది. శాశ్వతమైనది. శాశ్వితమైనది అని చెప్పబడేది పరమేశ్వరునికి చెందినది. పరమేశ్వరునికి ప్రియమైనది. అందువలననే ఆ పరమేశ్వరుడు ఎల్లవేళలా భస్మమును శరీరానికి రాసుకుని ఉంటాడు. నా భక్తులు ఏ బాధతో వచ్చినా, ఎక్కడ బాధ కల్గినదో అక్కడ అంగారు రాసుకుని, నన్ను స్మరించుకుంటూ, నొసటన బొట్టు పెట్టుకొని చిటికెడు నోటిలోనికి వేసుకొనిన వారి బాధలు వెంటనే ఉపశమనం కలుగును." అని చెప్పారు.

గంభీరస్వరంతో పలికి "నేను ద్రాక్షారామభీమేశ్వరుని కుమారుడను భీమలింగేశ్వరుడను నా మాటలు పొల్లుపోవు. నేను సమాధిలోకి పోయిన 10 ఘడియలకు పైన మూత చేయుము. మరలా 6 మాసములకు మూత తొలగించిచూడుము" అని చెప్పి సమాధిలోనికి పోయెను. ప్రజలందరూ "జై భీమలింగా! జై భీమలింగా!" అంటూ విజయధ్వనులు చేస్తూ అక్కడే ఉండిరి. తరువాత 10 ఘడియలకు స్వామివారి సమాధి మీద మూతవేసి పాలు, పెరుగు, నెయ్యి మొదలగు వాటితో అభిషేకము చేసి, విభూధితో సమాధికి బొట్లు పెట్టి, బిల్వపత్రి, పువ్వులతోనూ అలంకరించి మఠాధిపతులు పూజలు చేసారు. లెక్కకు మిక్కుటముగా టెంకాయలు కొట్టి, హారతులిచ్చారు. స్వామివారి సమాధి ఘట్టమును చూడడానికి వచ్చిన వారందరూ అక్కడే ఉండి 5 రోజులు రేయింబవళ్ళు అఖండభజనలు జరిపించారు. ఐదురోజులుగా అఖండభజనకు వచ్చిన వారికి షడ్రసోపేతముగా భోజనాదులను ఏర్పాటు చేసారు. అందరూ ఒకప్రక్క స్వామి కార్యాన్ని ఘనంగా విజయవంతంగా జరిపించినందుకు సంతోషముతో, మరోప్రక్క స్వామివారు ఇక మనకు కనపడరు అన్న దిగులుతో వారివారి ఇండ్లకు వెళ్ళిపోయారు. ఆ తర్వాత ఆ ఊరి పెద్దలందరూ సంజమ్మ, పక్కీరప్పలతో "మీకు కాలసినవన్నీ ఊరి ప్రజలే చూసుకుంటారు. మీరు స్వామివారి ధూపదీప నైవేద్యాలకు లోటురాకుండా చూసుకుంటూ సేవ చేసుకొండని చెప్పి" నమస్కరించి వెళ్ళిపోయారు. ఆ తర్వాతి కాలములో దేవాలయమును నిర్మించడం జరిగింది.

# గడేకల్లులో స్వామి వారి దేవాలయం నిర్మించేటప్పుడు ప్రత్యక్షమై మహిమను చూపిన విధానము

స్వామివారి ఆలయమును బళ్ళారి నివాసులైన జొన్నగడ్డ పాపయ్య అనునతడు కట్టించుటకు గాను, బళ్ళారియందే స్వామి ఆలయమునకు కావలసిన రాతిదూలములు, స్తంభములు, బండలు మొదలైన యావత్తు సామానులు తయారు చేయించారు, వాటిని అచ్చటి నుండి, గడియాద్రిపురము (గడేకల్లు)నకు తెచ్చుటకు గాను,బళ్ళారిలోనే బాడుగ బండ్లవారిని పిలిపించి, ఈ సామానులు చూపిన వెంటనే బాడుగ వారందరూ, ఇంత పెద్ద సామానును బండ్లు ఎత్తినచో, బండ్లు నిలబడలేవు. ఈ కష్టము మాకు అక్కర లేదంటూ ఒక్కరు కూడా ఒప్పుకోలేదు. ఈ స్థితిని చూచి, పాపయ్య వారందరికీ ఎంత బాడుగ అడిగితే అంత ఇస్తానని ఎంత చెప్పినా కూడా ఎవరూ వినలేదు. కారణమేమని విచారించగా హగిరి వంక వద్ద దారి సరిగా ఉండదని, అక్కడ 6 ఎద్దులు కట్టినా ఈడ్వలేవని, ఇబ్బందులు పడాల్సివస్తుండని చెప్పి బండ్లవాళ్ళువెళ్ళిపోయారు.

ఎవరూ ఒప్పుకోకపోవడంతో ఈ భక్తుడు చాలా చింతించి, స్వామిని అనేకవిధములుగా ధ్యానిస్తూ, తన ఇంటికి వచ్చి స్నానము చేసి, సంధ్యావార్చునపుడు దివ్యస్వరూపముతో ఒక యోగి దర్శనమిచ్చి "ఒరే, నీవు చింతించనక్కర్లేదు. బండ్లవాళ్ళకు, బండ్లకు ఏమైనా నష్టము కలిగినట్లయితే వాటిని సరిచేయిస్తానని, ఒకవేళ ఎద్దులు ఈడ్చలేకపోయిన ఆ బండ్లను అక్కడే వదిలి వెనుతిరిగి రమ్మని, ఒక బండికి నాలుగు వంతులు కట్టిస్తానని వారితో చెప్పమన్నారు. అప్పడు వారు బండ్లు కడతారు. బండ్లకు నష్టము కలుగకుండా, ఎద్దులు కష్టపడకుండా, సామాను అంతా నా స్థలమునకు చేరును. నువ్వు చింతించవద్దని" చెప్పి అదృశ్యమయ్యాడు. భీమలింగేశ్వరుని అనుగ్రహానికి సంతోషించి, తక్షణము భోజనము చేసి,, బండ్లవాళ్ళను పిలిపించి వారితో స్వామి చెప్పిన విధంగా భాషించాడు. కానీ ఆ బండ్లవాండ్లు అనుమానము ప్రకటించగా, పాపయ్య "ప్రమానపూర్వకముగా ఎటువంటి నష్టము కలిగినా నేనే భరిస్తాను. ఇది ఆ భీమలింగేశ్వరునిమీద ఆన. అని పలికాడు.

బండ్లవాళ్ళు అతని భక్తివిశ్వాసములను చూసి, సమ్మతించారు. కానీ వారిలో ఒకడు హగిరి వంక వద్ద దాటునపుడు ఎద్దులు పోలేకపోతే ఎలాగని సందేహము తెలిపెను. అపుడా భక్తుడు అపూర్వవిశ్వాసముతో " అలా ఆటంకమైతే ఈ వస్తువులన్నీ అక్కదే వదిలివేసి రమ్మని చెప్పారు. వారందరూ ఆ దేవుని మహిమ ఎట్టిదో ఏమో! మనమెందుకు వాదింపవలెనని, బండ్లకు సామాను ఎత్తించుకొని బయలుదేరారు. బండ్లన్నీ హగిరి వరకు నిరాటంకంగా ప్రయాణించాయి. బండ్లను హగిరి వద్ద ఆపి, కాడి పెట్టించాలని ఆలోచిస్తుందగా అంతలో బండ్లన్నిటిలో ముందున్న బండి ఎద్దులు తమంతట తామే, మనిషిలేకనే హగిరి వంక వద్ద తోవ తప్పకుండా, ఆయాసపడకుండా దాటాయి. ఇది చూసిన బండ్ల వాళ్ళు ఆశ్చర్యమానసమగ్నులై, ఇది దేవుని మహిమనే కానీ వేరొకటి కాదు. ఇంతబరువైన బండ్లు ఇంత సునాయాసంగా వంకదాటడం చాలా విడ్డూరమనుకుంటూ బండ్లనన్నిటినీ హగిరి వంకను దాటించారు. తరువాత రోడ్డుమార్గమున జోళదరాశి అను గ్రామము వద్దకు రాగానే ఒక బండికి మాత్రము యేరుకోలు పటపటమని శబ్దమయ్యింది.

అప్పడు బండి తోలువాడు కొంచెము అంతుకొని ఉన్న ఇరుసును చూచి ఇది విరుగుట నిశ్చయము, విరిగిన తరువాత ఎద్దులపై పడుతుందని తలచి, బండి విడిచినాడు. మిగతా వారందరూ వచ్చి చూసి ఏమి చేయాలని

చింతించునంతలో ఒక తెల్లనిగుర్రంపై కుర్చోని ఒక సాధువు వాళ్ళ వద్దకు వచ్చారు. తెల్లటి వెంట్రుకలతో, తెల్లటి గడ్డముతో ఉన్న ఆ సాధువు "నాయనా మీది ఏ గ్రామము? వీటిని ఏ గ్రామానికి తీసుకెళ్తున్నారు? ఏ దేవుని ఆలయము కట్టడం కోసం?" అని విచారించగా, వాళ్ళు ఈ సామాను గడియాద్రిపురమున శ్రీ వేములవాడ భీమలింగేశ్వరస్వామి ఆలయనిర్మాణము కోసం తీసుకు వెళ్తున్నామని చెప్పగా, మరి బండ్లను ఇక్కడ ఎందుకు ఆపారు అని ప్రశ్నించారు. ఈ బండి యేరుకోలు కొద్దిగా విరిగిందని ఆ సాధువుకు చూపించారు. ఆ సాధువు దానిని చూసి, ఇది ఏమాత్రమూ విరిగిపోదు. దీనికి ఒక కొయ్యవేసిబిగించినయెడల దీనికి భయము లేదని చెప్పగా, దీనికి తగువైన కర్రను ఎక్కడ తేవాలని వాళ్ళు ఆలోచిస్తుండగా, ఆ సాధువు తన చేతిలో ఉన్న చంద్రాయుధమును వాళ్ళ చేతికి ఇచ్చి దగ్గర ఉన్న కొండవద్ద ఉన్న వేపకొమ్మను కోసుకు రమ్మని చెప్పారు. వాళ్ళు వెళ్ళి ఒక వేపకొమ్మను తీసుకురాగా, దానిని యేరుకోలుకు వేసి బిగించారు. వాళ్ళు కదిలిన వెంటనే, సాధువు అదృశ్యమయ్యారు.

అప్పడు ఆ బండ్లవారందరూ అయ్యో! స్వామి మనకు దర్శనమిచ్చుటకే ఈ విధంగా జరిగినదేమో అని స్వామిని తలచుకుంటూ, ఎటువంటి ఆటంకములూ లేకుండా గడేకల్లు స్వామి అలయము చేరారు.

అంతలోనే బెళ్ఢోణ గ్రామము నుండి కొంతమంది భక్తులతోకూడి స్వామివారి పూజారి గడేకల్లు ఆలయము వద్దకు వచ్చారు. ఆ బండ్ల వాళ్ళు, ఈ పూజారిని చూసి, ఈయనే మాకు జోలదరాశి వద్ద దర్శనమిచ్చి, అదృశ్యమయ్యారు. ఇపుడు ఇక్కడ దర్శనమిచ్చారని అతని పాదాలకు నమస్కరించి "మీరు జొలిదరాశి వద్ద సహాయము చేయకుంటే ఎంతో ఇబ్బంది పడేవారము స్వామి". అనగా అపుడు ఆ పూజారి "నేను బెళ్ఢోణ గ్రామము వెళ్ళి మూడు రోజులయ్యింది. ఇప్పడే రావడము. కావాలంటే నాతో పాటు వచ్చిన వీరిని విచారించండని" చెప్పెను.

ఆ బండ్ల వాళ్ళు "మాకు ఈ సాధువే కనిపించినది. తెల్లని గుర్రంపై చేతిలో చంద్రాయుధముతో కన్పించారు." అని చెప్పగా, వారందరూ చంద్రాయుధము స్వామివారి జీవసమాధిపై ఉండును. ఈ పూజారి చేతిలో ఉండదు, అని స్వామివారి సమాధిపై ఉన్న చంద్రాయుధమును చూసారు. ఆ చంద్రాయుధముపై చెట్టు కొట్టిన రసము కూడా ఉండింది. అది పరీక్షించి అందరూ ఆశ్చర్యపడి, ఇదంతా స్వామి ప్రత్యక్షముగా నడిపిన కార్యము, లేకున్న ఈ చంద్రాయుధమునకు రోజూ విభూధి పూజ చేస్తారు. ఈ చెట్టు కొట్టిన ఆనవాలు ఎలా వస్తుంది. అంతా స్వామి మహిమ అనుకున్నారు. ఆ బండి వాళ్ళందరూ స్వామి ఆలయానికి సంబంధించిన సామాను అంతా దింపివేసి, ఆనందమైన మనసుతో బళ్ళారికి ప్రయాణమయ్యారు. అక్కడ పాపయ్యను కలిసి జరిగిన వృత్తాంతమంతా చెప్పి మాకు బాడుగ అవసరం లేదు. మేము స్వామి కృపకు పాత్రులమయ్యామని పలికారు. అపుడు ఆ పాపయ్య స్వామి వారి మహత్యము తెలుసు కావుననే నేను అంత నమ్మకంతో ఈ కార్యమునకు ఉపక్రమించాను. మీరు డబ్బు వద్దంటే నాకు ఫలితం ఉండదు అని బలవంతముగా వారికి బాడుగలు ఇచ్చి పంపాడు.

## ధ్వజస్తంభమును నిలిపెట్టప్పుడు జరిగిన అద్భుతమహిమ

స్వామివారి ఆలయమునకు ముందు భాగమున గొప్పశిలతో నిర్మింపబడిన ఒక ధ్వజస్తంభమును నిలిపినారు. దీనిని నిలబెట్టుటకు ఆ రోజుల్లో యంత్రములేవీ లేవు. జనసహాయముతో నిలబెట్ట వలెనని ఈ గ్రామమునకు చుట్టూ ఉన్న పల్లెలనుంచి పిలిపించిరి. ఎంతో మంది నాలుగు రోజులు శ్రమించినా కూడా ధ్వజస్తంభము లేవలేదు. ఐదవరోజున ఈ ధ్వజస్తంభము చేసిన సంత్రాసు, స్వామివారిని ఈ విధముగా వేడుకునెను." స్వామీ! నాకు చేతనైనంత వరకూ కష్టపడి పనిచేసి, ధ్వజస్తంభమును చేసితిని. దానిని ఎన్ని విధములుగా ప్రయత్నించిననూ లేవలేదు. చుట్టు ప్రక్కల గ్రామాల నుంచి వచ్చిన వారందరూ ఈ గ్రామమున ఎన్ని రోజులుండగలరు? ధ్వజస్తంభము గతి ఏమిటని స్వామిని వేడుకుంటూ, చింతిస్తుండగా, అతనికి నిద్దుర వచ్చినట్లు కాగా, అతడు ఆలయప్రాంగణంలోనే పడుకున్నాడు. వెంటనే ఆ పడుకున్న సంత్రాసుకి స్వామి స్వప్నములో కనిపించి "ఒరే సంత్రాసు, నీవు చింతించనక్కర్లేదు. ఇప్పుడు వెళ్ళి, అక్కడ ఎవరుంటే వారితో పట్టించుము. ధ్వజస్తంభము తప్పక నిలుస్తుంది." అని ఒక సాధువు వేషములో కలలో సాక్షాత్కరించాడు. సంత్రాసుకు వెంటనే మెలకువ వచ్చింది.

అతడు స్వప్నం ప్రకారము ధ్వజస్తంభము ఉన్న చోటకు వెళ్ళి అక్కడున్న స్త్రీ, పురుషులను పట్టమని కోరాడు. అయితే అక్కడున్న వారు నవ్వి వందలమంది నాలుగు రోజులుగా ప్రయత్నము చేసినా ఇంత కూడా లేవని ఈ ధ్వజ స్తంభము ఈ కొద్దిమంది చేత లేవడం అసంభవము. నీకు పిచ్చిగానీ పట్టిందా అని పరిహాసము చేసారు. అప్పుడు ఆ సంత్రాసు " అయ్యా! ఇక్కడ ఉన్న యావత్తు స్త్రీపురుషులందరూ కలిసి ప్రయత్నించండి. ఈ సారి ఈ స్తంభము లేవకపోతే ఇక్కడే నా ప్రాణములను అర్పిస్తానని వారితో చెప్పాడు. అపుడు అక్కడున్నవారు అతని మాటప్రకారము ప్రయత్నించారు. ఆశ్చర్యకరంగా ఆ ధ్వజస్తంభము లేచి, సరిగ్గా స్థలములో కూర్చొనింది. ఆ సమయానికి పక్కగ్రామమువారు కొంతమంది, ఈ గ్రామము వారు భోజనానికి వెళ్ళి ఉన్నారు. ఆ గ్రామములోని కొందరు పెద్దలు ఈ వార్త విని, చాలా సంభ్రమాశ్చర్యాలకులోనై, సంత్రాసును విచారించగా అతను తనకు స్వప్నమైన విషయమంతా చెప్పగా, అందరూ దేవున్ని అనేకవిధములుగా ప్రార్థించి, పూజా పురస్కారాదులాచరించి, గ్రామస్తులందరూ వారివారి ఇండ్లకు వెళ్ళిరి. ఈ ఘన చరిత్రను కలిగిన ధ్వజస్తంభము నేటికీ దేవాలయము ముందర ఉన్నది.

# కంతి ధరించునపుడు జరిగిన మహిమ

స్వామి సమాధి అయిన తర్వాత కొన్ని రోజులకు గడేకల్లు గ్రామములో ఉండే మఠపతి బసయ్య అను అతను, కంతి (బండల మధ్య ఖాళీని కానీ రంధ్రమును కానీ పూడ్చడానికి  వేసే పదార్థము) ధరించు ఆయనకు తోడుగా పని చేయుచుండెను. ఇతడు స్వామి సమాధికి ఒక రంధ్రము ఉన్నది.

ఆ రంధ్రమునకు తన హస్తమును పెట్టి చూడగా సమాధిలో నుండి చల్లని మారుతము చేతికి తాకడం అతను గమనించాడు. ఇతను ఈ సమాధిలో ఏమున్నదో చూడాలన్న కోరికతో ఒక పొడవయిన కర్రను తీసుకొని సమాధిరంధ్రములో పెట్టి సమాధి నాలుగు మూలలా కర్రతో తాకుతూ, ఒకటి రెండు మూలలకు కర్రను తగిలించాడో లేదో అంతలోనే సమాధి నుండి భగ్గునమి మంట పుట్టి, ఈ కర్ర జొప్పించిన అతని దేహమాద్యంతము కాలి, బొబ్బలు పుట్టి, దేహమంతా మంటలు అధికమై చాలా బాధతో అరవసాగెను. ఆ అరుపుకు నలుగురూ వచ్చి, జరిగిన విషయం విషయం తెలుసుకొని "మనము చేయడానికి ఏమున్నది. ఇక ఇతనిని ఆ భీమలింగుడే కాపాడాలి గానీ, వేరెవ్వరి వల్లా కాదు" అనుకుని పెద్దలందరూ స్వామిని వేడుకొని కాలిన బసయ్యను స్వామి సమాధి ముందర పరుండబెట్టి, స్వామి పైనే భారము వేసారు. ఆ కాలిన బసయ్య స్వామిని "స్వామీ అజ్ఞానముతో నేను చేసిన తప్పును మన్నించండి. ఈ బాధను భరించలేకుండా ఉన్నాను. నన్ను కాపాడండి " అని ప్రార్థిస్తూ సొమ్మసిల్లిపోయాడు. నిద్రలో స్వామి సాక్షాత్కరించి బెత్తముతో మూడుసార్లు తట్టి ఇకనైనా బుద్ధితో మెలగమని" చెప్పి అంతర్థానమయారు.

స్వామి బెత్తము తగలగానే స్వామీ అని గట్టిగా కలవరించుకున్నాడు. అప్పడు చుట్టు ప్రక్కలవారు ఏమైందని ప్రశ్నించగా, తనకు కలలో జరిగిన విషయం అంతా చెప్పాడు. అప్పటికే అతనికి సగము బాధ తగ్గిపోయింది. సూర్యోదయము తర్వాత బసప్ప మామూలుగా నిద్రలేచి జరిగిన సంఘటన తలచుకొని స్వామివారి ఆగ్రహమూ, అనుగ్రహము ఎలా ఉంటాయో తెలుసుకున్నవాడై, స్వామికి కాయా కర్పూరాలను తెచ్చి, పూజలు చేసి ఇంటికి వెళ్ళెను.

## ఎమ్మిగనూరు పట్టణంలో అటకారు వాడు భంగపడుట

స్వామివారి జాతరకు ముందు అనగా జాతర 2 నెలలు ఉండగానే పూజార్లు స్వామివారి విగ్రహమును పల్లకీలో ఉంచుకొని, స్వామి భక్తులు ఏ ఏ గ్రామాలలో ఉన్నారో ఆ గ్రామాలకు జాతర ఖర్చుకు గానూ (పట్టీ) సంపాధన కొరకు పోయేవారు. పూర్వము దాదాపు 130 సంవత్సరాల క్రిందట స్వామివారి పూజార్లు ఎమ్మిగనూరు అను పట్టణమునకు సంచారమునకు పోయి ఉండిరి. ఆ పట్టణంలో అటకారు వాళ్ళు విశేషముగా ఉండేవారు. వారిలో ఒకడు మాత్రము విద్య యందు చాలా నిపుణుడై ఉండెను. అతని పేరు చెప్ప, వారు ఎవరూ లేనందున ఆ పేరు వ్రాయలేదు. అతడు తన క్షుద్రవిద్యాగర్వంతో, భాజాభజంత్రీలతో ఊరేగుతున్న స్వామీవారిని చూచి, పల్లకీ మోసేవాండ్లకు, భజంత్రీ చేయువారికి నోటమాట రాకుండేలా, చేతులు కదలకుండా క్షుద్రవిద్య చేసినాడు. అప్పడు స్వామివారి పల్లకీ ప్రధానవీధిలో ఆగిపోయింది. అపుడు పూజారి, మేలగాళ్ళను చూసి మేళము వాయించమని గర్జించెను. మేళగాల్లు నోటిమాటరాక, కాల్లూ చేతులూ కదల్చలేక, కన్నీరు విడువసాగిరి. పల్లకీ మోసేవాళ్ళను కదలమనగా, వాళ్ళు కూడా కదలలేక, మాట్లాడలేక, దిక్కుతోచని స్థితిలో బాధ పడుతూ స్వామిని ప్రార్థించిరి. అప్పడు పూజారి ఈ క్రింది విధముగా చేయునట్లు స్వామి బుద్ధిపుట్టించాడు. వెంటనే ఆ పూజారిపల్లకీని, భజంత్రీ వాళ్ళను అక్కడనే వదిలేసి, సమీపాన ఉన్న బావిలో స్నానము చేసి పల్లకీ వద్దకు వచ్చి, పల్లకీలో ఉన్న విబూధి(అంగారు)ను కొంచెము తీసుకొని, వారందరి మీదా చల్లి స్వామివారి బెత్తముతో పల్లకీ మోసేవారిని, మేళగాళ్ళను తట్టినాడు, వెంటనే వారికి ఆ క్షుద్రప్రయోగం నాశనమై చలనము వచ్చింది. ఇదిలా ఉండగా క్షుద్రవిద్య ప్రయోగము చేసిన ఆ అటకారువాడికి ఇంట్లో కడుపునొప్పి, కడుపుబ్బరముతో ఆయాసపడుతూ పొర్లుచుండెను. ఇది తెలిసి ఆ పట్టణంలో మిగిలిన విద్యావంతులైన అటకారు వారు వచ్చి, తమ శక్తిమేర ప్రయత్నించి చూసారు, కానీ ఫలితము కనపడలేదు. అపుడు వారు జరిగిన విషయమును తెలుసుకొని, ఇది ఆ భీమలింగేశ్వరిని మహిమ వల్ల జరిగిందని ఇతడు ఇట్లే ఉన్న ఎడల ప్రాణము నిలుచుట కష్టము, మనచేత ఏమి కాదు. కావున ఇతనిని ఆ స్వామివారి ముందుకు తీసుకు పోదాము రండని ఆ అటకారు వాడిని మోసుకొని, బజారులో పోవుచున్న పల్లకీకి అడ్డుగా వేసారు., పూజారి ఏమిటని విచారించగా వారు స్వామికి నమస్కారము చేసి , ఈ పడి ఉన్న దుర్మార్గుడు చేసిన క్రూరకృత్యములు యావత్తూ, ఒక్కటీ దాచక విన్నవించారు స్వామివారి పూజారి "నేను ఏమి చేయగలను. నాచేత ఏమవుతుంది. నేను మీలా విద్యావంతున్ని కాదు. నా చేత ఏమీ కాదని చెప్పగా" వాల్లందరూ నోటమాట రాక నిర్విణులై నిల్చున్నారు.

భీమలింగేశ్వరుడి వైభవము చూసి, గర్వముతో ఇట్టి విద్యలు ప్రయోగిస్తున్నప్పడు మహసాధ్వి, మహ భక్తురాలైన ఆ అటకాడి భార్య తనభర్తతో "మీరు విద్యావంతులు, మానవులకు చేసినట్లు స్వామివారిపై క్షుద్రప్రయోగములు చెసినా అది సాగక, స్వామి వారి కోపానికి గురికావాల్సి ఉంటుందని" హెచ్చరించినా లెక్కచేయక తిరిగి ఆమెను కోపగించుకున్నాడు. మరోసారి అమె తన భర్తకు నచ్చచెప్ప ప్రయత్నం చేస్తూ " ఆ స్వామి నీకేమి అపకారము చేసినాడు. నీవు పని కట్టుకొని ఈ విధంగా చేస్తున్నావు"అని అడగ్గా, ఈ పట్టణంలో ఎవరు వచ్చినా, నా అనుమతి లేనిదే బసచేయరు, నా అనుమతి లేకుండా పల్లకిలో ఉరేగిస్తూ, ఇక్కడే బస చేస్తారా, వీళ్ళకి బుద్ధి చెప్పాలి?" అని భార్యను చెంపదెబ్బ కొట్టాడు. ఆమె ఇక బదులు చెప్పక, చింతిస్తూ, స్వామి ఈ మూర్ఖుడిని ఇక నీవె రక్షించాలి అని ప్రార్థించెను.

ఆమె పతిమీద భక్తి కలిగినది అగుటవలన తన మాంగళ్యానికి ఏటువంటి అపదరాబోతుందో అని భయపడుతూ, స్వామివారి పల్లకి వద్దకు వచ్చి స్వామిని అనేక విధములుగా ప్రార్థించింది. ఇది చూసిన స్వామి పూజారి "

అమ్మా మేము ఏం అపరాధము చేసామని ఈ విధంగా చేశాడు" అనెను. ఆమె జరిగినదంతా వారికి చెప్పి తన భర్తను క్షమించమని, తనకు పతిభిక్ష పెట్టమని, స్వామిని కోరుతున్నపుడు, పల్లకీలో స్వామివారి విగ్రహముపైన ఉన్న పత్రి పుష్పములు దేవుని కుడిభాగమున రాలెను. ఇది గమనించినవారు స్వామివారు ఈమె భక్తికి మెచ్చారు అని తలచిరి. స్వామి వారి పూజారి కూడా జరిగినదానిలో ఈమె తప్పు ఏమీ లేదు.

అంతలో పడిఉన్న అటకారు వాడు మెల్లగా కల్లుతెరచి చూడసాగాడు. అక్కడున్న వారు స్వామి అనుగ్రహముతో ఇతనికి మెలకువ వచ్చింది. ఇక స్వామివారి పూజారి అనుగ్రహించాలని కోరారు. పల్లకీలోని అంగారును కొంచెము తీసుకొని అటకారువాడి నోట్లో వేసి, బొట్టు పెట్టి స్వామివారి బెత్తమును తీసుకొని మూడు సార్లు తట్టాడు. ఆ అటకారువాడు వెంటనే లేచి కూర్చొని తన బాధలన్నీ తొలగుట తెలుసుకొని, స్వామివారి పూజారి పాదాలకు సాష్టాంగ నమస్కారములు చేసి స్వామిని క్షమించమని వేడుకున్నాడు. స్వామివారి పల్లకీని తన ఇంటికి ఆహ్వానించి, ప్రత్యేకపూజలు చేయించాడు. స్వామివారి మహిమలను తెలుసుకొని, జాతరకు ఖర్చులకు తాను కూడా కొంత సొమ్మును కానుకగా సమర్పించుకొని, స్వామి పల్లకీ మోస్తూ, తాను కూడా స్వామితో పాటు అ పట్టణంలో తిరిగి గడేకల్లు చేరే వరకు వెంటనే ఉండి, ఆలయములో ఆరాధన జరిపి, తన పట్టణానికి వెళ్ళాడు.

# కరడిగుడ్డం మంగమ్మ అవధూత

కరడిగుడ్డం మంగమ్మవ్వ జన్మతః అవధూత. కర్నూలు జిల్లాలో గల ఎల్లార్తికి దగ్గర్లో కరడిగుడ్డం అనే గ్రామము ఉంది. అక్కడ ఈమె భవ్యమందిరము వెలసింది. పెళ్ళయి పసుపు బట్టలతో గడేకల్లు భీమలింగేశ్వరుని ఆలయశిఖరాలను చూడ్డానికి వచ్చింది. తలుపు వద్ద నుండి భీమలింగేశ్వరుడిని దర్శించి, స్వామివారికి తనను తానుగా సమర్పించుకుని, స్వామి వారిని గురువుగా ఆరాధించింది.

అక్కడ నుండి వెళ్ళిపోయిన తర్వాత కరడిగుడ్డంలో ఒక బండమీద కూర్చుంది. దాన్ని తపస్సుగుండు అంటారు. 12 సంవత్సరాలు స్వామిధ్యానంలో ఉండిపోయింది. వంటిమీద బట్టలు చిరిగిపోయినా, మారుబట్ట తొడగలేదు. దిగంబరంగానే ఉండిపోయింది. ఆమె పలికిన పలుకులన్నీ అమోఘవాక్కులే. గట్టు మీద కూర్చొని వ్యాపారము చేసేవారికి గానీ, వ్యాజ్యం పోయేవారికి గానీ, "అవుతుందిరో" అంటే బాగయ్యేది. "కాదురో" అంటే అంతే. అవ్వదగ్గరకు అనేకమంది తినడానికి మంచిమంచి పదార్థాలను తెచ్చేవారు. ఒకసారి అన్నిటినీ వదిలి అంత్యజుడు తెచ్చిన ఎండిపోయిన రొట్టె ముక్కను బ్రహ్మానందంగా తినింది. అతని పంట పండి ధనిక శ్రేణికి చేరుకున్నాడు.

ప్రతి ఏడాది మంగమ్మవ్వ జాతరరోజున ఉదయానే పసుపు, కుంకుమ, విబూధి, పండ్లు, పూలహారాలు, నెయ్యి, నిమ్మపండ్లు, వివిధ రకాల పండ్లు మొదలయిన పూజా సామాగ్రిని తెచ్చి అవ్వ గురువైన భీమలింగేశ్వరుని జీవసమాధి వద్ద ఉంచి పూజ జరిపించి, జీవసమాధికి చెసిన అభిషేక తీర్థమున, అంగారు, స్వామివారి జీవసమాధి పూజ చేసిన పూలు, పండ్లు, నిమ్మకాయలు, పసుపుకుంకుమ మొదలగు వాటిని కరడిగుడ్డంకు తీసుకెళ్ళిన తరువాతనే మంగమ్మ అవ్వరథోత్సవవేడుకలు ప్రారంభమవుతాయి.

# దేవాలయ వర్ణన

గడియాద్రిపురము (గడేకల్లు) లోని స్వామివారి దేవాలయము తూర్పుముఖాన నిర్మింపబడి ఆలయముందరి భాగాన దాదాపు 50 అడుగుల ఎత్తైన ధ్వజస్తంభము ఉండును. స్వామివారి జీవసమాధి మందిరాన స్వామివారివెండివిగ్రహాలు రెండు, సంజీవమ్మ వెండివిగ్రహము ఒకటి, పంచలోహాలతో చేసిన పార్వతీపరమేశ్వరుల కొలువుదీరి ఉండును. సమాధి వెనుకభాగాన స్వామివారి రూపము చిత్రీకరించబడిన చెక్కఫలక ఉండును. సమాధి మందిరము ముందు భాగాన విశాలమన మంటపము ఉన్నది. ముఖమంటపమునకు ఇరు వైపులా పీరుజాతి వారు బహుకరించిన నగారాలు ఇప్పటికి కూడా కొలువుదీరి ఉన్నాయి. ముఖమంటపమునకు ముందరిభాగాన స్వామివారి కాలంనాటి గుర్రము సమాధి ఉన్నది. దానిపై ఒక బృందావనము నిర్మింపబడి అందులో హనుమంతరాయ పూజా విగ్రహము కొలువుదీరి ఉండును. ఆలయప్రధాన ద్వారానికి ఉత్తరభాగాన మహాభక్తురాలు, శిష్యురాలైన సంజీవమ్మ సమాధి, సంజీవమ్మ సమాధి ముందరి భాగాన మొదటిపూజారి ఫక్కీరప్పగారి సమాధి ఉన్నది. పక్కీరప్ప వారసులు ఈ దేవాలయపూజాదికాలను చూసుకుంటారు. స్వామివారిభక్తులు మొదట సంజీవమ్మను దర్శించిన తర్వాతనే స్వామివారిని దర్శించడం ఆనవాయితి. ఆలయధ్వజస్తంభానికి దక్షిణభాగాన భోజనశాలనికి, కుడివైపునొక మంటపము ఉండును. జీవసమాధి మందిరానికి వాయువ్యభాగాన ఆ కాలాన త్రవ్వబడిన బావి, ఈశాన్యమూలన స్వామివారి కాలము నాటి గోని వృక్షము వేప వృక్షములు ఉన్నవి. 101 స్థానమైన గడేకల్లులో ఇప్పుడున్న వేపచెట్టు స్థానంలో స్వామివారు దంతదవనము తర్వాత నాటిన వేపపుల్ల మరుసటి రోజుకంతా చిగురించడం, స్వామివారు ఇక్కడ జీవసమాధి పొందాలని నిర్ణయించుకోవడం జరిగింది.

స్వామివారి మహారథోత్సవాలు ప్రతి సంవత్సరం ఆశాడ శుద్ధ పౌర్ణమి (గురు పౌర్ణమ) రోజు నుండి బహుళ పంచమి వరకు అయిదురోజులపాటు అంగరంగవైభవంగా జరుగుతాయి. మొదటి రోజున బిందెసేవ (గంగోత్సవం), రెండవరోజున మహారథముపైకి పంచకలశాదిరోహణము, మూడవరోజున ఉచ్చాయము మరియు మహారథోత్సవము, నాలుగవరోజున కుడుములాట మరియు గరుడోత్సవం, అయిదవరోజున వసంతోత్సవముతో స్వామివారి మహారథోత్సవాలు ముగుస్తాయి. అంతేకాక ప్రతి యేటా శ్రావణశుక్లపంచమి నాడు స్వామివారి జన్మదిన వేడుకలు, ఎంతో ఘనంగా జరుగుతాయి. స్వామివారి ఆలయములో ప్రతి సోమవారము, శనివారము విశేషపూజలు జరుపడుతాయి. ప్రతి అమావాస్యరోజున అన్నదానము జరుపబడుంది.

## మంగళం

మంగళం భీమలింగాయా మహనీయ గుణాత్మనే!
గడియాద్రి నివాసాయ కరుణాలయా దయామయా !!

సద్గురు! భీమలింగాయా సర్వాభీష్ట ప్రదాయినే!
సర్వ చైతన్య రూపాయా సాధురూపాయ మంగళం!!

సద్గురూ భీమలింగాయా సర్వశేఖరా ధీవరా!
సర్వదా పాహి మాం పాహి సత్య ధర్మ స్వరూపిణే

## మీ అమూల్యమైన సలహాలను మాతో పంచుకోగలరు

-------------------------------------------------------------

తపాల ద్వారా…

**శ్రీ వేములవాడ భీమలింగేశ్వరస్వామి అధ్యయన కేంద్రం**

బెల్దోణ గ్రామము, చిప్పగిరి మండలం, కర్నూలు జిల్లా, ఆంధ్రప్రదేశ్ – 518396

చరవాణి ద్వారా…

+91 8008911848; +91 9490441355

ఈ మెయిల్ ద్వారా…

kacharagadla@gmail.com; reddykiran.mb@gmail.com

అంతర్జాలం ద్వారా…

www.shribheemalingeswaraswamy.org

# స్మరణం

లోకవిఖ్యాతం శ్రీ భీమలింగేశ్వర లీలామృతం

శివం శంకరం భీమాత్మం

అక్షర యజ్ఞం కవీశ్వరం

గడియాద్రిపురక్షేత్ర నివాసం త్వం శ్రీ భీమలింగేశ్వరం

బ్రహ్మణ్యం భక్తాభీష్టప్రదం భక్తకీర్తి వివర్ధనం

ధర్మతత్వజ్ఞం శరణం భక్తవత్సలం

విద్యాం శ్రియం విపుల సౌఖ్యగగన కీర్తిం

సాదునంచ మహత్మానం వేములవాడ వాసినం

బుద్ధి ప్రదాయినీం సర్వశక్తి సమృద్ధి జీవం సంపదాం

పుండరీక పుండరీకాక్షయ యజ్ఞ ఫలప్రాప్తి ఏక స్మరణం

కమండలం ఋష్యంచ వేద విజ్ఞాన జ్ఞాన ప్రభు భీమైశ్వర్యం

సర్వాణి అపరాదాని క్షమస్య రక్ష రక్ష భీమలింగేశ్వర ముక్తి ప్రదంతం

సాదు సాదు స్వామి సర్వేశ్వర

యశః తపః శ్రీ భీమలింగేశ్వర

స్మరణం సుపుత్రం సుధాన్యం సుమిత్రం

స్మరణం సర్వ పాపహరం

స్మరణం శ్రీ భీమలింగేశ్వరం

ఓం నమో శ్రీ భీమలింగేశ్వరాయ నమః